నీవయస్సులవారు నీతోడిమునులు
దేవతామూర్తులఁ దీప్తిసమ్మితులు.
.........................
నీవాక్యవిభవంబు నీచిత్తశాంతి
భావించి యాశ్చర్యభరితుండనైతి."
ననవిని, యాస్తీకుఁడనియె: "రాజేంద్ర,

## ఆస్తీకజన్మవృత్తాంతము

తనయుండ నే జరత్కారుసంయమికి;
నాతండు బ్రహ్మచర్యంబు వేదంబు
ప్రీతివ్రతంబుగాఁ బెంపొందుచోటఁ,
బితరు లాతనిఁగాంచి పెంపారననిరి:
'ధృతిమంత, యిట్టిప్రతిజ్ఞలు గలవె!
ఉత్తమాంగములేని యొడలునుబోలె
సత్తనయుఁడులేని సంసారమేల!
నెఱి నిట్టినియమంబు నీవు చేకొనఁగ
నరయుచున్నారము నరకాననుండి;
చేయంగదే! దారచింతనం.' బనిన,
నాయుత్తముఁడు వారియాజ్ఞకు వెఱచి:
'నాకిది [1] సేయు, మన్నామకకన్య
నాకునౌఁగాని యన్యస్థితిఁగాదు.
కలుగునొకో జరత్కారు వెందైన!
నిలిపెదఁ గుల;' మని నిఖిలంబు నరసి,
యుట్టిది నాగకన్యక గల్గుటయును
నెట్టన నెఱిఁగి, పాణిగ్రహణంబు
చేసి........................
.........................

1. నాయ. (మూ)

మానినికిట్లనె : “ మగువరో, యొకటి
నేనీకుఁజెప్పెద నిర్ణయంబిపుడు ;
ఎప్పుడు నీవు నాయిచ్చనొప్పింతు
వప్పుడు నినుడించి యరుగుదుఁజుమ్మ ”.
అనియొడంబఱచి, సంయమి జరత్కారు
నొనరఁ బెండిలియాడి యుండె. నంతటను
నొక్కనాఁడువిద సూర్యుఁడు గ్రుంకు వేళ
నాత్ముకవై నిద్రించు మగని వీక్షించి :
“ తెలుపకుండిన నట్లో ! తెలిపిన నట్లో !
యలర నివ్వఁగర్త మవ్వాలసుఖము !
ఏమిసేయుదుంగి నా కేటియయ్యెడినో !
పాముతోఁజెలిమయ్యెఁ బతితోడనాకుఁ !
గడచె సాయంతనకర్తంబు [1] దీర్ప
నిదె సర్వమునులు నేఁగెదరు గాతమికి ;
నలిగిననలిగెఁ ; గార్యముచూత. ” మనుచుఁ
దెలిపిన, మౌనీంద్రు దృష్టిఁగెంపొదవ :
“ నే నిద్రపోవుచో నిపుఁడెల్లుగ్రుంకుఁ !
బూని కార్యము తలపోయలేవైతి !
సుఖ మేలచెఱిచితి ! సుప్తిఁబోలంగ
సుఖమొందఁగలదు ! సుస్థిరమతి ; ” ననుచుఁ,
‘ బతియిచ్చయెఱుఁగని పడఁతి కాపురము
ధృతిఁ దోవఁతప్పిన తెరువరియాత్ర ;
గావున, నోడఁబాటుగల నిన్ను డించి
పోవనెతగు నాతపోవనంబునకు.
కలఁ దుదయింప నీగర్భగోళమునఁ
గులదీపకుండైన కొడుకు భీతిలకు ’.

---

1. దప్ప. (మా).

అని చెప్పి ముని పోయె; నాతని సుతుండ;
దినకర తేజ, యాస్తీకుండ నేను.
నన్ను మెచ్చితి నంటి; నామాతృకులము
మన్నింపవే! యిట్టిమఖ మింక వలదు.
ఘనుఁడ, నీచేయు నాగ ప్రళయమున
*కనిలుండు, నీలుండు, నాశరభుండుఁ,
గర్కోటకుండును, గాలదంతుండుఁ,
దక్కింపఁ బారావతంబను పాము,
వక్షతుఁ, డశ్రుతాం, డాకక్షకుండు,
లక్షింప శంఖపాలుఁడు, ధనంజయుఁడు,
మణినాగ శబల వామన కిటింజయ శ-
రణ శశనులుఁ, బాండరము సనుఫణాలుఁ,
బౌసర నేరక ప్రాతపుష్కరకంబు
లనునివి మొదలుగా నన్నియు పడలెఁ.
గద్రువ మేనెఱుంగక మూర్ఛపోయె.
రౌద్రమింకేటి! కుర్వర మోవవలయుఁ!
జక్రిహింసిరియేల! చక్రిభక్తుఁడవు!
విక్రమంబిదియేల! ద్విజులుపన్నగులు.
గుహాచొచ్చి, పవనంబు గ్రోలుచుఁ జొక్కి,
తుహినాంశునిజకాంతి తూకొనఁగలిగి,
కంచుక మోక్షంబుగలుగు భోగీంద్రు
లించుక వెల్తి యోగీంద్రులుగారె!"
అనుటయు, జనమేజయక్షితీశ్వరుఁడు
కనికరం బెంతయుఁ [1] గలిగి నవ్వుచును
ఆక్షణంబున సర్పయాగంబు మానె.
దక్షకుం డావేళ, దాను నింద్రుండు

---

* ఈ పాముల పేర్లపట్టిక, తుదిమొదలు లేక చీకాకుగానుండుటచేఁ, గొంతవఱకు నక్షరములపోలికనిబట్టి కవిత్రయభారతానుసారముగా సవరింపఁబడెను.

1. గనలి. (మూ).

నిట 'తక్షకాయ సహేంద్రాయ' యనెడు
కుటిలమంత్రంబుల నుట్టుజనదలి,
హాహారవంబుతో నంతరిక్షమున
నాహుతిదిరుగుచు నగ్నిలోపలికి
నేతేర, నాస్తీకుఁడెలుఁగెత్తి నిలిపి,
పాతాళమునకంపె భయమెల్ల మాన్పి.
వినయంగ నాస్తీకముని పుణ్యచరిత
వినినవారికి లేదు విషధరభీతి.
ఆస్తీకముని మాన్ప, కట్టుయాగంబు
ప్రస్తరింపుటమాని, పారీక్షితుండు
నిగమార్థవిదులకు నిఖిలపాత్రులకుఁ
దగనొప్ప సంపూర్ణదక్షిణలిచ్చి,
మొనసినవేడ్కతో నమ్మునీశ్వరుల (?)
ననుపక తనయూరికరుదెంచి, యందుఁ
బదివేలపసిఁడికంబములకూటమున
మృదులతల్పంబున మెఱసికూర్చుండి,
యుచితాసనంబులనునిచి సన్మునుల
నుచిరతేజస్కులను సొగిసిఁ బూజించి,
వ్యాసు నశేషభావనంబూజచేసి,
యాసంయమికి మ్రొక్కి యంజలిచేసి :
" అయ్యా, వేదవ్యాస, ఆగమావాస,
నియ్యమగ్రహములు నిఖిలవేదములు ;
నీవాక్యసీమలు నిఖిలశాస్త్రములు ;
భావింప నూతనబ్రహ్మవు ; గాన,
బంచమవేదంబు భారతాఖ్యంబు
మించినవేడ్క భావించినకవివి.
అది నాకు సర్వంబు నానతియీవె !
ముదమొప్ప వినియెద మునులసన్నిధిని.

తపనుఁ డగ్గిరిఁ జేరఁ జనుదెంచి పు,
విపులయశుఁడైన యవ్వేల్పుఱేఁడిచ్చు
ననలభానుసమానమగు విమానంబు
వినువీధి నెప్పుడైన విహరించునట్టి
గాంచి యాకాశమార్గమునఁ జరింపఁ,
గాంచనరుచులు లోకములెల్ల నిండ
నుపరిచరుండయి, యుర్వీశరాజు
నపరిమితానందుఁడై యొప్పె మీఱె.
అరయ నొక్కెడ యే తాఁకనిక్కరము
చేరువఁ గాంచు విశేషసంపదలఁ.
జూచు నొక్కొకమాఱు సుకుమారమీన
లోచన శుభగుణ లోలదృష్టులను;
బలుకు నొక్కొకమాఱు బక చక్రవాక
కలహంస మధుకర క్రౌంచనాదముల;
మెలఁగు నొక్కొకమాఱు మృదుల మృణాళ
వలనహస్తవిలాస వైభవం బొప్ప;
నెలయు నొక్కొకమాఱు వీచిసంక్షోభ
కలిత కైరవ ఫేన కమలవాసముల;
వనచారణములు ప్రవాహమధ్యమున
మునుఁగఁ గుంభకుచాద్రులును గానవైన,
భయవతిగతిఁ బద్మపత్త్రాంబరమున
నయమతిఁ గప్పు నున్నతి నొక్కమాఱు;
నిగిడినయసుకతిన్నయుపిఱుందునకుఁ
దగు మొలనూలని తజ్జ్ఞలెన్నంగ.
దరి నోలి రాలిన తరుముకుళముల
యురుపంక్తి శోభిల్లు నొక్కొకమాఱు;
అరవిందములమీఁద నళిసమూహంబు
సరసవైఖరి ప్రాలి సందడించుటయును,

జయ్యన దొప్పలో సవరించి, యంత
నయ్యెడ సకలభాషాభిజ్ఞుఁడగుట
నొక డేగ రప్పించి యుర్వీశుఁడనియెఁ :
"ప్రకటితపురుషార్థపరుఁడ వో పక్షి,
విష్ణువాహన వంశ[1] విదితుఁడ వీవు ;
విష్ణుభక్తుఁడ నేను ; విను మొకమాట.
చిత్తజజలము నించితి మేను మఱచి ;
యెత్తెఱంగో సరింతు ! నిదియమోఘంబు !
కట్టెద నీమెడఁ ; గను వేగఁబోయి,
నెట్టన నీవయ్య నీ చెలియలికి.
ఘనశఁ బక్షంబులు గలిగినవాని
తనయకు నీదు బాంధవ మెందుఁ గలదు !"
అనుచు దగ్గఱఁ బోయి యావీర్యపాత్ర
యనఘుండు మెడఁ గట్ట, నది మీఁది కెగసి
పోవఁ బోవఁ గ, మాంసబుద్ధి నచ్చటికి
నావల నొకపక్షి యడ్డంబువచ్చి
యాలంబు సేయ, వీర్యంబు దొలంకి
కాళిందినదునీటఁ గాఱెఁ ; గాఱుటయు,
నదిమ్రింగి గర్భమై యుండొక మీను
చదురైనవిధియాజ్ఞఁ జరియింపుచున్న,

## మత్స్యగంధి జనన వృత్తాంతము

నంబుధిలోన జాలంబులు వన్ని
పంబినయామీనుఁ బల్లెవాఁడొకఁడు
వేటలాడుచుఁ బట్టి వేతెచ్చి యింట
వాటంపుఁగూరకు వాలుఁగఁ దఱుగ,

1. విదుడవునీవు. (మా)

ముత్తెంపుఁజిప్పలో ముత్యమువోల్కి
చిత్తజుఁడీమమై చెలువ యొక్కత్తె
కానవచ్చిన, [1]సిద్ధిగన్న నిర్వేద
పూనిక నాత్మలోఁబొంది, [2]ధీవరుఁడు
నబ్బాలికామణి సాకి పెంపొసఁగ,
గుబ్బగుబ్బనఁ జన్నుగుబ్బలు చేప
పడఁతియిల్లను : "దీని భవుఁడిచ్చెఁగాక !
మనకెట్లు ! మీనెట్లు ! మాటబిడ్డయెట్లు !
అనపత్యతాదోష మడఁగెఁగా నేఁడు !
పౌసరఁ బొందెడుసొమ్ము పొందుమెందున్న.
దక్కెఁబో మన మోదరాజా కీర్తి ;
మత్రణంబునఁ దీఱు నక్కారవెల్ల.
మత్స్యమారణ మింక మానుము నీవు ;
మత్స్యగంధననామ మలరు దీనికిని ;
బూనిపెంతముగాక పూఁబోఁడి". ననుచు

..........................

ఇరువురుఁ బ్రియమునతో నేఁతమ్మునను
నరయ, సత్యము నది యభివృద్ధిపొంది,
కరువునఁబోసిన కనకంపుఁబ్రతిమ
కరణి యౌవనవేళఁ గనుఁజూడనొప్పఁ,
గాళిందిలో నోడగడప నయ్యాతివఁ
జాలించెఁ గైవర్తచక్ర[3]వర్తియును.

## వేదవ్యాసావతారము

అంతట, నొకనాఁడు హరిపరాయణుఁడు
శాంతిశీలుఁడు పరాశరమునీశ్వరుఁడు,

---

1. నిదిగన్ననిర్వేద. 2. దేవలుండు. 3. వర్తులును. (మూ)

మాససహస్రంబు మఱి తీర్థయాత్ర
చేసి, యచ్చోటికిఁ జెలువొప్పవచ్చి,
లోలవీచుల నాకలోకంబు ప్రాఁకు
కాళిందిదాట నక్కడ త్రోవలేక
'యోడవారెచ్చోటనున్నారొ'! యనినఁ,
జేడియవిని వచ్చి చేతులు మొగిచి :
"యేతెంచి మునినాథ, యెక్క వేయోడ ;
మాతువుగాని నా[1] సూటి యీవనికి ;
వావిరి యమునాప్రవాహంబు దాటి
యావలనున్నాఁడవని విచారింపు.
దట్టపుభవవార్థి దాటెడునీకు
నిట్టికాలువలెంత! యేతెంతుగాక."
యనిన నాయింతి నయంబుఁ బ్రియంబుఁ
దనుకాంతియును జూచి, తాపసోత్తముఁడు
కన్నులతళుక్కులుఁ గల్కిమొగంబు
నన్నువనడుము ధైర్యముఁజట్టికొనఁగ,
నతివలావణ్యప్రవాహంబునందుఁ
బతితుఁడై యాకాశపథము చూచుచును,
జావలంబున బ్రహ్మచర్యధనంబు
తీవువిల్కాఁడను తెక్కలి గొనఁగ,
నేమియుననక, మునీంద్రుఁ డయ్యెట
భామినివలకేలు ప్రాపుగాఁబట్టి,
యుచితాసనంబుననుండి, యాయతివ
కుచములసొబగును, గురులతేటయును,
నయనవిభ్రమమును, నడుములేమియును,
బ్రియదర్శనంబైన పిఱుఁదుఁ, బిక్కలును,

1. మాలునావనికి. (మా)

ముంగొంగుకొంగఁద్రోచి మోఁకఁజెంచుటయుఁ,
దొంగలించెడు మిసిమితోడలఁ గ్రొమ్మించు,
దర్విచే నుదకంబు తప్పించునపుడు
పర్వికానఁగవచ్చు బాహుమూలములు,
బలువున మునివ్రేళ్లఁ బలకత్రొక్కుటయుఁ,
దలదిండులైన పాదములపెంపులును,
గిన్నరశ్రుతినాడు కృష్ణాహిపోలె
వెన్నున విహరించు వేణియుఁ జూచి,
కౌతుకంబున నోడఁగడపకయుండఁ
జేతులు ముని పట్టి చెలువకిట్లనియె :
" అంగజు [1] సాక్షిగా నబల, యిచ్చోట
సంగమమగుఁగాక సరి నీకు నాకు.
ఉత్తమసతితోడ యోగమౌనేని,
హత్తినబ్రహ్మచర్యము చెర్గి [2] పోదు ;
చెరిగిపోయినఁబోయెఁ ; జెప్పెడిదేమి !
తెఱవ, నీపొత్తుసంధిలవలె నాకు.
చూచితిశర్వాణిఁ ; జూచితిరతిని ;
జూచితిహరిరాణిఁ ; జూచితిరంభ ;
వింతపుట్టియెఱుంగ ; వేయేల ! నేఁడు
కాంత, నీయెడనయ్యెఁగన్నుల మరులు."
అనిన, ధైర్యముఁబట్టి యబల యిట్లనియె :
" ననునేలపట్టెదు ! నాకులమెంత !
యేముపల్లియవార ; మీవుసన్మునివి !
రాములుతేర ! పరాశరబ్రహ్మ !
[3] చెలువుదైవమెఱుంగుఁ ! జెఱుమీనుపొలసు
వలచునాదేహంబు వతి కయోగ్యంబు.

---

1. కాంతిగా 2. చిర్వవోదు. 3. చిలువదైవ మెఱుంగు చిఱమీనుపొలను. (మూ)

రతిసల్పవచ్చునె! రాత్రిగా; దీవు
[1]యతిపతి; వదిగాక, యేనుగన్యకను;
ఈవు మున్నలిగిన నెసగుదావాగ్ని;
గావున, నేమిపల్కఁగనేమియగునో!”
అనుటయు, మునిచంద్రుఁ డంధకారంబు
కెనయైనయూడ [2]మం చటగల్గఁజేసి,
కాంతియుఁ గన్నెఱికముఁ జెడకుండఁ
గాంతకువరమిచ్చి, కకూర్తితోడ
వరదనొయ్యనవచ్చి, వడి నొక్కచోట
నొరగినయాఱోడ [3]నొడ్డునఁజేర్చి,
‘రమ్మ’ని కామినీరత్నంబు డించి,
సమ్మదంబున దర్భశయ్య గావించి,
యువిద మన్మథకేళి నోలలాడింప,
ధ్రువకీర్తి యపుడు సద్యోగర్భమునను
నుత్తుంగభుజములు, యోగదండంబు,
జొత్తిల్లుజడలును, సోగకన్నులును,
నీలాభ్రరుచులును, నెఱిఁగృష్ణమృగము
తోలుపుట్టంబు, వర్తులకమండలము,
లీలముక్తాక్షమాలిక, జన్నిదంబు,
వేలఁబవిత్రంబు వెసఁ దోడ మొలవ,
బ్రహ్మాంశమునఁ దాఁ దపస్వియైపుట్టె
బ్రహ్మణ్యుఁ డావ్యాసభట్టారకుండు.
ద్వీపంబునందు సంధిల్లుటఁజేసి
ద్వైపాయనాఖ్యగాఁ దండ్రిగావింప,
ధర నిట్లుజనియించి తల్లిదండ్రులకుఁ
గరములుమొగిచి: “యోకరుణాఢ్యులార,

---

1. యెంతిరతి. 2. మచ్చట. 3. నొయ్యన. (మూ)

తపమున కేఁగెద ; దయతోడ ననుపుఁ ;
డపరిమితోత్సాహుఁడై యున్న వాఁడ.
మీనిమిత్తంబున మేనుసిద్ధించె ;
నేనుజేసినపుణ్యమెల్ల మీసొమ్ము.
పలుమాఱు వేడ్కతోఁ బనిగల్గునపుడు
తలఁపుఁడు వచ్చెదఁ దాత్పర్యమొప్ప ;"
ననిచెప్పి మ్రొక్కి, [1] హిమాద్రియవ్వలికిఁ
జనియె నాతఁడు దేవచక్రంబు పొగడ.
అట పరాశరుఁడును సయ్యేఱుదాటి,
కుటిల [2] కుంతలను వీడ్కొని వేగసరిగె.
ఆవిధమునఁ దప మయ్యద్రి నతఁడు
గావించి, మఱి పెక్కుకాలంబునకును
ఆదిమబ్రహ్మఁ బ్రత్యక్షంబుచేసి,
యాదేవుచే విద్యలన్నియు నేర్చి,
యాదరంబున లెక్కకధికంబులైన
వేదంబు లొండొండ [3] విభజించి తీర్చి,
సారబంధంబుగా జనులకుఁ జదువ-
నేరవచ్చినపాటి నెఱి నాల్గుశ్రుతులు
విరచించి, పిదపఁగావించె భారతము
సరవి సపాదలక్షశ్లోకములను.
అంతట నది మాకు నానతియిచ్చె ;
నింతయు నీకు నే నెఱిఁగింతు వినుము.
పంచాక్షరియుఁబోలెఁ బరఁగినకథను
బంచమవేదంబు పాయక వినినఁ,
బంచపాతకములు ఁబాయు భూనాథ !
పంచ [4] శత్రుండిచ్చుఁ బరమసంపదలు.

1. హేమాద్రి. 2. కుంతలిని. 3. విభగించి తిగిచి. 4. శర్ణుండిచ్చు. (మా)

పరగఁ ద్రేతాయుగపరిణతిఁ దొల్లి
గురువధ నుగ్రుఁడై కువలయాధిపులఁ
బరశురాముఁడు తనపరశువుధార
నిరువదియొక్కమాఱేచి చెండాడి,
¹ పేరిననెత్తుటఁ బితృతర్పణంబు
కోరినట్లనె చేసి కోపంబుమాని,
తెలిసి ధారుణియేడుదీవులు నపుడు
లలిమీఱ బ్రాహ్మణులకుధారవోసి
తపమునకేఁగంగ, దైన్యంబుతోడ
నృపుల భార్యలువచ్చి, నెఱిదిక్కులేక
తడయుచు, ² దాఁగుచు ³ దరిసి, కశ్యపునిఁ
బొడగాంచి వేడ్కఁ దత్పుణ్యునకెఱఁగి :
“ పావకముఖములఁ బతులతోఁగూడఁ
బోవ మాకబ్బకపోయెఁ బూర్వమున ;
నింక నేగతిఁబోదు ! మేదియాధార !
మంకిలిగాకుండ నాసతియీవె !
కన్నుగానక క్రొవ్వి క్షాత్త్రవీర్యంబు
పన్నినకలహంబు ఫలియించెమాకు. ”
అనినఁ, గృపారాశియగు కశ్యపుండు
వనితలఁబలికెఁ దత్త్వము విచారించి :
“ కులమునిల్పుటకంటెఁ గువలయాత్ములకుఁ
గలవె ధర్మంబులు కలకంఠులార !
తప్పులుపట్టక, దయ నేను మీకుఁ
జెప్పెడధర్మంబు చెవిదూర వినుఁడు.
వెరవొప్ప నిందఱు విప్రవీర్యంబు
ధరియింపఁగలరె సంతానసిద్ధికిని !

1. పెరిగిన. 2. తాఁకుచు. 3. దడసి. (మూ)

ఏవగింపక సేయుఁ ; డిదిమహాధర్మ
మేవిధంబులయందు నే వినియుండు ;
నేయుగంబునఁ జేయ రవ్వారు మున్ను ;
నాయాజ్ఞ నిది మీరునడపుఁడు మేలు."
అనుడు నమ్మునియాజ్ఞ యందఱుఁ జేసి
తనయుఁగాంచ, నత్తనయు లింటింటఁ
బెరిగి పిత్రులయాజ్ఞఁ బృథివి రక్షింపఁ,
బరఁగిన ధర్మప్రభావంబువలనఁ
గురిసె వర్షంబులు గోరినయట్లు ;
ధరణి సస్యములెల్ల ధాన్యమై [1] రూఢిగాఁ ;
బెల్లుగా మొదవులు పిదికెఁ జన్నవిసి ;
కల్ల [2] పేదఱిమి రోగములస్తమించె ;
నిరువురఁగూఁతుల నెనమండ్రసుతుల
నిరపాయులగువారి నెలఁతలు గనిరి ;
పదివర్షములనాఁడె బ్రహ్మచారులకుఁ
జదువక ప్రాపించె సర్వవిద్యలును ;
ముదిసియు, నౌషధంబులలావువలన
వదలరుతలుచు ; చావరు మహీజనులు.
ధరలోన నగ్నిహోత్రములేని ద్విజుఁడుఁ,
బురుషునిఁబాసినపొలఁతియు లేదు.
వన్యధాన్యంబుల వనచరుల్ దనిసి,
సన్యసించిరి హింస జంతువులందు.
హరులును గరులు వాహనములుగాని,
నరవాహములులేవు [3] నరులమోయుటకు.
ఇట్టివైభవముల [4] నెనసి మానవులు
పుట్టయీనినయట్లు భూమిఁ గ్రిక్కిఱియు,

1. పెరిగి. 2. పెదరమి. 3. నరులుమోవమిని. 4. నెంచి. (మూ)

గిరి శేష మహాంతంగ కిటి కూర్మములకు
ధరియింపరాక యెంతయు భారమైన,
ధర నిండుచూలు కాంతయుఁబోలె నలసి,
శరధిలో నురగేంద్రశయుఁ గానఁబోయి,
నామంబునొడివి ప్రణామంబుచేసి
లేమ యల్లన లక్ష్మి లేనత్త లేచి,
వడఁకుచునిట్లనె: "నాప్రాణనాథ,
జడిసితి మాన్పవేజంతుభారంబు!
నాకునై కిటివైతి; నలిఁ గూర్మమైతి;
నీకుఁబోవున దేవ, నేఁటిపట్టునను.
పుక్కిటఁ బదునాల్గు భువనంబులందు
... ... ... ... ... ... ...
ఏనిదే లెక్కకునెక్కుడైనట్టి
మానవమాత్రుల మతిమోహవఁజాల.
[1] ఖలమైన ధర్మ విక్రియ రాజసుతులు
చెలువార నాచరించిన ప్రభావమున
శాఖోపశాఖలై చెలువుప్పతిల్ల
లేఖపూజిత, ముప్పులేకయున్నారు.
ఇన్నియు నీమూర్తు; లివి యింకఁ గొన్ని
నిన్నుగూడినఁగాని నిలువలే." యనినఁ
గరుణించి, ధరఁజూచి కమలాక్షుఁడనియె:
"నరులువ్రేఁగైరని నాతి, వగడకుము;
వచ్చునియావ్రేఁగు నరుఁడనై పుట్టి
పుచ్చెద ములు ముంటఁబుచ్చినయట్లు.
ఏనట్లుపుట్టిన, నింద్రాదు లమర
[2] దానవులు నరులుగా నుదయింపఁగలరు.

1. కల. 2. దానవుల శేరులఁ. (మూ)

తెలిపి వారలరెండు తెగలుగాఁగూర్చి
కలహింపఁజేసెదఁ గళ్యాణి, వినుము.
అందు నిందునుగూడి యధికమౌనష్టంబు
ప్రొందుదు ; రంత నెమ్మదినుండుగాని".
అని భూమివీడ్కొల్పి, హరి యంత వెనుక
మనుజుఁడై, శ్రావణమాసకృష్ణమున
నష్టమి రోహిణి నర్ధరాత్రమున
దృష్టింప వసుదేవదేవకులందుఁ
బన్నగేంద్రుఁడు బలభద్రాఖ్యుఁ డనకు
నన్నయై మునుబుట్ట, యదుకులాంబుధిని
[1] కృష్ణ నారాయణ కేశవ జిష్ణు
విష్ణు నామసహస్ర విభవంబునందు
రామ రామాంతర రామావతార
సామర్థ్యరూపమై జనియించి మించె.
హరిజన్మ మదివిన్న నఖిలపుణ్యులును
హరిరూపులైయుందు రందును నిందు.

## సురాసురులయంశమున భీష్మాదివీరులు జనించుట

హరి యిట్లు జనియింప, నసురులు సురలు
[2] హరివాక్యమున ధాత్రి నటపుట్టుచోట,
వసువులయంశముల్ వలనొప్పఁ దాల్చి
పొసఁగ భీష్ముఁడుపుట్టెఁ బుణ్యమానసుఁడు ;
ద్రోణుండుపుట్టె శుక్రునియంశమునను ;
క్షోణిఁ గర్ణుఁడుపుట్టె సూర్యాంశమునను ;
రూఢి నేకాదశరుద్రులంశమున
[3] గూఢముగ నుదయించె గుణమూర్తి కృపుఁడు ;
మహినిఁ గామ క్రోధ మద మత్సరముల
సహవాసలీల నశ్వత్థామపుట్టె ;

---

1. సహస్రనామకుఁడగు విష్ణునవతారములలో రామత్రయ సామర్థ్యము గలిగి కృష్ణుఁడు జన్మించెనని కవితాత్పర్యమేమో ! 2. హరిలోకమున. 3. గూఢగా. (మా)

ఉరుశక్తి ద్వాపరయుగము నంశమున
ధరఁ బుట్టె శకుని జూదపునేర్పుతోడ ;
[1] ఘనుఁడు హంసుండను గంధర్వునంశ
మున ధృతరాష్ట్రుండు పుట్టె భూవిభుఁడు ;
విను మంత [2] మతియను వేల్పునంశమున
జనియించె గాంధారి శతపుత్త్రమాత ;
కలియుగాంశంబునఁ గడుఁగ్రూరుఁడగుచుఁ
దులితార్యుఁ డుదయించె దుర్యోధనుండు ;
తనరఁ బౌలస్త్యసోదరులు నూర్వురును
ననుజులై యుదయించి రాకౌరవునకు ;
శిశుపాలుఁ డుదయించెఁ జెలఁగి హిరణ్య-
కశిపునంశంబునఁ గడుఁగ్రూరుఁడగుచు ;
అనువొప్ప సహ్లాదుఁడను దైత్యునంశ
మున శల్యుఁడుదయించె భుజబలోన్నతుఁడు ;
తగనొప్ప బాష్కలదైత్యునంశమున
భగదత్తుఁ డుదయించెఁ బరమవైష్ణవుఁడు ;
విప్రచిత్తను యక్షవిభుని యంశమున
నప్రతాపుఁడు జరాసంధుండుపుట్టె ;
ననఘ ! నపుంసకుండగు [3] గుహ్యునంశ
మునఁదోఁచె మలకంటి (?) మొండిశిఖండి ;
మానుగాఁ బుట్టిరి [4] మరుదంశమునను
శైనేయ విరట పాంచాలురన్నృపులు ;
సదయాత్ముఁడైనట్టి జమునియంశమున
విదురుండు జనియించె విష్ణుభక్తుండు ;
అదె బ్రహ్మయంశంబునందుఁ బాండుండు
నుదయించె నెంతయు నుర్విమోదింప ;

---

1. ఘనుడై ననఘుడై గంధర్వయంశ. 2. మయయను. 3. దైత్యునంశ.
4. మను దేశమునను. (మూ)

సిద్ధి బుద్ధి యనంగ సిద్ధకామినుల
యిద్ధాంశములఁ బుట్టి రిలఁ గుంతి మాద్రి;
ధర్మాత్ముఁడైన యంతకునియంశమున
ధర్మరా జుదయించె ధరయెల్లఁబొగడ;
నామహాత్ముని తమ్ముఁ డనిలునంశమున
భీమసేనుఁడు పుట్టె భీమప్రతాపి;
నరుఁడనుముని వచ్చి నాకేంద్రునంశ-
భరమునఁ గ్రీడియై ప్రభవించి మించె;
[1] సహజు లశ్వినులయంశమ్మున నకుల
సహదేవు లొదవిరి జగతినిఁ గనలు;
శ్రీయంశమున యాజ్ఞసేని జన్మించె;
నాయెధృష్టద్యుమ్నుఁ డగ్నియంశమున;
వివరింప భారతవీరులు మఱియు
దివిజాంశ దనుజాంశ దృష్టరూపముల
నవతరించిరి; యందు నమరాంశులెల్ల
రవితేజుఁడైన ధర్మజుని వారైరి;
యసురాంశభవులెల్ల నాసుయోధనుని
వసమున నుండిరి వైరంబుదలఁచి.
అట్టిభారతవంశమనుసముద్రంబు
పుట్టెఁ జంద్రునినుండి బుధుఁడాదిగాఁగ.
జలరాశిఁ జంద్రుండు జనియించెఁగాక;
జలధి చంద్రునియందు జనియించుటరుదు!
నుతికెక్క దుర్యోధనుఁడు బడబాగ్ని;
యతిరథ సమరథు లందు జంతువులు;
సొరిదిఁ బుట్టినరాజసుతులు రత్నములు;
అరయ వారలకీర్తి యమృతరసంబు;

1. సహ్యాదయూ లశ్వినులంశమున. (మా)

మొగి ధర్మసుతునికమ్ముల తరంగములు ;
తగఁ జెలియలికట్ట ధర్మజాత్మ్రి ;
కలహానసాయములు కలిసిననదులు ;
తలకొన్న శకునిఁజూడదగు డానివిషము ;
ఆరయ మధ్యస్థుఁడై వినోదించు
నారాయణుం డాదినారాయణుండు.
సకలభూతోద్భవము సరవిఁతో విన్న,
సకలసంపదలిచ్చు సర్వేశ్వరుండు.
ఇట్టివంశమున ననేకులు నృపులు
పుట్టి, యీయిలయేలి పోయిన వెనుక,

## యయాతి చరిత్ర

నహుషాత్మజుండైన నవకీర్తిశాలి
యహిమాంశునిభుఁడు యయాతిభూవిభుఁడు
సకలరాజ్యంబును సవరగా నేలి,
ప్రకటించి క్రతువులు బహుభంగిఁజేసి,
యతఁడు శుక్రునికూఁతు నసురేశుకూఁతు
నతి దేవయాని శర్మిష్ఠలన్వారిఁ
బరఁగవరించి, యాభార్గవియందు
వరుసతో యదునిఁ దుర్వసువునిఁ గాంచె.
సహ్యధర్మాత్ముఁ డాశర్మిష్ఠయందు
ద్రుహ్యానుపూరుల దొరయంగఁబడసె.
అంత, శర్మిష్ఠపై నవనీశుకూర్మి
కొంతకాలమునకు శుక్రునికూఁతురెఱిఁగి,
కోపించి జనకుతోఁ గుందిచెప్పుటయుఁ,
దాపసుండాకవి తద్దరోషించి :
'నాకూఁతు నవ [1] మాననము చేసెఁగానఁ,
జేకూరు పీనికి శిథిలంపుముదిమి.'

1. అవమాన్యత. (మూ)

అని శాపమిచ్చిన నతఁడునట్లగుచుఁ
తనయులకిట్లనుఁ జా : 'సుతులార,
మీ జవ్వనంబిచ్చి మీలోన నొకఁడు
నా జరఁ గొనుఁ'. డన్న నలుగురు సుతులు
'నోపము పో' మ్మన్న, నొసఁగఁ బూరుండు
చేపట్టె జర, తనచిన్ని ప్రాయంబు
జనకునకిచ్చిన, జననాథుఁ డలరి
తనవంపు సేయని తనయుల విడిచి,
తన రాజ్యమునఁ బూరుఁ దగ వొప్ప నిలిపి
ఘనతపోమహిమ నాకంబున కేఁగె".
అనవిని జనమేజయావనీనాథుఁ
డనఘు వైశంపాయనార్యు నిట్లనియె :
"వినుతాత్మ, మావంశవృద్ధులందఱును
ఘనధర్మపరులని కలయ నెన్నుదురు.
రాజయ్యుఁ దా నెట్లు రమణ యయాతి
యోజ శుక్రునికూఁతు నుద్వాహమయ్యె!
నీసందియము నాకు నెఱుఁగంగఁ జెప్పు ;
మీ సమ్మతులఁ జూడ నిది యధర్మంబు".
అనిన నా నృపుఁ జూచి యమ్మౌని పలికె :
"విను మీర్పరింతు నావృత్తాంతమెల్ల ;
మును వృషపర్వుండు ముదమొప్ప దనుజ
ఘనరాజ్యమంతయుఁ గడిమి నేలుచును,
నొనరిన దానవయోధులఁ గూడి
తనర స్వర్గముమీఁద దండెత్తిపోయి,
యమరులుఁ దానును నతిఘోరరణము
నమితంబుగాఁ జేసి యపజయంబొదవి,
యేతెంచి, తమపురోహితునకు నపుడు
[1] భ్రాంతితోఁ బ్రణమిల్లి భక్తి నిట్లనియె :

1. భ్రాంతితో. (పూ)

" భార్గవ, యెప్పుడు బవరంబులోన
స్వర్గధీరులు మాకు జలదరింప్రమురు.
నేఁడిదె దైత్యుల నిర్జరోత్తములు
పోఁడిమిఁజంపిరి పుణ్యాత్మ, వారి
సంజీవనీమంత్ర సామర్థ్యమునను
సంజీవితులఁజేసి జయమిమ్ము మాకు ".
ననుచుఁ బ్రార్థన సేయ, నలరిశుక్రుండు
తనమంత్రశక్తిచే దనుజులఁగాచె.
ఈవిధంబున మఱి యీల్గురాక్షసుల
నేవెంట నాశుక్రుఁ డెలమిరక్షింప,
బ్రదికి దానవులెల్లఁ బ్రబలులై సురలఁ
బ్రిదులక చంపంగ, భీతులై వారు
తమకు సంజీవని తగులమిఁజేసి
తమసేనపాలియుట తర్కించిచూచి,
తమపురోహితునాజ్ఞఁ 'దత్పుత్రుఁ గచుని
[1]నమర నీమంత్రార్థ మర్థింత' మనుచుఁ
గచుఁడున్నకడకేఁగి, గారవంబొప్ప
నుచితంబుగావించి యొనరనిట్లనిరి :
" ఓమహాత్మక, నీవు యోగ్యవిప్రుండ ;
వేము మీశిష్యుల ; మిందువచ్చితిమి ;
శుక్రసంజీవనీ సురుచిరస్ఫూర్తి
విక్రాంతి దైత్యులు వెఱవరు మాకు ;
వారిచేఁదెగిన మా వరసేనలెల్లఁ
బోరిలోఁ బోయినపోకయైచనిరి ;
కావున, నీ వింకఁగౌశలంబొప్ప
నేవిధంబుననైన హితమాచరించి,

1. అమరనిమంత్రంబు లందింతుమనుచు. (మూ)

శుక్రుచే సంజీవి [1] శుభదమంత్రంబు
సక్రమంబునఁగాంచి జగగిరావయ్య!
అట్లైన, మాకు నీయమరరాజ్యంబు
నెట్టనసిద్ధించు నీప్రసాదమున."
ననుచు దేవతలెల్ల నర్థిఁ బ్రార్థింప,
ననయంబుఁ గచుఁడును 'నవుఁగాక' యనుచుఁ
జనుదెంచి, యాశుక్రసంయమీంద్రునకు
వినతి దండము వెట్టి వేడ్కనిట్లనియె:

### కచుఁడు సంజీవనీవిద్యకై శుక్రునొద్దకేఁగుట

"ననఘాత్మ, యేను బృహస్పతిసుతుఁడ;
నొనరంగఁ గచుఁడ; మీయొద్దనె విద్య
లన్నియుఁ జదువంగ నరుదెంచినాఁడ;
నన్నుశిష్యునిఁగాఁగ నడుపవే!" యనినఁ,
గావ్యుండు 'నట్లనె గావింతు' ననుచు
భావ్యంబు మదిలోనఁ బరికించి చూచి:
'యూఘి వీఁ [2] డమరపురోహితుకొడుకు
ఈడఁజదువుట నాకు నెన్నిక;' యనుచు,
నాకచునకు వేడ్క నఖిలశాస్త్రములు
జోకగాఁ జెప్పుచు శుక్రుఁడున్నంతఁ,
గచుఁడును గురుసేవ కడఁకఁ జేయుచును
నచట శుక్రునికూఁతురగు దేవయాని
నిచ్చలుఁ దనతోడ నెయ్యంబుసేయఁ,
గ్రచ్చఱ నొకనాఁడు కాననంబునను
హోమధేనువుఁ గాచుచుండంగఁ జూచి,
తామసులైనట్టి దానవులలిగి,

---

1. సుపద. 2. విందమర. (మా)

‘పగవారిపాలఁ బడనిత్తురే’ యనుచుఁ
దెగిచంపి; రంతలో దినపతిగ్రుంకె.
హోమధేనువులెల్ల నొగిఁ దోవఁబట్టి
తాము యింటికిరాఁగఁ, దనసఖుఁ గచునిఁ
గానక భార్గవి కలఁగి శోకింప,
దానవాచార్యుండు తనయ కిట్లనియె:
“శోకింపనేటికి సుదతి, నీకిప్పు
డేకోర్కె యైన నే నిచ్చెద ననుఁగు;”
ననిన, నాతండ్రితో నాతియిట్లనియె:
“అనఘాత్మ, నేఁ డేమి గోవులవెంటఁ
గచుఁడు రాఁడాయెను! గానలోపలను
[1] క్రూరంపు మృగకోటి పాలాయెనో కా!
ఏవిధంబుననైన నెఱిఁగి, నీమహిమఁ
దేవయ్య వాని నాదృష్టిభూమికిని.”
అనుడు శుక్రుఁడు తనయార్తిఁ జింతించి,
దనుజులచేనొచ్చి ధరనుండుటెఱిఁగి,
సంజీవనీవిద్య చయ్యనఁబుచ్చి
సంజీవితునిఁ జేసి, సామర్థ్య మొప్ప
రప్పింపఁ, గచుఁ జూచి తాను భార్గవియు
నుప్పొంగె హర్షాశ్రులొలుకంగ నపుడు.
వెండియు నొకనాఁడు వికటాటవులను
దండినావులఁ గావ, దనుజులు కినిసి
కచునిఁ జూర్ణముచేసి కలితమద్యమున
నుచితంబుగాఁ గూర్చి యుశనునకొసఁగ,
దానవాచార్యుం డుదగ్రుఁడై త్రావి
తానుదన్నెఱుఁగక దర్పించియుండె.

1. ప్రచితంపు. (మూ)

అంత మాఁపటివేళ నాలమందల వెంట
నెంతయుఁ గచుఁగానక కిటు చేసికొనుచు
జనకునకిట్లను : “ జనక, యిదేమొ !
ఘనుఁడు నీశిష్యుఁ డెక్కడఁ బోయినాఁడు ?
అసురులు నేఁడును నడవిలోఁ బట్టి
[1] మినిమింగఁ జేసిరో మిన్నక వాని ” !
అనవుడు భార్గవుఁ డాత్మజకనియెఁ :
“ దనయ, యేవంకనైన దానవులెల్లఁ
జలముగొన్నారు ; నేఁ జాల రక్షింప ;
నలయక కచుఁడింక నరుగఁడు దివికి.
తా డెక్కుడు మానిసిఁ డగఁ గ్రిందుపట్టి
యెడగాను ద్రోయుంగ నెవ్వారివశము ! ”
అనినఁ, దొయ్యాలిపలుక : ‘ నతఁడులేకున్నఁ,
గొన నన్నపానముల్ కొందుచు. ’ యనుడుఁ,
దనయపై ననురాగదయఁ దోటఁజేసి
విని, భార్గవుండు వివేకించిచూచి,
యన్నిలోకంబుల నెందు లేకున్నఁ
గ్రన్ననఁగని, తనకడుపులోఁ జూడఁ
బోవంగ నందులో [2] బుగ్గియైయుండె ;
గావున, సంజీవిఘనమంత్రశక్తి
బ్రదికించి, వానికిఁ బ్రాణమంత్రంబు
లాదవినదయతోడ నుపదేశమిచ్చి :
‘ యిందాఁక నాజ్ఞాన మొడలించెమధువు ;
నిందితంబగుఁగాక నేటి నింకనుండి ;
[3] వరఁగ మధుపానంబు పాతకం. ’ బనుచు
గురుసమయముచేసి గురుపుత్రుఁబలికె ?

1. మినిమిగా. 2. బుద్ధి. 3. పరగని మధుపానపాతకుండనుచు. (మూ)

"ఓవత్స, నీవు నాయుదరంబు చించి
వేవచ్చి యీమంత్రవిభవంబుచేత
నను బ్రదికింపుము నయవిధి." యనినఁ
ననయుంబు నాతండు నట్లకాఁ జేసి,
దండప్రణామంబు దగ నాచరించి
కొండంతభక్తితో గురునకిట్లనియె:
"అనఘాత్మ, నీచేత నఖిలవిద్యలును
దనరంగ నేర్చితి ధర్మమార్గమున;
భారతీదానంబుఁ బ్రాణదానంబు
నేరుపఁగల నింక నెఱయ నన్యులకుఁ;
బోయెద నే;" నన్నఁ బొంగి భార్గవుఁడు
ధీయుక్తి నాకచు దీవించి యనిపె.

## కచదేవయానుల పరస్పర శాపప్రదానము

అనిపిన నాదేవయానికిఁ జెప్పి,
చనియెదనని పోయి జవ్వనిఁబలికె:
"గురుఁడురమ్మని నాకుఁ గోరిపుత్తెంచె;
గురునిచే నంపించుకొని వచ్చినాఁడ;
నెఱి నింకఁ బోయెద నిజగేహమునకు;
నెఱిఁగింపవచ్చితి నింతి, నీ." కనిన,
ననఘు నాకచుఁజూచి యాదేవయాని:
"వినుమయా కచ, నీవు విభుఁడవై నాకు
నుండుదుగా; కింక నొండుతావునకు
దండికూరిమిమాని తగునె నీకేఁగ!"
అనవుడుఁ, గచుడు నెయ్యముమాని పలికె:
"నను నిట్లు నీవాడ న్యాయమె ముగ్ధ!
గురుపుత్రి వరియించు కుమతులుగలరె!
తరుణి, ధర్మములెల్లఁ దప్పనాడెదవు!

ఒసఁగూడ వీనుంటు [illegible]సి.” యనినఁ
గనలి, యాభార్గవి కచునకిట్లనియె:
“ ఓదురాత్మకుఁడ, యెపుడు బ్రాహ్మణుఁడవె!
నీదురుక్తులు నమ్మి నవెఱ్ఱినైతి.
నీతోడఁజేసిన నెయ్యమింతయును
[1]నీ తెలుంగుననయ్యె నీటివ్రాఁతగిదిఁ!
గావున, మహాశక్తిశాలిని బట్టి
జీవమంత్రము నీకుఁ జెడిపోవుఁగాక.”
అనుచుశపించిన నాకచుండలిగి,
యెనయు నాసతిఁజూచి: “యువతి, నేనిట్లు
ధర్మవాక్యము నిన్ను దాఁక నాడినను
ధర్మమే శపియింపఁ దరుణుకి నీకుఁ !
బ్రాణమంత్రము నాకుఁబనిసేయకున్నఁ,
బ్రాణ నాశిష్యులు [2] తా మొనర్చెదరు.
ఎనయంగ నీకును హితుఁడైన మగఁడు
మనుజేశుఁడగుఁగాక మహిమీఁద.” ననుచుఁ
గ్రమ్మఱశపియించి కచుఁడు పోవుటయు,
నమ్మానినియు నుండె నార్తవహుచును.
అంత, నావృషపర్వునాత్మజయైన
శాంతశర్మిష్ఠ భార్గవపుత్రిఁగూడి
పరిచారికలు పెద్దపరిచర్య సేయ
నరుదెంచి, వనములో నలరఁగ్రీడించి,
చీరలుధరఁబెట్టి శీతాంబుకేళి
వారక గావించి వారిలో వెడలి
శుక్రకూఁతురుచీరఁజుట్టెఁ; జుట్టుటయు
నక్రమంబున, దేవయాని యిట్లనియె:

1. నీ తెలుంగుననీటఁ జెల్లెవ్రాయుపగిది. 2. తామెటొర్చెదరు. (పా)

“ నాపుట్టమిది ; గట్ట నాయది యేమొ నీకు !
నేపున నీకట్టునీమైనానాకిఁ
గట్టవచ్చునె ! నాతిక్రమింపఁదప్పితివి ”.
[1] ఇట్టన, మైమఱచి నోడి శర్మిష్ఠ
కవిపుత్రికిట్లను : “ గాంధి, నేఁజాల
వివరింప కిటుఁగట్టు పిడనాననవు !
రాచకూఁతుర నేను ; రమణి నాయొద్ది
గోఁచిబాఁపనికీవు కూఁతురవింతె !
నీచీర నేఁగట్ట నెఱిగాదు గాక ;
నాచీరగట్టిన నాతి, నీకేమి ? ”

యయాతి, నూతఁబడిన దేవయాని నుద్ధరించుట

అనుచువివాదించి, యసురేంద్రపుత్రి
గొనిపోయి భార్గవిఁ గూపంబులోనఁ
ద్రోయించి, యడవిలోఁ దోడనెవచ్చి
ధీయుక్తిఁ బురములోఁ దెసులకయుండె.
అటమున్న, యాకాననయందు యయాతి
[2] పటురీతి మృగకోటిఁబట్టి వేఁటాడి
యానూతిచేరువ నటపోవ, నేడ్పు
వీనులసోఁకిన, వేఁటచాలించి,
తరుణిగాఁదలపోసి, తద్దయువగచి,
పరికించి నూతిలోపలఁ జూచునపుడు,
కనుఁగవఁ గన్నీరు కడునించి యేడ్చి
కొనగోరఁ గన్నీరుగొని మీటుదానిఁ,
బడిన భారంబునఁ బయ్యెదజారి
కడలేనికుచకాంతి గప్పినదాని,

1. మొట్టైన నేమైనరోవి. 2. పటురమ. (మూ)

ఇల్లు [1] వట్టుము ; నీకు నిచ్చోటనుండఁ
దల్లి, ధర్మముగాదు ; తరుణివిడువు."
అని యొడంబఱుచుచో, నంత దైత్య-
ఘనుఁడైన వృషపర్వ [2] క్రవ్యాదవిభుఁడు
తనతనయ చేసిన దంటతనంబు
మనమున నెఱిఁగి, యమ్మగువఁ దోడ్కొనుచు
వచ్చి యాగురునభివందించి పలికె:
'హెచ్చి మా శర్మిష్ఠ యీయింతి కెగ్గు
లొనరించె; దీనినేలుఁడు దాసిగాఁగ ;'
ననిన, నాశుక్రుండు నంగీకరించె.
అప్పుడు వేడ్కతో నా దేవయాని
యుప్పొంగి, శర్మిష్ఠ యొగిఁ దన్ను గొలువ,
జనకుండు వృషపర్వసహితుఁడై యగ్ర
మునఁబోవ, నేతెంచెఁ బురవరంబునకు.

## దేవయాని వసంతవన విహారము

అంత, నా భార్గవి యట యొక్కనాఁడు
కాంత శర్మిష్ఠాదికాంతలు గొలువ
వనకేళిచేయుచో, వలనొప్ప నపుడు
వనమున నొప్ప[3]య్యె వాసంతలక్ష్మి.
మాకంద మందార మధుక మాలూర
శాఖోట పాటలి చంప కాశోక
సల్లకీ బిల్వాది సకలభూజములు
మొల్లంబుగాఁ బూచె ముదమొంద నలులు.
విరహులపై దండువెడలంగ మదనుఁ
డిరవుతో మునుబంచె నెలగోలనంగ,

1. పట్టాట. 2. గంవారి. 3. యవ్వనవసంతంబు. (మా)

ఖండతమ్మోదమీఁదు ఖండించుఁబూఁదేన
కండక్రొవ్వునఁ గ్రోలి [1] కలగుండుపెట్టి ;
‘ మానినీమణులార, మానంబుమాని
మానుగాఁ గలియుఁడు మగల ’ నన్నట్లు,
మావిలేఁజివురెల్ల మత్తిల్ల [2] మెసవి
కోవిలకదుపులు గొణఁగొంగఁదొడఁగ ;
ఫలరసధారలు బాగుగాఁ గ్రోలి,
చిలుకమూఁకలు గూడి చరలుగొట్టుచును,
పంచబాణుని తేరి [3] బారాలమనుచు
ముంచి పాంథులమీఁద మొగసాల్జేసి ;
విరహులవిరహాగ్ని విదితంబుసేయ
మరుఁడుపుత్తెంచిన మందిది యనఁగ
మలయాద్రిచలిగాలి మధురసౌరభము
వలనొప్పఁ బొలసె నవ్వనవీథులందు.
అప్పుడు భార్గవి యతిసంభ్రమమున
నుప్పొంగి, చెలులతో నుద్యానవీథి
విహరించి, యెంతయు వేడ్కలింపార
బహుపుష్పవితతులు బహుభంగిఁగోసి
పోగులుపోయించి, పుష్పాస్త్రునచట
బాగుగానొదవించి భక్తిప్రాయించి,
పూజించి యువ్వేల్పుబోఁటికిమ్రొక్కి
రాజితోఁ గొనియాడె : “ నోరతిరాజ,
చిగురుఁగైదువుచేతఁ జిత్రంబుగాఁగ
జగములన్నియుఁ గెల్చు జగదేకవీర ! ”
... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...

1. కడుగుండుపెట్టి. 2. చెమసి. 3. బాణాల. (మూ)

## యయాతి దేవయానిని వివాహమగుట

అనుచుఁ బ్రార్థనచేసి యంజలిచేసి
మనమున నలరి నెమ్మది నుండె. నంత,
నటఁ యయాతియును వేఁటలాడఁగఁబూని,
బటురీతిఁ జతురంగబలము తోడ
వేఁటకుక్కలును వలల్ వెస[1] బోయవాండ్రు
వాటంపుడేగలు వలనైన తెరలు
మొదలైన సాధనంబులు చాల గలిగి,
పదిలుఁడై యడవికిఁ బసతోడ వచ్చి,
తెరలును వలలును దిని త్రిపన్నించి,
చుఱుకుగా మృగముల జోఁకు వెట్టించి,
పటహ భేరీ శంఖ పణవ నిస్సాణ
పటువాద్యములు చెవుల్ పగుల మ్రోయించి,
బెదరినమృగరాశి బ్రిదులక డాసి,
వదలక కుక్కలఁ బాఱంగవిడిచి,
బాణజాలము లేసి పార్థివోత్తముఁడు
త్రాణతో శరభాలి ధరమీఁదఁ గూల్చి,
సింగాలవధియించి, చెండి బెబ్బులుల,
భంగించి యులుగులఁ, బందులఁ గ్రుచ్చి,
మన్నుపోతులఁ ద్రెంచి, మహిషాళిఁ ద్రుంచి,
చిన్ని[2] కొర్నవగండ్లఁ జెలఁగి ఖండించి,
కడతులఁ గారించి, ఖడ్గజంతువుల
మడియించి, చిఱుతలమద మెల్లఁ ద్రెంచి,
దుప్పులఁ బెగటార్చి, తోఁటాడి కరుల,
నొప్పించి యెద్దుల, నుడుగక మఱియుఁ,

1. బోవు. 2. కొఱనక్కలెల్ల. (మూ)

దక్కినమృగకులఁ దఖిలి చెండాడి,
వెక్కసంబుగ డేగవేఁటయు నాడి,
తనసేనలును దాను ధరణీనాయకుఁడు
వనములో వేడ్కమై వర్తించునంత,
విరికమ్మివిరులపై విహరించి, యలరు
తరుణుల ముంగురుల్ తరళింపఁజేసి,
వనపుష్ప సౌరభ వాసితంబగుచు
మనుజేశుపై వీచె మందమారుతము.
తరుణుల చదురులు, గంటుమాటలును,
బరిహాసములు వినఁబడెఁ ; బడుటయును,
జెవులలో నమృతంబు చిలికినట్లైన
నవలీల సేతెంచె నరనాయకుండు.
చుక్కలలోనున్న శుభ్రాంశు కలికి
చక్కఁదనంబున [1] జవ్వనంబునను
జెలులలోపల నెల్లఁ జెలువమై మిగుల
లలితభావంబున లలినొప్పుదాని,
నెఱిగలకురులును నిడుదకన్నులును,
మెఱుఁగుఁజెక్కిళ్లును, మించినమోవి,
నగనగనని యొడి నవకంపుమోము,
జిగిబిగి గలిగాడి చిన్నిచన్నులును,
దగఁదగనని యొడి [2] తేలికనడుము,
ధగధగమని యొడి తను [3] వల్లరియును,
నూఁగారు [4] సౌరు, నన్నువలై నవళులు,
బాగైన పిఱుఁదును, [5] బసిమిపాదములుఁ
గలిగి కాంతలకెల్లఁ గాంతియై [6] నిలిచి
యలరెడు నా దేవయాని నా నృపుఁడు

1. జవ్వనియగుచు. 2. తెలివిగొన్నడుము. 3. వల్లికి. 4. నారు. 5. బసని.
6. గాలిచి. (మూ)

గనుఁగొని, యాశ్చర్యకలితుఁడై మున్న
మనమున నెఱుఁగనిమాడ్కి నిట్లనియె:
"ఇందీవరాక్షి, నీ వెవ్వరిదాన!
యెందుండి వచ్చితి విచ్చటి కిపుడు?
వెస నీకుఁ బేరేమి? వీర లెవ్వారు?
మసలక చెప్పు మామనను మోదింప."
అనిన, భార్గవి నవ్వి యతని కిట్లనియె;
"విను, మఱచితె నన్ను విజ్ఞానివయ్యు!;
శుక్రుండు మాతండ్రి; సురుచిర తేజ (?)
విక్రాంత, నా పేరు విను దేవయాని;
పరిచారికలు నాకుఁ బరఁగ వీరెల్ల;
సొరిది నీవన [1] శోభఁ జూడ వచ్చితిమి.
మున్న నే నూతిలోఁ బొలవెట్టుచుండఁ
గ్రన్ననఁ గడఁక నాకడ కేఁగుదెంచి,
నావలచేయి యున్నతి వడిఁ బట్టి,
వే వెడలించితి విపినకూపంబు.
కావున, నదియుపో కరుణావిధేయ,
భావింప నాకయ్యెఁ బాణిపీడనము.
నాఁటనుండియు నిన్ను నాటిన కూర్మి
వాటమై యున్నది వదలింప రామి.
ఈ కాంత [2] లిందఱు నెలమి సేవింప
నీ కాంత నయ్యెద నెలమిఁ గైకొమ్ము."
అనిన, యయాతి [3] శంకాయత్తుఁడగుచు
మనమున ధైర్యంబు మఱువెట్టి పలికె:
"ఓ ముగ్ధ, యీమాట లోనఁ గూడ వెందు;
నేము రాజన్యుల; మీవు బ్రాహ్మణివి;

1. కేళి. 2. లిద్దఱు. 3. కామ్యక-చిత్తుడగుచు. (మా)

కాన, వివాహంబు కాఁగాదు నిన్ను ;
నేను ధర్మముదప్పనెట్లు సేయుదును ! "
అనవుండు నయ్యింతి యనుకూలయగుచు,
మనమునఁ దమతండ్రి మహితాత్ముఁదలఁచెఁ ;
దలఁచిన, శుక్రుండు తడయకవచ్చి
[1] నిలిచె నాపుత్రికానృపుల కిట్టెదుర.
అప్పుడారాజన్యుఁ డాదేవయాని
యుష్వాంగి ప్రేమిల్ల, నుబ్బి భార్గవుఁడు
ఆసీనుఁడై వేడ్క నవనీశుఁబలికె :
" భానురాత్మక, నీవు పరమపుణ్యుఁడవు ;
రాజవు ; సద్ధర్మరతుఁడవు ; గానఁ,
దేజిత నాకూఁతు దేవయాన్యాఖ్య (?)
నిచ్చితిఁబత్నిగా ; [2] నీమె యెల్లెడల
నచ్చినధర్మంబునకు నగు నీకు."
అనుచుఁ బార్థివచంద్రు ననుమతుఁజేసి,
తనపురంబునకు నాతనయతోఁగూడఁ
దోకొని, వేడుకఁదూర్యముల్ [3] మొరయ
భూకాంతునకుఁ బెండ్లి పుత్రికఁజేసి,
దివ్యభూషణములు దివ్యాంబరములు
దివ్యగంధములుఁ బుత్రికి నల్లునకును
గట్టంగనిచ్చి, యాకావ్యుండు వారిఁ
బట్టణంబునకంపి, పార్థివేంద్రునకు
శర్మిష్ఠఁజూపి సంశయమేదిపలికె :
" ధర్మాత్మ, వృషపర్వదానవేంద్రునకుఁ
గూఁతురీకోమలి ; కోమలగాత్రి ;
బ్రాఁతి నాపుత్రికిఁబరిచారికనక,

1. నిలిచె నానృపతిలకాపుత్రికట్టెదుర. 2. నీవెల్లరొండెడల. 3. మెఱయ. (మా)

శయనంబువెలిగాఁగ సర్వభోగములు
నయవిధి దీసికి నడుపుము నీవు.”
అనిచెప్పి భార్గవుండటపోయెఁ; బోవ,
మనుజేశ్వరుండును మదిలోసనలరి,
దేవయానియుఁ దాను దేవేంద్రుభాతి
భావజరాజ్యసంపదలందుచుండె.
అంత, గర్భిణియైనయా దేవయాని
కెంతయు నరుచితో నెసగె వేవిళ్లు;
మోముబెల్పోలఁబారె; మురిపెంబుదక్కె;
వేమారు నయనముల్ [1] వెల్లనైతోఁచెఁ;
బాలిండ్లముక్కులపస నల్లనయ్యె;
బాలకి యాలోనఁ బదియగునెలను
యదుఁడు తుర్వసుండను నిరువురసుతులఁ
ముదమొప్పఁగాఁగాంచె; మోదించి నృపుఁడు
పుత్త్రోత్సవంబులు పొలుపారఁజేసి,
ధాత్రియేలుచునుండె ధర్మమార్గమున.
పుత్త్రులుతేని యాభూజనులెల్లఁ
బుత్త్రులఁగాంతు రీపుణ్యకథవినిన.

యయాతి, శర్మిష్ఠకుఁ బుత్త్రదానంబుసేయుట

ఒకనాఁడు వేడ్కతో నుద్యానవనము
కొకఁడునే తెంచుచో, నొంటియై నచటఁ
జీకటిలోనున్న శీతాంశురేఖ
తేఁకువ నొప్పెడు దేహంబుదాని,
సమ్మతి బుతుశుచిస్నాతయై వచ్చి
కమ్మనితావులఁ గరమొప్పుదానిఁ,

1. వేడ్కయై. (మూ)

జలుమాఱు పయ్యెద పాటించుకొనుచు
జలిబిలిసిగ్గునఁ జెలువైనదాని
నమలాంగి శర్మిష్ఠ నారాజుచూచి
తెమలియుండఁగఁ, గాంచి తెలివయుఁగదిసి
ప్రణమిల్లి పలికె : "నోపార్థివచంద్ర,
గణుతింప దైత్యేంద్రకన్యను నేను ;
వెసఁ గానలోఁగాయు వెన్నెలపోలెఁ,
బస దేఁటిగొనని పువ్వుతావివోలె,
నవనిఁదాఁచిన రత్నహారంబు పోలె,
ధవుఁబాయు కామినీతండంబుపోలె
నాజవ్వనంబెల్ల నానాఁటికిట్టు
లోజ నూరకపోయె నోదయాధార !
ఋతుమతినై యేను సట్లున్నదానఁ ;
జతురత నాకోర్కి సలుపవే దేవ !"
అనుటయు, రాజన్యుఁ డబలకిట్లనియె :
"వినుము, నీమాటలు వినఁగూడదిపుడు ;
శుక్రుండు నిను మున్నుజూపి [1] చెప్పుచు, న-
వక్రముగ నాకునే వాక్యంబుచెప్పె
నావిధంబున నేను నరుగుదుఁ ; గాని,
యేవెంట నామాట లేదాటవెఱతు."
అనవుడు శర్మిష్ఠ : "యల్లెల ! దీనఁ
దనరిన సత్యంబు దలఁగదు నీకుఁ ;
'ప్రాణసంకటముల, బ్రాహ్మణక్రియల,
రాణతోఁ బెండ్లిండ్ల, ద్రవ్యభంగముల,
నతివయు ఋతుమతియైయుండుచోట్లఁ
బలి కల్లలాడినఁ బాపంబులేదు'.

1. చెప్పచును—వక్రంబుగా. (మూ)

అని చెప్పవిందు నే నఖిలశాస్త్రములు;
విను నీవు బొంకితి వెనఁబెండ్లియందు.”
అనియొడంబఱచిన నతఁడిచ్చగించి,
[1] రొనరిన రత్నంపుటోవరులందు
నిపుణత బహుపుష్పనిర్మితశయ్య
నపరిమితోత్సాహుఁడై పవ్వళించి,
శర్మిష్ఠనీక్షించి, సరసంబులాడి,
మర్మంబులన్నియు మఱి యంటియంటి,
మొఱఁగుఁజెక్కిలిగీఁటి, మించుఁబాలిండ్ల
గుఱుతులుగాఁ గొనగోళ్లునాటించి,
బిగియఁ గౌఁగిటఁజేర్చి, బింబాధరంబు
తగవొప్పఁజపిగొని, తద్దహర్షమున
యువతి మన్మథకేళి నోలలాడించి
యువనీశ్వరుఁడుపోవ; నపుడు శర్మిష్ఠ
వలుదక్రొమ్ముడి వీడి, వదనంబువాడి,
తిలకకస్తురిజారి, దిటవెల్లదారి,
తఱుచావులింపుచు, ధవళనేత్రముల
నెఱికెంపుదోపఁగ, నిలుగుచు, మఱియుఁ
బొదవిన సంభోగభూరిచిహ్నములు
లొదవంగ, గర్భమై సౌభాగ్యంపుఁదిథుల
దృహ్యానుపూరుల ధృవకీర్తియుతుల
సహ్యధైర్యులఁ గాంచె సత్క్రమంబునను.
అంతట, నొక్కనాఁ డాదేవయాని
కాంతుండుఁ దానును గదియంగనుండి,
శర్మిష్ఠకొడుకులు చదురొప్ప నచటి
కర్థిలినే తెంచి యాడుచుండఁగను,

1. రొనరినరత్నంబుటోవరిగలిగి – నెపుణైనబహుపుష్పనిర్మితశయ్య. (మూ)

రూపవై భవకళారూఢి నారాజు-
రూపంబులై యున్న, రోషించిచూచి
మగనితో నిట్లను : 'మనుజేశ, వీరు
తగవొప్ప నెవ్వరితనయులో!' యనిన
రాజూరకుండిన, రమణి యాసుతుల
నోజతో నడిగె ని : 'ట్లో బాలులార,
మీతల్లిదండ్రుల మృదురీతి నాకుఁ
బ్రీతిఁ జెప్పుఁడు మీకు బెల్లమిచ్చెదను.'
అనిన బాలురుపల్కె : 'రతివ, మాతండ్రి
తనర యయాతి; మాతల్లి శర్మిష్ఠ.'
అనవిని భార్గవి యతిశోక కోప-
వినతయై, యచ్చోటవీడ్కొనిపోయి
తనతండ్రికంతయుఁ దప్పక చెప్పఁ,

## శుక్రుఁడు యయాతిని శపించుట

గనలి, యాశుక్రుఁ డాకన్యనూరార్చి :
"నిను డాఁగురించి యానృపతి శర్మిష్ఠ
ననుభవించినయట్టి యాపాపమునకు
వదలజవ్వన, మెల్ల వాసియుఁదక్కె-
ముదిమినొందు"; నటంచు ముని శాపమిచ్చె.
నిచ్చిన, వివశుఁడై యొఱఁగి యయాతి
యచ్చుగా శుక్రున కందంద మ్రొక్కె,
యనయంబు భక్తితో నంజలిచేసి :
"యనఘాత్మ, చేసితినపరాధమేను ;
గావవే! ముదిమి నేఁగడవంగనోవ ;
భావింప విషయానుభవకాంక్ష గలదు."
అనియనిప్రార్థింప, నతఁడు చింతించి
తనలోన నొక్కింత దయచేసి పలికె :

"భూప, యీముదిమి నీపుత్త్రులలోన
నేపుత్త్రునకునైన నిచ్చి, నీవిపుడు
వానిప్రాయముగొను; వలనొప్ప వెనుక
పూని రాజ్యభరంబు పూనుదువాఁడె".
అనవియ్యకొని, నృపుఁ డతనివీడ్కొనుచుఁ
దనపురికేతెంచి తరుణియుఁ దానుఁ,
గొడుకులనేవురఁగూర్చి యిట్లనియె:

## యయాతి యదుప్రభృతుల శపించుట

"వెడగైన ముదిమిచే విహరింపఁజాల;
నుడుగదు భోగేచ్ఛ యొంగి యింక నాకు;
నడుకక మీలోన నలి నెవ్వఁడైన
జవ్వనంబిచ్చి నాజరగొనుం". డనిన
నవ్వి, యిట్లనిరందు నలుగురు సుతులు:
"విభువర, నీకేమి వెఱ్ఱిపట్టినదొ!
విభవులై చరియించు విభుకుమారకులు
చిన్నిప్రాయంబిచ్చి, చెడ్డయీముదిమి
క్రన్ననఁదాల్తురే కడఁక నెంతైనఁ!
గొంచక యెటువంటి కూళ[1] మానిసియుఁ
బంచదారకుఁ దాదు ప్రతి[2] విల్చుకొనునె!
అని విడనాడిన, నారాజు కినిసి
తనయుల నలువురఁ దప్పక పలికె:
"పుత్త్రులా మీరలు! భువి మత్తులార!
శత్రులుగాక; యేజనకుఁడ మిమ్ముఁ
బనిచినఁ, జేయంగ భావ్యంబుగాదె!
తనరఁ దండ్రికిఁగానితనయులేమిటికి!

1. మానసులు. 2. విల్చు.

నానాప్రకార [1] వినీతులై ఖ్యాతిసంపన్నులగుచు
భూచక్రమున మ్లేచ్ఛభూముపాలింపుఁ;"
అని యా యయాతి ద్రుహ్యానుతుర్వసుల
కొనరంగ యదువున కొసఁగె శాపంబు.
అప్పుడా పూరుండు నాతండ్రికెఱఁగి,
తప్పక కేల్మోడ్చి తగ నిట్లుపలికె:
'పూనెద నీజర భూనాథ, నాకు
జానొప్ప నిమ్ము నా జవ్వనంబంది.'
అనవుడు రాజన్యుఁ డతని హర్షించి,
తనజరాభార మాతనయునకిచ్చి,
వానియౌవనలక్ష్మి వలనొప్పఁ దాల్చి,
ఘనముగా రాజ్యంబు మహిమ దీపింపఁ
బెక్కుకాలంబులు పెక్కురీతులను
దక్కక [2] పాలించి ధర్మమార్గమునఁ,
దనలోను భవవాంఛఁ దనిసి మానుటయుఁ,
తనయుని ప్రాయంబు తనయునకిచ్చి,
తన వార్ధకంబంది, తన్నాదరించి,
యనువొప్ప మన్నించి, యాప్తమంత్రులను
విప్రుల రావించి విత్తంబులొసఁగి,
సుప్రశస్తంబైన శుభముహూర్తమునఁ
నొనరంగఁ బూరుని యుక్తమార్గమునఁ
దనరఁ బట్టముగట్టి, ధరణీవిభుండు
రాజధర్మంబులు రాజనీతులును
రాజైన సుతునకు [3] రాజిల్లఁ జెప్పి,
మునివృత్తిగైకొని, మునులును దాను
వనములకేఁగి, యుద్యానములలోన

1. నియతులై. 2. కావించి. 3. రాజిల్ల. (మూ)

బహువత్సరంబులు బహువిధంబునను
బహుతపంబులు జేసి, పార్థివోత్తముఁడు
స్వర్గలోకము జేరి, శంభులోకమును
దుర్గమంబైనట్టి బ్రహ్మలోకంబు
మొదలుగాఁగల లోకములయందుఁ బ్రీతి
వదలక కొన్నాళ్లు వసియించి, తిరిగి
సాంద్రవైభవములు చాలఁగైకొనుచు
నింద్రలోకంబునకేన వొందవచ్చె.
వచ్చినఁజూచి యవ్వాసవుండలరి
యచ్చుగాఁబూజించి యాసీనుఁజేసి,
పలికెఁ బార్థివుఁజూచి పరమమోదమున:

## యయాతి స్వర్లోకభ్రష్టుఁడగుట

“కలితాత్మ, నీవంటి ఘనపుణ్యచరితు,
మాన్యైన బహువిధమఖ సోమయాజిఁ
గానమెచ్చోటను ; గాంతివిశాల,
ఈవుచేసినతపం బేలాటితపము!
భావించిచెప్పు తప్పక నాకు.” ననినఁ
దనలోన నెంతయుఁ దలఁచి, యయాతి
వినతుఁడై హరిఁజూచి వేడ్కనిట్లనియె :
“ఎట్టిదేవతలునను, నెట్టిదానవులు,
నెట్టిమునీంద్రులు, నెట్టిరాజులును
జేయంగలేరు నేఁజేసినతపము ;
నాయజుండెఱుఁగును నన్యులెఱుఁగుదురె!”
అనినఁ, గోపంబెత్తి యమరనాయకుఁడు
మనుజేశునిట్లను : “మదియించి, నీవు
పెద్దలతపమెల్ల బీఱుచేసితివి ;
తద్దయు ధర్మంబుఁదప్పితి ; గానఁ,

బోయి యధోలోకమునఁ బడుము." యనిన,
నాయయాతి తలంకి యుత్తలపడ్డనియె :
" అనఘాత్మ, చేసినయపరాధ[1] మునను
ననుగట్టఁ దెచ్చితి నలి నేన త్రొళ్ళు ;
భూలోకమున నేను బోవంగనోప ;
నోలి సత్పథమందు నుండెద నిపుడు."
అనుచుఁ బ్రార్థనచేసి యంజలి సేయఁ,
గనికరంబున వజ్రి గైకొని యనిచె.
ననిచిన, నా రాజు నాకాశవీథి
నొనరంగనే తెంచి యుండుచో ; నంత,
నతనిదౌహిత్రకు లాయష్టకాదు
లతులిత తేజస్కు లందుండివచ్చి,
యారాజుఁబొడగాంచి యంజలిచేసి
ధీరతఁబలికిరి : " దేవ, నీవిప్డు
డెందుండివచ్చితి ? వెవ్వారవయ్య !
యెందులకే తెంచి ? తెలియఁగింపుమాకు."
అనవుడు రాజన్యుఁ డష్టకాదులకుఁ
దన తెఱంగంతయుఁ దప్పకచెప్పె.
చెప్పిన విని, వారు చెలఁగి హర్షమున
నుప్పొంగి, దండంబు లోలిఁ గావించి :
'యెనయంగ మీకు దౌహిత్రులమేము
మనుజేశ, చెప్పవే మాకుధర్మముల !'
ననుడు యయాతి యయ్యష్టకాదులకు
ఘనతరమహిమలు గలుగంగఁజెప్పి,
ధర్మంబులన్నియుఁ దగ నేర్పరించి,
కర్మంబులన్నియుఁ గడముట్టఁ దెలిపి,

1. మేను. (మూ)

కొంతకాలము వారిఁగూడి యచ్చోట
సంతసంబుననుండి, జగదీశుఁ జింత
మనుమలుఁ దానును మఱియును వేడ్క
పొనరంగఁ బ్రాపించెఁ బుణ్యలోకములు.
ఇట పూరుఁడును శాస్త్రహితమార్గమునను
బటుబుద్ధిఁ గ్రతువులు బహుభంగిఁ జేసి,
నడవడి రాజ్యాధినాథులౌనట్టి
కొడుకుల నెక్కుడు కొమరొప్పఁబడసి,
ధర్మమార్గమ్మున ధరణియంతయును
ధర్మాత్ముఁడై యేలి ధన్యుఁడై యుండె.
ఈయయాతిచరిత్ర మెవ్వఁరువిన్నఁ,
బాయుఁబాపంబులు ; ప్రబలుఁబుణ్యములు ;
అతఁడుపోయినవెన్క నవనినాయకులు
చతురతఁ బెక్కండ్రు చని." రనువేడ్క
జనమేజయునకు వైశంపాయనుండు
మును చెప్పెనని చెప్ప మోదించి వార :
'అనఘాత్మ, తరువాతనైనవృత్తాంత
మనఁబొప్పఁజెప్పవే!' యనియడుగుటయు,
[1] గౌరీశ పూజాధిక మతానుచార,
చారణ (సంస్తుత) చరితానుసార,
సారస్వతామృత సాధనధీర,
ధీరాంగరంజితాదిమశుభాకార,
కాకాగ్యపాగత ఘనశత్రుశూర, (?)
శూరతాలంకార, సుజనమందార,
భారతాధిప, నీకుబహుళార్థసిద్ధి.

1. గౌరీపూజాభిమతాభిచార. (మూ)

ఇదిసదాశివభక్త హింసగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభాసూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మననామధేయ
రచితాదిపర్వ నిర్మలకథయందు
నుచితమై యాశ్వాసమొప్పె రెండవది.

---

# తృతీయాశ్వాసము

శ్రీతనయాకార, సీతాక్షిప్రభాకర,
చాతుర్యఘన, రామ, జానకీరమణ,
కల్పవృక్షము భాతిఁ గవులకోరికలు
కల్పించుమఘనదాతృ, కడఁకనాలింపు ;
అరకథకుఁడు శౌనకాదిసన్ము
కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె.

## దుష్యంతచరిత్ర

అట్టిపూరుని వి (పులాస్వ) యుంబునను
నెట్టన దుష్యంతనృపుఁడుద్భవించె.
గుబ్బలి పెకలించి గుబ్బలిమీఁద
గుబ్బన వైచును గ్రొత్తలావునను ;
గజములఁ జేపట్టి కడిమి వాటించి,
భజనశాకసముపైఁ బాఱంగమీటు ;
నలఘుసత్వంబున నవిలునకైన
జళుకుపుట్టించును జాతుర్యలీల ;
బలభేది కెంతయుఁ బరిణామమెసఁగ
బలిమిమై రాక్షసబలముఁ గారించుఁ ;
బగతురఁ దెగటార్చి బహుళపుస్ఫూర్తి
జగమెల్ల నేకశాసనముగా నేలి,
వరుస బ్రహ్మక్షత్రవైశ్యశూద్రులను
సరి నిజధర్మముల్ సలుపఁగఁజేసె.
ఒనరిన వేడ్కతో నొక్కనాఁ డతఁడు
' తనరాజచిహ్నాలై తనరిన యట్టి

తగఁ బుండరీక[1] భూదారి భాసురంబు
జగతి ఖడ్గిత్వంబు చాటించెనంబు
వనమృగంబులు దాల్చి వర్తించె పుట్టు'!
లని మృగంబులమీఁద నతిరాగ మెసఁగ
వేటలాడఁగఁబూని వెడలె, మారాజు
గాటమై సేనలు కడసి సేవింప,
వందిబృందంబు కైవారంబుసేయ,
నందంద మ్రోయంగ సకలవాద్యములెల్లఁ,
త్రిజగంబు వ్రేల్మిడిఁ దిరిగిరా నోపు
నిజ జవాశ్వరథంబు నెమ్మిఁ దా నెక్కి,
సకలసాధనములుఁ జనుదేర వెంట
నకలంకగతి నేఁగె నడవిలోపలకు.
శరభ వాహ వరాహ శార్దూల గవయ
రురు శల్య భల్లూక రోహిత వృషభ
కరివైరి వారణ ఖడ్గ గంధర్వ
హరిణాది మృగకోటి నవలీలఁగదిసి
చించియు, నొంచియుఁ, జెదరనేసియును,
ద్రుంచియు, దంచియుఁ, దూలనేసియును,
గెడపియు, నెడపియుఁ, గీటడంచియును,
బొడిచియు, నడఁచియుఁ, బోకకుమ్మియును,
నలిచియుఁ, బఱచియు, నొగులనేసియును,
బలువిడి నీరీతి బహువిధమార్గముల
విలువిద్య యొంతయు వేడిమిచూపి,
కలమృగంబులనెల్లఁ గలగుండువెట్టి,
పట్టినమృగకోటిఁ బట్టణంబునకుఁ
బెట్టిపుత్తెంచుచుఁ, బృథివీశుఁ డంతఁ,

1. ఘుధార. (మూ)

జంద్రునిలోనున్న సారంగ కూటకు
సాంద్ర [1] రయంబునఁ జూడొంచె ననఁగ
శివునిచేవెలువడి చెలువంపుటిఱ్ఱి
యువలీల నచ్చోటి కరుదెంచెననఁగ
బంగారుకెంజాయ భాసిల్లుమేన
రంగైనయొకయిఱ్ఱి రాజిల్లఁ జూచి:
'చోరవర్తనము లీక్షోణి లేకుండ
నీరీతి నాజ్ఞ నేనేలుచునుండఁ,
గాంతికన్నులకాంతిఁ గడఁగి [2] చోరించి
వింతగా నీయిఱ్ఱి విపినంబులోన
దాఁగియున్నదటంచు [3] ధాటితో డాసి
ఱేఁగి చంద్రుఁడుపట్ట నాగెనో, యనఁగఁ (?)
జలమున డాసి, దుష్యంతభూవిభుఁడు
బలములచే దానిఁ బట్టింపఁబోయెఁ.
బోయిన, నాయిఱ్ఱి పొడవుగా నెగసి,
వాయువేగంబున వలలెల్లదాటి
పఱవఁగఁ గనుఁగొనెఁ బార్థివోత్తముఁడు.

.............................

అంతంతఁ బఱచుచు, నఖిలదిక్కులను
వింతగాఁ బలుమఱు వెఱచిచూచుచును,
గొరిసెచేఁ జెవిక్రింద గోఁకదీటుచును,
ధరణీశు నలయించి దవ్వుగాఁజనియెఁ;
జనిన నారాజును జలమునఁ గొంద
ఱనుచరులును దాను హరిణంబువెంటఁ
బోవఁబోవ, మృగంబు పుణ్యాశ్రమంబు
వేవచ్చిచొచ్చిన, వీక్షించి మాను

---

1, రూపంబున. 2. గోరించి. 3. ధారతో. (మూ)

లబ్ధంబుగావచ్చి యతనిదీవించి
దొడ్డప్రియంబులుదోప నిట్లనిరి :
"చనదుచంపఁగ దీనిఁ ; జాలునీయలుక ;
[1] యనఘాత్మ, యిదిమదీయాశ్రమమృగము.
ధూర్తులఁదెగటార్పఁ దొడరునీబలిమి
యార్తులరక్షింప నందంబుగాదె!"
అనిన, వారలమాటలంగీకరించి
మనుజేశుఁడిట్లను : 'మహితాత్ములార,
దవ్వులనే వేడ్కఁదనరంగఁజేయు
నెవ్వారియాశ్రమంబీపుణ్యభూమి ?'
అనవుడు మౌనీంద్రులతనికిట్లనిరి :
'వినుమయా రాజన్య, విఖ్యాతుఁడగుచు
దేవదానవులకు ధృతిఁదండ్రియగుచు
భావజ్ఞ కశ్యపబ్రహ్మసంయమికిఁ
దమ్ముఁడై, ఘనతపోధర్మాత్ముఁడైన
యమ్మహాత్ముఁడు కణ్వుఁ ; డతనియాశ్రమము.'
అనిచెప్ప, దుష్యంతుఁడలరిచిత్తమున :
'మునిచంద్రుసేవించి, ముదమొప్ప నిందు
ఘనతపోమహిమలు గలయనీక్షించి,
నను బుణ్యుఁజేయుదు ననువొప్ప.' ననుచు
మనమునఁదలపోసి, మంత్రుల భటుల
నునిచి యచ్చోటికి నుర్వీశుఁడేఁగె.
దారుక మాకంద దాడిమీ నారి-
కేర కేసర నాగకేసర గ్రాహి
జంబీర శింశుపా జంబూ కదంబ
నింబ ప్రియక నీల నిచుల కుద్దాల

---

1. రొనయుంగనిది. (మూ)

బంధూక నారంగ ఫలపూర వనస
సిందుర చామర శేలు ఖర్జూర
చందన ద్రాక్షానుస్యందనాశ్వత్థ (!)
కుంద వాసంతికా కురవక నికుచ
మల్లికాసన నవమల్లికా ముఖ
వల్లరీతరువుల వారక యొప్పు
పువ్వులు ఫలములుఁ బూవలుఁ గలిగి
నివ్వటిల్లుచునుండ నెగడినదానిఁ,
దనియంగ మునులు సంధ్యలువార్చ జలము
గొనిపోవుకవులచేఁ గొమరొప్పుదాని,
మునిపుత్త్రులకుఁ గందమూలాదు లెపుడుఁ
దనియంగఁ దమిఁబూని తద్దయు వేడ్కఁ
దప్పక కొమ్ములఁ ద్రవ్విచ్చునట్టి
దుప్పుల సిబ్బులఁ దొడగినదానిఁ,
జెలఁగి ధేనువులకుఁ జెలువంపుఁబూరి
చలిమితో మేపెడు చిఱుతబెబ్బులులు,
నెమలిబర్హముక్రింద నిద్రకెప్పుడును
నెమకివచ్చుచునున్న నిడుదపాములును,
మూషికశిశువుల మొగి మేఁతవెట్టి
పోషించుచున్నట్టి పోతుపిల్లులును,
వెండియుఁ దమలోన విరసంబుమాని
దండిగేహంబులఁ దనరు జంతువులు,
నెఱి నేఁడఁబోసిన నివ్వరివడ్లు
గఱగఱగామేసి కాశలఁబొప్పు
సకలశాస్త్రంబులఁ జదువుచునున్న
శుకశారికాతతి శోభిల్లుదాని,
హోమధూమమ్ముచే నొగిఁ గెంపుచెడిన
శేమావినసల వెల్లితమైనదాని,

జపమాలికలు దెచ్చి సాధుమిత్రులకుఁ
గృపనిచ్చు వెంచుటుఁ గీలొత్తున్నదాని,
వాదించి చదివెడు వటువుల ప్రసిద్ధ
వేదఘోషంబుల విలసిల్లుదాని,
మునుకొని వివిధంపు ముగ్గులు గూర్చు
మునికుమారికలచే మొనసినదాని,
నేరుమద్దులఁ బోఁడ నెండు మూసినన్న
నారపుట్టముల నున్నతమైనదాని,
భోగంబులన్నియుఁ బో విడనాడి
యోగమార్గంబెల్ల నొప్పఁగాఁ దెలిసి
యొదవ శిష్యులకు బ్రహ్మోపదేశంబు
తుదిచేయు మానులఁ దొడరినదానిఁ,
బుణ్యఫలముల కెల్లభూమియై మిగుల
గణ్యధర్మంబుల ఘనమైనదాని,
ఘనతపోధనుఁడైన కణ్వమునీంద్రు
వనభూశ్రమస్థాన మధికమోదమునఁ
గనుఁగొని, యాశ్చర్యకలితుఁడై నృపతి
మునుకొని యచ్చోటిమునుల కెందఱకుఁ
బ్రణమిల్లి, వారిచే బహుమానమంది,
[1] గుణవంతుఁ డందలి క్రొత్తలన్నియును
బరికించిచూచుచు, భక్తి దీపింప
సరవిఁ గణ్వునిపర్ణశాలకే తెంచి,
నెమలి [2] బర్హముకంటె నెఱిఁ గల్మి గలిగి
యమరినకొప్పున నమరినదానిఁ,
బదియాఱుగాఁ జంద్రు భంగమొందించు
వదనపద్మమ్మున వలనొప్పుదాని,

1. గుణవంతులందఱు. 2. బర్హము. (మా)

దొండపంటికి సిగ్గు దొడరంగఁజేయు
దండికెంపులమోవిఁ దనరెడుదానిఁ,
జిలుకకోవెలలకుఁ జెలఁగుపికాలకుఁ
బలుకులఁ దలవంపు పాటించుదాని,
మరుఁడు జయంబంది మహిమఁబూరించు
కరశంఖగతి నొప్పు కంఠంబుదానిఁ,
గవజక్కవలఁ గవకవ నవ్వఁజాలు
సవరని చనుఁదోయి జానొప్పుదాని,
నిగురించులతలతో నెకసక్కెమాడు
జిగిబిగిగల మేనిచెలువంబుదానిఁ,
గన్నియ లావణ్యగౌరవంబునను
వెన్నున విహరించు విపులంపువేణి
యుదరంబుపైఁ దోచెనోయనఁ జాలు
నొదవినరోమాళి నొప్పారుదానిఁ,
బఱపైన చనుఁదోయిభారంబువలన
సరిపేదమధ్యంబు జడియు, నానాభిఁ
బసిఁడిశలాకచే బంధించిరనఁగఁ
బస మూఁడువళులను భాసిల్లుదాని,
మరుని [1] చైత్రరథంబు మార్కొనఁజాలు
వరజఘనంబుల వాసైనదాని,
ననఁటికంబంబుల నదలించుతొడల
నొవరినపిక్కల నొఱపైనదాని,
రాయంచగములతో ఱంతుగావించు
ప్రాయంపునడపులఁ బరఁగినదానిఁ,
బటురీతిఁ జెలులతో భాషించుదానిఁ
గుటిలకుంతలను శకుంతల నతఁడు

1. చైత్ర. (మూ)

పలుమాఱు చూచుచు నా భావంబులోన
వలరాజుతూపులు వాటమై నాటఁ,
బదరి తద్గుణపాశబద్ధుఁడై, కదల
మెదలంగ నేరక మిన్నక యుండె.
మనసు మానినిమీఁద మఱగియుండంగ
నెనయంగఁ దన్ను దా నెఱుఁగంగలేక,
తరుణిలావణ్యామృతంబుఁ గ్రోలంగ
సరి ననిమేషత నంధిల్లెననఁగఁ
గనుఱెప్పవెట్టక కడువిస్మయమునఁ
దనమనంబున నిట్టుదలపోయఁదొడఁగెఁ :
" చెలువల నా బ్రహ్మ సృజియించుచోట
నలర ఘుణాక్షర న్యాయాన దీని
సృజియింపఁబోలు నీక్షితి ; నట్లుగాక
యజునకు నీనేర్పు నందమానేని,
యింక నొక్కతెఁ గాంత నీయింతి[1] సవతుఁ
గొంకక మఱి యేల[2] కూర్పంగలేఁడు !
శృంగారరసమెల్లఁ జెన్నారఁ గూర్చి
యంగజుఁ డిచ్చోట యంత్రించెఁగాక !
వితత వేదాభ్యాస వికలుఁడైనట్టి
చతురాననున కిట్టిచతురత గలదె !
ఈయింతికౌఁగిలి యెవ్వానికబ్బె,
నాయుత్తమునకబ్బు నమరరాజ్యంబు.
పటురీతి సరిచేయ భావ్యంబుగాదు
కుటిలకుంతలుల నీకోమలాంగికిని. "
అని యిట్లుతలపోయు నవనినాయకునిఁ
గనుఁగొని, మునిపుత్రి గారవంబునను

1. సతి. 2. గూర్పఁగ జాలని. (మూ)

ఆతిథ్య మొనరించి, యాసీనుఁ జేసి,
చేతులు మొగిచి యా క్షితినాథు కనియె :
'ఓరాజ, నీ వెందునుండి వచ్చితివి ?
నీరాక యిందేల ? నీకుఁ బేరేమి ?'
అనినఁ, దొయ్యలిఁ జూచి యవనీశుఁ డనియె :
"విను, నేను దుష్యంతవిభుఁ డనువాఁడ ;
వేటకై సేనతో వెడలి యేతెంచి,
గాటంపుభక్తితోఁ గణ్వసంయమిని
సేవింపవచ్చితిఁ జెలువ, నేనిచటి ;
కావిప్రవరుఁ డున్న యచ్చోటు చెపుమ."
అనుడు, శకుంతల యతనికిట్లనియె :
"మునినాథుఁ డింతటి మున్న గాఁ గదలి
సమిధలు దర్భలు శాకముల్ పండ్లు
సమరంగఁ గొనితేర నడవికిఁ జనియె ;
మీరు వచ్చుట విన్న, మీఱిన వేడ్క
వారక యేతెంచు వనములో వెడలి."
అనుటయు, రాజన్యుఁ డాయింతిఁ జూచి
మనమున నిట్లను : "మహనీయకన్య
మునిపుత్రి యెట్లయ్యె ! మొగి దీనిమీఁదఁ
గనుకూర్మి నాకిట్లు కడముట్టఁ బుట్టెఁ !
గానివస్తువుమీఁదఁ గాంక్ష డెందమున
నూనదెన్నఁడు మఱి యుచితంబు దక్క !
దీనిజన్మవిధంబు తెలియక నాకు
నూనిన సందేహ ముడుగ దెంతయును."
అని యిట్లు దలపోసి యబలకిట్లనియె :
"వనజాక్షి, యడుగంగ వలసె నిన్నొకటి ;
[1] బ్రహ్మవిదుండన బ్రహ్మణ్యుఁ డనఁగ
బ్రహ్మచారి యనంగఁ బరఁగుఁ గణ్వుఁడు ;

1. బ్రహ్మవిండనంగనగణ్యుండనంగ. (మా)

అతనికి నీ వెట్టులాత్మజవైతి!
హితమతి నీక్రమం బెఱింగింపవలయును."
అనిన, శకుంతల యారాజుకనియె:

### శకుంతలాజన్మవృత్తాంతము

"విను, మేను విన్నట్టివిధము చెప్పెదను;
అనఘ, విశ్వామిత్రుఁడను రాజవరాసి
మును దపంబుండంగఁ బురుహూతుఁడెఱిగి,
తనరాజ్య మాశించు తడవుసన్భీతి
ఘనముగా నంకిలిగావింపఁ దలఁచి,
మేనకయనుదాని మృగరాజమధ్య
మానుగా రావించి మన్నించి పలికె:
'ఓకాంత, నీవేఁగి యుగ్రతపంబు
చేకొనిసేయు కౌశికమునీంద్రునకు
వివిధభావంబుల విఘ్నంబుచేసి
యువతి, యేతె;' మ్మన్న నువిదయిట్లనియె:
'ఓదేవ, నీమాట యొనఁ [1]గూర్పనోపఁ;
గాదు నాచే నింతకార్యంబుసేయఁ;
దగ దూడలోపునే దంటుమేయంగ!
మగువలతరమె యమ్మహితాత్ముఁగలఁప!
నెఱిఁగియుఁ బాఁతఱ నెవ్వఁడుగూలు!
వెఱతు నేఁ బోవ నావిమలాత్మకడకు.'
అనిన నింద్రుఁడుపల్కె: 'నబ్జల! నీకు
ననువగునీకార్య; మతివ, భీతిలకు;
గానికార్యములకుఁ గళ్యాణి, నిన్ను
బూనుదునే! వేడ్కఁబొ;' మ్మన్న నదియుఁ
గైకొని యేతెంచి, కౌశికునదుటఁ
దూకొన్నమధులక్ష్మితోడుగా మెఱసి,

1. గూడ. (మూ)

బహువిలాసంబులు బహుగీతతతులు
బహునాట్యకళలును బహుభంగిఁజూపఁ,
దలయెత్తి యటుచూచి, తపమెల్లనూని,
వలరాజునకుఁదక్కి, వలవంతఁజిక్కి,
మేనెల్లమఱచి, యమ్మేనకఁగూడి
మానైన మరుకేళి మదమొప్పఁజేయ
వనితపుట్టిన, దాని వసుధపై విడిచి
వనితమేనక యేఁగె వాసవుపురికి.
కౌశికుండును, నంత ఘనతపంబునకుఁ
గౌశలంబుననేఁగె గర్వంబుదక్కి.
ఇట యేడ్చుచుండంగ నింత నాబాలఁ
జటులశకుంతాలి సంరక్ష సేయ,
నొకనాఁడు కుశనది కొగిఁగణ్వమౌని
యకలంకగతి నట కరుదెంచిచూచి,
కొనిపోయి యబ్బాలఁ గూఁతుగాఁబెనిచి,
తన [1] చెలియలిచేత స్తన్యమిప్పించి,
రమణ శకుంతాలి రక్షించెఁగాన
నమర శకుంతలయను పేరు పెట్టె,
హోమకుండును దండ్రి భువినగుననెడి
భామఁ గణ్వుఁడు నాకుఁ బసఁ దండ్రియయ్యె.
ననినాదువృత్తాంత మాద్యులు చెప్ప
వినియుందు నీరీతి విశ్వంభరేంద్ర!"
అనిన, నాదుష్యంతుఁ డధికహర్షమున
మనసిజుండేప నమ్మగువకిట్లనియె:
"వనిత, నిజంబె కావలయు నెంతయును;
మనుజకాంతల కిట్టిమంజిమ గలదె!

1. చెలిచేతను. (మూ)

మెఱయ నాకసముపై మెఱుఁగారు మెఱుఁగు
నెఱయంగఁ దోఁచునే నేలపై నెందు!
నింక నొక్కటి నాకు నిందీవరాక్షి,
శంకక సమకూర్పఁ గూడును నీకుఁ;
గ్రుంకుగుబ్బలి పొడ్పుగుబ్బలిఁ దల
సంకితంబైనట్టి యవనిమండలికి
నాయకుండననొప్పునాకు నోతన్వి,
నాయికవగుము [1] మన్మథశాస్త్రవిధిని."
అనిన, శకుంతల యవనీశుఁబలికె:
'మునిలేనిపిమ్మట ముదితాత్మ, నాకు
స్వాతంత్ర్యమున నీకు సమకూరనగునె!
మాతండ్రి రానిమ్ము మఱి యగుఁగాక'.
అనవుడు రాజన్యుఁ డబలకిట్లనియె:
"వినుము, నీ కేటికి వెఱవంగ ముగ్ధ!
ఒనయ వివాహంబు లెనిమిదియందు
ఘనత క్షత్రియులకు గాంధర్వసరణి
ఒఱుఁగ వధూవరులిద్దఱుఁదక్క
మఱి యన్యులెఱుఁగిన మతముగా; దదియు,
వసుధ గాంధర్వవివాహంబు మున్న
వసుధేశకన్యకావరుల కబ్బినది;
మీతండ్రి విన్నను మిగుల [2] మోదించు;
నేతెంతుగా." కన్న నింతి యిట్లనియె:
"నా కుమారుని రాజ్యనాథునిఁజేయ
నీకుఁగూడిన, నేను నీచెప్పినట్లు
చేసెదఁ; గాకున్నఁ, జేయంగఁగూడ;
దీనమయము నాకు నీడేర్పఁగలవె!"

---

1. మన్మథశాస్త్రవిధికి. 2. బోధించు. (మూ)

అనిన, దుష్యంతుండు నంగీకరించి
వనితకోరినలాగు వారకసలిపి,
మదనుండుమెచ్చంగ మగువతోఁగూడి
వదలనికూర్మి జవ్వనికి నిట్లనియె:
"పోయెద నోకాంత, పురమున కేను;
నాయెడ నెయ్యంబు నాతి, మరువకుము.
పిలువఁబుత్తెంచెద బింబోష్ఠి, నిన్ను
నలరఁ దండ్రికిఁజెప్పి యరుదెమ్ము నీవు."
అనుచు వీడ్కొనివచ్చి, యటసేనఁ గూడి
తనపురంబునకేఁగె ధారుణీవిభుఁడు.

## భరతోత్పత్తి

అట గణ్వమునియు, నయ్యడవిలోనుండి
పటురీతి సమిధలు ఫలములుఁ గొనుచుఁ
బర్ణశాలకువచ్చి, పరమహర్షమునఁ
బూర్ణచంద్రాననఁ బుత్త్రికఁజూచి,
సిగ్గును, వెఱపును, జడిముడిపాటు,
నగ్గలికయుఁ, గాంతి, యలసభావంబు,
గర్భచిహ్నము, మఱి గర్భస్థుఁడైన
యర్భకువిభవంబు [1] నంతయునపుడు
తనదివ్యదృష్టిచేఁ దప్పకదెలిసి,
మనముననలరి సమ్మతి నూరకుండె.
అంత, శకుంతల హర్షంపుఁ[illegible]ధిని
గాంతిమంతునిఁ బుత్త్రుఁ గనిన, నమ్మౌని
తడయక యేతెంచి, దౌహిత్త్రునకును
గడువేడ్కఁజేసి సంస్కారంబులెల్ల:
[2] "సత్త్వాల బలిమియై సమయించుఁగాన,
సత్త్వదమనుండగు శైశవంబునను;

---

1. నాతండెఱింగి. 2. సత్త్వదబలిమియు సమయంబుగాన. (మూ)

బరఁగ నామీఁద భూభరణంబు సేయు
భరతనాముఁడనఁ బ్రజలు వీఁ." డనుచు
నామధేయంబును నలువొప్పఁ బెట్టి,
ప్రేమతోఁ బెనుపంగ, బెరిగి యాసుతుఁడు
సింగంపుఁగొదమల సిగపట్టి తిగిచి,
భంగించి యావలఁ బాఱంగఁ దోలు ;
నెలుగుపిల్లలఁ దెచ్చి యింటిబాలకుల
నలబూచిబూచని యాడించుచుండు ;
నీరీతి మఱియు ననేకలీలలను
వారక సేయుచు వర్తించుచుండె.

## శకుంతలను హాస్తినాపురికనుపుట

అంతఁ, గణ్వమునీంద్రుఁ డనుఁగుఁగూఁతునకుఁ
గాంతి రాచూలికిఁ గడువేడ్కతోడ
దివ్యభూషణములు, దివ్యాంబరములు,
దివ్యగంధంబులు దీపింప నొసగి,
తనశిష్యగణములఁ దగఁ దోడుగూర్చి
యనఘుఁ డల్లునియూరికనిచిపుత్తెంచె.
ఆరీతి మునిపంప, నాశిష్యవరులు
దారకతోఁగూడఁ దరుణిఁదోడ్కొనుచు
హాస్తినాపురమునకరుదెంచి, యధిపు
శస్త్రంపుమొగసాలఁ జదురొప్పనిలిచి,
ద్వారికులచేతఁ దమరాక తెఱఁగు
భూవరునకుఁజెప్పిపుత్తెర, నతఁడు
నతిభక్తితో వారి నటకు రావించి,
చతురతఁ బూజించి సన్నుతిఁ బలికె:
" అనఘాత్ములార, మీరరుదెంచుకతన
ఘన తపో ధర్మాత్మ కలితుండ నైతి.

మహితాత్ముఁడగు కణ్వమౌనిచంద్రునకు
బహుభంగిఁ దపములు పరఁగునె యెపుడు!
దేవవిప్రార్థమై ధృతిఁ గూడఁబోయు
నీవారధాన్యంబు నెలవుగాఁగలదె (వె)!
కందమూలంబులుఁ, గమ్మనిపండ్లు,
నందంద యతిథులకబ్బునే పెట్టఁ?
బరమేశుఁబూజింపఁ బత్రపుష్పములు
వరనదీజలములు వారకకలవె?
మఱియును దక్షిణమహితకృత్యములు
[1] దరలక మౌనికిఁ దనరునె యచట?
ఆమహాత్మకుఁ డేమియానతియిచ్చె?
నేముగావించెద మిటుచెప్పవలయు."
ననవుడు, మునిపుత్త్రులతనికిట్లనిరి:
"ఘనుఁడ, కౌరవ వంశకర్తవు నీవు
ఇలయేలుచుండంగ నెల్లవస్తువులు
నిలయానువిధమున నెసగునెల్లెడలఁ;
బ్రజలకందఱకును బరితోషమెపుడు;
నిజధర్మములుచెల్లు నిఖిలభూములను;
గావున, నెప్పుడుఁ గణ్వసంయమికి
భావింప సుఖముతోఁ బ్రబలుఁదపంబు.
అమ్మౌనివాక్యంబు లాదటవినుము:
'నమ్మి నేలేనిచో నీవనంబునకు
నమరంగ వేటకై యరుదెంచి, నీవు
కొమరారు నాకూఁతు శకుంతలాకన్య
గాంధర్వమునఁ బెండ్లికడఁకతో [2] నాడి
బాంధవంబుగఁజన్న పద్ధతిక్రమము

1. దనరక. 2. గూడి. (మూ)

మనమున నెఱిఁగి సమ్మతిచేసి, పిదపఁ
దనయుఁ డెదిగినదాఁక దనయ నిల్పితిమి ;
[1] ఇంకీకుమారకు నిల్లాలి నీవు
గొంకక చేయివ్వఁగాఁ గొను.' మని చెప్పి
పుత్త్రెంచె మమ్ము నో భూపాల !" యనిన,
నత్తఱి వికలుఁడై యవనీశుఁ డనియె :
" ఈకన్య నెన్నఁడు నేఁ బెండ్లియైతి !
నాకు నీ బాలుఁ డెన్నటికుమారకుఁడు !
ఏ నేమియును నెఱుంగ ! నీభంగి నాకుఁ
గానక కొడిమెలు గట్టంగఁదగునె ! ”
అనిన, వారలు రాజు కలుక నిట్లనిరి :
" మనువేళ, యూరకే మఱపుగై కొంటి ;
వేము చెప్పఁగనేల ! యీరహస్యములు ;
శ్యామశకుంతల సర్వంబుఁ దెలుపు ”.
ననిన శకుంతల యవనీశుఁ బలికె :
“ వినుతాత్మ, మఱచితే విజ్ఞానివయ్యు !
మున్ను దపోవనంబున వేడ్క నన్నుఁ
గ్రన్ననఁ గామార్థిఁ గడుముట్టఁగూడి,
రాజ్యానుభవమున రాజిల్లి యిపుడు
పూజ్యుండవై యుండి బొంకంగఁదగునె !
ధర్మంబులన్నియుఁ దగఁ జేయుకంటెఁ
గర్మోక్తమున నొక్క క్రతువు మేలండ్రు ;
ఆక్రతువులు నూఱు నటు సేయుకంటె
సుక్రమస్తుతుఁడగు సుతుఁడు మేలండ్రు ;
ఆసుతశతకంబు నందుటకంటె
వాసిగా నొకసత్యవచనంబు మేలు ;

1. ఇంక కొమారిక యిల్లాలి నీకు. (మూ)

సకలధర్మంబులు సరసితో త్రాసు
నొకవంక నిడి, సత్యము నొకవంకఁ బెట్టి
త్రాసునఁ దూఁచిన, ధర్మ[illegible]
వాసి యయ్యెను సత్యవచనంబు తొల్లి;
కావున, సత్యంబు గడచిపోనాడు
భూవిభుగావించుపుణ్యంబులెల్ల
నోనర బూడిదలోని హోమంబుగాదె!
మనుజేశ, కల్లలు మానుము నీవు".
అనిన, మానినిఁజూచి యవనీశుఁడనియె:
" వినరానిమాటలు వెలఁది, యాడెదవు;
నలి నసత్యముగాఁగ నామాటలెల్ల,
వెలఁది, నీమాటలు వేదంబో చెపుము!
మటుమాయప్రోగులు, మదన మోహినులు,
నటమటంబులకావు, లనృతభాషిణులు,
కన్నుండఁ గనుపాపఁ గడఁకతోఁదివియు
కన్నగాండ్రులుగారె! కాంతలన్వారు.
సత్యంబులెల్ల నసత్యంబు సేయు,
నిత్యమనిత్యంబు నిజముగాఁజేయు
నేరుపు సంధిల్లు నెలఁతలకెల్ల;
నారకు నీమాట చాలించి యురుగు".
మనిన, శోకంబుతో నతివయిట్లనియె:
" వనములోపలనుండు వనితాజనంబు
పలుకుల సత్యంబు పాటిగాదయ్యెఁ!
గలకాలమును శత్రుగణములఁ జెఱుచు
కుచ్ఛితంబులు నేర్చు కువలయాధిపులు
నచ్చుగా సత్యంబులాడువారె!
నామోముచూడుఁడీ నలినలియయ్యె!
నేమింక నేమన నేర్తును నిన్నుఁ!

దనయునకై నను దండ్రియుంచుటను
ఘనయౌవనరాజ్యంబు గానలేదయ్యె !"
నని యిట్లు పలుకుచు నధిపుదూఱుచును,
మనమునశోకించి మఱియు నిట్లనియె :
"అనలుండు, చంద్రుండు, నంభోజసఖుఁడు,
ననిలుండు, భూమియు, నాకసం, బాత్మ,
యుదకంబు, జముఁడును, నుభయసంధ్యలును
మదిఁజూతు రెప్పుడు మనుజులనెల్లఁ ;
గావున, నీరాజుకల్ల నిజంబు
దేవతాతతులార, దృష్టింపుఁడీరు."
అని పలుమాఱు నయ్యతివశోకింప,
వనితకై యాకాశవాణియిట్లనియె :
"ఓరాజ ! వినుమ, యీయువతి నీభార్య ;
శూరుఁ డీబాలుండు సూనుండునీకు ;
గాంధర్వ[1] విధమునఁ గానలో నీవు
సంధించితివిదీని ; సత్యమీమాట.
సందియంబేటికి ! సతియైనదీని
నందనుఁ గైకొమ్ము నరనాథ, మేలు".
అనిన సంతోషించి[2] రఖిలసభ్యులును ;
జననాథుఁడును హర్ష[3] సంభృతుఁడగుచు
మాని[4] సామంతుల మంత్రులఁ బలికె :
"నేనెఱింగియు నింతి నింతసేయుటలు,
వనములో నొంటిమై వర్తించునట్టి
ఘనకృత్య మింతయుఁ గలయంగఁదెలియ
వలసి ; యింతియె కాని,[5] వసుస నీసాధ్వి
కులకాంతయగు ; వీఁడు కొడుకును నగును."

---

1. మిదియును. 2. యఖిల. 3. సంభృతులగుచు. 4. సామజకేళి.
5. వలసి. (మా)

అనుచుఁ బార్థివచంద్రుఁ డాశకుంతలను
'జనుములోనికి' నని శాసించిపలికి,
పులకలు మేనెల్లఁ బొదలిభూషింప
నలఘుశౌర్యునిఁ బుత్త్రు నందందమొత్తి,
బిగియఁ గౌఁగిటఁజేర్చి, ప్రియ మొప్పఁ దొడలఁ
దగనొప్పనిడుకొని, ధారుణీవిభుఁడు
ఆకణ్వశిష్యుల కతిభక్తితోడఁ
బ్రాకటంబుగనిచ్చి బహువస్త్రతతులు,
మునినాథునకు లేఖ ముద మొప్పఁబెట్టి
యనిచిన, దీవించి యరిగిరమ్మునులు.
అంతట, దుష్యంతుఁ డఖిలరాజ్యంబు
వింతలాగుననేలి విఖ్యాతివడసి,
యాశకుంతలఁగూడి యఖిలసౌఖ్యంబు
లాశయ్య బహుకాల మలర భోగించి,
క్రతువులు బహురీతిఁ గ్రమ మొప్పఁ జేసి,
చతురత యోగవిచారుఁడై, పిదపఁ
దన ప్రధానులనెల్లఁ దాల్మిరావించి,
తనయుఁబట్టముగట్టి తగనొప్పగించి,
మునివృత్తిగైకొని ముదిమి నారాజు
ఘనతపంబునఁ బుణ్యగతులఁ బ్రాపించె.
ధరఁ గులకర్తయై తనరినయట్టి
భరతుండు ధర్మసుభరితుఁ డావెనుక
భూలోకమంతయు భుజశక్తినేలి,
చాలవేడుకఁ జేసె జన్నముల్ పెక్కు.
సారత నతనిచేఁ జంద్రవంశంబు
భారతవంశమై పరఁగె నంతయును.
జగతి దుష్యంతునిచరితంబు విన్నఁ,
దగనొప్పఁ జదివినఁ దనరుఁబుణ్యములు.

అంత నాకులకర్త హాస్తిపురభర్త
వింతగా భరతుండు విభుఁడైనవెనుక,
వెండియు నృపతులు వివిధప్రతాప
[1] ఖండితవైరులై కడునేల భూమి,
శంతనుండనురాజు జనియించి వేడ్క-
నెంతయు నేలుచు నెఱివైభవమున,
నీతిసహాయుఁడై [2] నిఖిలభూపతుల -
చేతఁ గప్పంబులు చెలువొప్పఁ గొనుచు
వారణ మదవారి వర్షాగమంబు
వారక యేప్రొద్దు వాకిటఁ గలిగి,
కైలాస హిమశైల గంధశైలముల
వాలినతనకీర్తి వన్నియవ్రాయ,
సతులతోఁ బతులయాచ్ఛాన్నవృత్తిదక్క-
నితరయాచ్ఛాన్నవృత్తి యిలమీఁద లేక,
పేరిన సురల దుర్భిక్షదోషంబు
వారక క్రతువులవలన మాన్పుచును
ఉర్వియేలుచునుండి, యొక్కనాఁ డతఁడు
సర్వసేనాఢ్యుఁడై జాహ్నవికడకు
వేఁటలాడఁగఁబోయి విపినంబుచొచ్చి,
మీటుగల్గిన యుగ్రమృగములఁ జంపి,
శాంతి నెంతయుఁ దూలి, సహకార వకుళ
హింతాల వనరాజి నెసగుజాహ్నవికి
నరుదెంచి, మధురంబులైనతోయములు
గరగలఁదెప్పించి కమ్మగాఁగ్రోలి,
పూచినగురువింద పొదరిండ్లనీడ
రాచిల్కవల్కుల రసికుఁడై వినుచుఁ,

1. ఖండితైశ్వర్యులై కడునేలిభూమి. 2. నీతి. (మూ)

కలయఁ దమ్ములసోఁకి కడలులఁ ద్రోఁకి
ఫలవృక్షములఁదాఁకి పైగాడ్పువోలయు,
సేకతంబుగ సేన యెడగల్గ నిలిపి,
సైకతంబుననున్న సమయంబునందుఁ,

### వసువులు గంగతో మొఱవెట్టుట

గామినీవేషంబుగైకొని గంగ
భూమీశుఁగవయంగఁ బూనిపోవంగ,
వసువులడ్డమువచ్చి వరుసతో మ్రొక్కి,
యసమానదైన్యులై యాగంగకనిరి :
“ఎందుఁబోయెదు గంగ? [1] హితములరంగఁ
బొందఁబోయెదులాగొ భూపాలతిలకు!
ఈతనిసంబంధ మెఱుఁగుదుమింత ;
నీతఁడు మునుమేన నిక్ష్వాకుకులుఁడు ;
భీమశౌర్యుఁడు మహాభిషుఁడనురాజు ;
భూమియేలుచు యాగములుపెక్కు చేసి
దేహాంత్యమున బ్రహ్మదేవుని [2] సభక-
నాహూతనిజపుణ్యుఁడై పోయి మరలి,
పెరసినతనయిచ్చఁ బెక్కుకాలములు
సురలోకవిభుకొల్వఁ జొచ్చియుండఁగను,
దేవి, నీవొకదివ్యదేహంబు దాల్చి
యావాసవునిఁగొల్వ నరుదెంచునపుడు,
[3] నివిడినగాడ్పున నీచీరదొలఁగ,
ధవళాక్షి, మునులెల్లఁ దలవంచుటయును,
అంబరంబు ధరించునాలోన నిన్ను
నంబుజానన, కాంక్ష నాతండుచూచెఁ ;

1. హితమత్తరంగ. 2. సభకు ఆహూత. 3. నీగిన. (మూ)

జూచిన, నింద్రుండు క్షోణీశుఁగినిసి
'భూచక్రమునఁ బోయిపుట్టుమీ' యనుచు
శాపించుటయు, నొండుజనులకుఁ బుట్ట-
నోపక యారాజు యుక్తమార్గమున
ననుపమ కులదీపుఁడగు ప్రతీపునకు
జనియించె ధర నిట్లు శంతనుండనఁగ.
శృంగారరసమొల్ల క్షితినితంబైన
గంగజనకుఁ బుట్ట ననువులే దబల!
ఎన్నఁగా నాఁడు నీ వీరాజుమీఁదఁ
గన్నువేసితి; గానఁ, గడువేడ్కఁ బుట్టి
కాంతవై నీవిదే కవయఁబోయెదవు.
వింతవారము గాము వినుము మాకథయు;
నేము లోకంబుల నెదురెందులేక
వేడుక విహరించి, వెసలోకమునకుఁ
బోఁగ భార్యలు మేముఁ బోవుచుండంగఁ,
బసఁగ మే మేఁగునప్పథమధ్యమునకుఁ
జేరువనున్న వశిష్ఠాశ్రమమునఁ
గోరి సుఖింపంగఁ, గొంతసేపునకు
నందఱమును డిగ్గ, నచ్చోటనుండె
నందిని యనునావు నయన రమ్యాంగి;
ఎట్టికోరిక లెవ్వ రిచ్చలోఁదలఁచి
రట్టికోరిక లిచ్చు నంతటిసొమ్ము.
[1] మేయఁబోవఁగ దాని మేనిరోమముల
చాయకు వెఱఁగంది సంప్రీతి నవుడు
ఆర్యాణియనునది యష్టమవసువు-
భార్య యాధేనువుఁ బట్టి తెమ్మనుచు
మగనిఁ బ్రార్థించిన, మానినిమాట
తగదనమైతిమి; తప్పుచేసితిమి.

1. పొరయ. (పూ)

పడఁతి [1] యిట్లనుపఁగ, ద్యువ వాఁడుపోయి
తొడిసి వశిష్ఠునిహోమధేనువును
బట్టితెచ్చిన, నేముఁ బదిలమ్మైగదలి
నెట్టఁ వచ్చుచో, నిజబుద్ధినెఱిఁగి
'మనుజులై పొం' డని మాకు వసిష్ఠుఁ
డెనమండ్రకును శాపమిచ్చె; నిచ్చుటయు,
నందిని విడిపించి నయమొప్పఁగదలి
యందఱమునువచ్చి యతనికిమ్రొక్కి,
చేతులుఁ మొగిచి: "మాచేసినతప్పు
బ్రాఁతియా! మునినాథ, పనలేదుగదవె!
ఈలీలఁ దప్పుగా నేలగైకొంటి!
భూలోకమున నేము పుట్టనోడుదుము;
చచ్చుచుఁ, బుట్టుచు, సకలరోగముల
నెచ్చుచు, వ్యాధితో విహరింపఁగలమె!
మొదల బాల్యంబున, ముదిమి నంత్యమునఁ,
బొదలుయౌవనమున పొక్కంగఁగలమె!
పత్తెంబుమ్రింగుచుఁ, బవలును రేలు
విత్తంబు దలఁచుచు విహరింపఁగలమె!
సర్వజ్ఞ, యార్పవే! శాపాగ్ని;" యనిన,
నార్వశేయుఁడు మాకు నభయంబులిచ్చి:
'కథలేల! మీలోనఁ గడపటివాఁడు
పృథివి నుండెడుఁగాక పెద్దకాలంబు;
మట్టపునియతితో మానవయోనిఁ
బుట్టుచు, మరణంబుఁబొందుఁడేడ్వురును;
నంతానశూన్యుఁడై సకలభోగముల
పొంతఁబోవనిపుట్టు పుట్టెడు నితఁడు'.

1. యిట్లనుపతద్వారివాడుపోయి. (మా)

అని వశిష్ఠుఁడు మమ్ము ననుపుటఁ జేసి
జనియింపవలసె నీజగతిలోపలను.
నీయందు మునిఁగిన, నెఱయఁ జేరినను,
బాయంగనగు సర్వపాపంబులెందు;
ఒక్కనిఁ దనయుఁగా నుండని". మ్మనుచు
మ్రొక్కి యావసువు లమ్మునిసకిట్లనిరి :
"ఇలదీర్ఘజీవిగా, నేము మాలోనఁ
బాలఁతి, చతుర్థాంశములు పుచ్చి వచ్చి
కలసియిత్తుము పుత్త్రుఁగా నీకు ; నతఁడు
నిలిచివర్థిల్లెఁడు నృపుఁడు మోదింప".

## గంగాశంతనుల సమయము

అనిన నట్లిద కాకయని వారినెల్ల
ననిచి, భాగీరథి యటవచ్చివచ్చి
వసుధేశునమ్మేను, వక్షస్స్థలంబుఁ,
బసనిదీప్తులు, ముఖపంకేరుహంబు,
నాజానుబాహులు, నసమానరుచియు,
రాజీవ రుచిర నేత్రంబులుఁ జూచి,
యాశానుతలకెక్కి యేలినగంగ
యాశంతనునిమూర్తి కాత్మలో మెచ్చి,
గరువంబునేరక కదిసిపోలేక
సురిగిరానేరక సుడివడియున్నఁ,
బతియును దానిసౌభాగ్యసంపదకు
మతిలోనఁజొక్కి, మన్మథునకుఁజిక్కి :
"దైవకన్యకయొ! గంధర్వకన్యకయొ!
యావచ్చుకన్య దేవేంద్రకన్యకయొ!
వరకన్యకయొ! కాక, వసుమతినంత
నరకన్యకకు నిట్టిసయురూపు గలదె!

కలికిమీనంబులో! కన్నులో! యెఱుఁగ;
నలరినపవడమో! యధరమో! యెఱుఁగఁ,
గ్రమ్ము సంపెఁగంబువో! కంఠమో! యెఱుఁగఁ;
గమలమృణాళమో! కరములో! యెఱుఁగఁ;
జక్రవాకంబులో! చన్నులో! యెఱుఁగఁ;
జక్రమో! పులినమో! జఘనమో! యెఱుఁగ;
[1] గరిమకూర్మములో! మీఁగాళ్లో! యెఱుంగ;
నరుణపంకజములో! యడుగులో! యెఱుఁగ;
నేరూప మెఱుఁగితే; నిట్టిసౌభాగ్య
మేరూపు నిర్మింప [2] నేరఁడుబ్రహ్మ.
ఒకమాఱు కౌఁగిలి యువిదయిచ్చుటయు,
సకలంబు వెలగాదు జగతీతలంబు.
ఈచోట నొంటిగా నెవ్వారికెదురు
చూచుచువచ్చెనో శుకవాణి ముగ్ధ!
అమ్ములగతినాటె నతివ [3] చూపులును
[4] నమ్మఁజాలసిరీతి నాశరీరమున.
నడిగిచూచెదఁగాక యబలవృత్తాంత;
మడుగంగ మఱుమాట లాడకుండెడినో!
కదిసి చూచెదఁగాక కమలాయతాక్షిఁ;
గదియఁగా నెక్కడ కదలిపోయెడినో!"
అని యిట్లుదలపోయు నధిపతిఁ జూచి,
వనజాక్షి యారాజువామాంక మెక్కె;
ఎక్కనఁ, బులకలు నిరుపరమైన
నొక్కట నెసగుట యుపమింపనొప్పె
[5] గీష్మతి పదమగల్గినచోటెంగి
పుష్పాస్త్రునకు నారు పోసినాఁడనఁగ.

---

1. గరిమకూర్మమొ మొగిళ్లోయెఱుంగ. 2. నేరము. 3. చూపరులు. 4. నమ్మ శాలదు లేని. 5. గ్రీష్మతి. (మూ)

అప్పుడు నరనాథుఁ డాత్మలో 'నబల
చెప్పినయట్లెల్లఁ జేయుదు' ననుచుఁ
దలఁచుచున్నతనికిఁ దరుణి యిట్లనియె :
"నెలకొని చేసెద నీకుఁగాపురము ;
ఏనేమిచేసిన నీవు గాదనక
యూనినమతి నూరకుండనోపుదువె !
ఉండక యెన్నఁడే నుల్లంబునొవ్వ
మండలేశ్వర, నన్ను మఱచి యాడినను,
అప్పుడు నినుడించి యరిగెదఁజువ్వె !
చెప్పితి, నట్లైనఁజేపట్టు." మనిన
నొడఁబడి, శంతనుం డువిదకచ్చోటఁ
గడురమ్యముగ నిండ్లు గట్టించి, యందు
సురతానుభవమున సురరాజు పోలె
సురనదిఁ గూడి భాసురసౌఖ్య మందె.
అత్తఱి, వరుణేంద్రులాదిగా వసువు
లెత్తిన క్రమముతో నింతికిఁ బతికి
జనియింప జనియింప, జాహ్నవి వారి
మనుజేశ్వరుఁడుచూడ మదిఁగొంకులేక
గొనిపోయి గంగలోఁ గూయికూయనఁగ
ముంచి, తీర్థములాడి యుదయొప్పవచ్చు.
ఇట్టుముంచి వధింప [1]నెవ్వగదాఁక,
నెట్టనఁజూచి యానృపచక్రవర్తి
యాలికడ్డముచెప్పనన్నాఁడు గాన
లోలోన వగలఁగాలుచు నోర్చియోర్చి,
యనలతేజుని నంత నష్టమపుత్త్రుఁ
గొనిపోవఁ, బోనీక కోపించిపలికె

1. నెవ్వరు. (మూ)

చేట్టున రేఁగి యాజ్ఞాసేని ఁ జూచి:
"వెట్టిదానవుగాక వెలఁది, నీకడుపు
చుట్టనకున్నది చోద్యంబు చూడ!
వట్టువచ్చిన నట్లు వలచితి గాక,
కొట్టుమ్రింగినయట్లు కొంత గైకొంటి
నట్టుత్రొక్కుట నడ్డ పాడరాదనుచు.
జుట్టఁజూచితి నీవు సోమకులంబు!
మట్టిపుండెడు భూతమాతవు గాక,
కట్టువట్టిద (?) నీవు కాంతవుగావు.
ఒట్టెలాగునను సన్నోకిమాట యున్న,
జట్టన [1] జూతెదు సంసారమెల్ల.
విట్టిపీగిక నీవు విడిచిన, మాకు
జెట్టికి నొకకాలు చేసినట్లు [2] సకియ!
తిట్టఁబోసిననీళ్లు తెలుప, నీబ్రదుకు;
గొట్టెదూడలఁజేస్తి కొడుకులనెల్ల.
ఉట్టూతలూఁగు నీయురుకుచద్వయము
ముట్టుపాలేబిడ్డ మూతిఁ బట్టితివి!
కుట్టులవంటి నాకొడుకుల మ్రింగి,
గట్టునఁ ద్రేంచెను గంగలో మీలు!
అట్టాడి మ్రింగిన నట మ్రింగనిమ్ము,
తట్టు, [3] మొత్తెద వాని దఁకుమాటలాడి.
మిట్టుగాడే యెల్లి మిన్నేరు! పూడ్చి,
కొట్టువిత్తించెదఁ గోపంబు మాన;
ఈకుమారకు జముకీకు మాఱకము;
నీకు మాఱాడితి నేఁ"; డన్న నవ్వి:
"ఏటికి నామీఁద నింతకోపంబు!
వాటంపునెయ్యంబు వలదన్న మాని,

1. జారదు. 2. సతుల. 3. మొత్తెద. (మా)

చాలించి పోయెద జాహ్నవి నేను ;
బాలు నేఁ గొనిపోయి భక్తిఁబెంచెదను ;
యావనప్రాప్తితో నరుదెంచు నిచటి
కీవసుంధరకెల్ల నితఁడొడయండు ;
పుట్టుచు మరణంబుఁబొందినవారు
నెట్టన వసువులు నేఁడైన నెఱుఁగు ;
వారి వశిష్ఠుండు వసుధపైఁ బుట్ట
నీరీతిఁ బొమ్మన్న నేతెంచినారు ;
ఒప్పఁగా నీచేత నుపకృతులైన
యప్పుణ్యు లొకవేళ నగుదురు నీకు."
అనిచెప్పి, గంగ రయంబెసగంగఁ
దనయునిఁగొంచు శంతనుడించి పోయె.
అంత నూరికివచ్చి, యతఁడవ్వధూటిఁ
జింతించి చింతించి చిత్తజుండేఁప,
నూరిపట్టున నుండ నుల్లంబురాక
వీరవర్గముగొల్వ వేటాడవెడల,

శంతనుఁడు భీష్మునిఁ బడయుట

భాగీరథీ నదీ పథమునఁ దొంటి
భోగభూమికిఁ బోయి పొడగనునపుడు,
కదిసి యోడలఁగాని గడువంగరాని
యుదకంబు సన్ననై యుబ్బెల్లస్రుక్క,
పలుచనై చెదరుచుఁ బాకుజాళ్లకును
సలబల సేయుచు నడుమంటస్రుక్క,
యారీతిఁ దనుబాసి యాకాశగంగ
భూరి తనుత్వంబు పొరసినోయనఁగ
జాలువారుచునున్న సందియంబంది
హేల [1] ప్రయాణమై యెగువకుఁ బోయి,

1. ప్రమాణుఁడై. (మా)

యక్కడఁ జూడఁగాంచె నాత్మనందనుని ;
నొక్కండు వింట నేయుచునున్నవాని,
నట్టగా నేసిన యమ్ములకట్టఁ
దొట్టిన నీటికండుప నున్నవాని,
నరుదారఁ దనరూప మచ్చొత్తినట్లు
భరియించి బహుకళాప్రభనున్నవానిఁ
గనుఁగొని, తనసుతుఁగా నిశ్చయంబు
మనమునలేకయు, మమతావిభూతి :
" నెవ్వనితనయుఁడో యీదీర్ఘ [1] బాహుఁ !
డెవ్వనిపుణ్యమో యీమేలుగాంచె !
సుతు నింతవాని నీశుఁడు నాకు నీయ
క్షితికెల్ల యువరాజుఁజేయంగఁ దగదె ! "
అనివిచారించుచో, నతనికి గంగ
వనితయైపొడసూపి వరలజ్జఁబలికె :
" ఏను మున్నిటిగంగ ; నితఁడునీసుతుఁడు ;
మానవేశ్వర, నీవుమఱచిన వినుము.
ఇతఁడు వశిష్ఠుతో నల్లవేదములు
చతురతఁ జదివె శాస్త్రములతోఁగూడఁ ;
బరశురాముఁడు నేర్ప బహుతరవిద్య
శరములు మంత్రించి సంధింపనేర్చె ;
వాహనారోహణ వరశక్తియుక్తి,
[2] వ్యూహాశుకృతులఁ దా నుపదిష్టుఁడయ్యె ;
సనకసనందన సన్మునీశ్వరుల
ఘనకృప నెఱిఁగె [3] యోగప్రకారంబు ;
నింతటఁ గొనిపోయి యేలింపుధరణి ;
సంతాన [4] వంతులసరస నుండెదవు ".

1. దేహుఁడె. 2. వ్యూహతాశుకృతానుపదిష్టుఁడయ్యె. 2. యోగప్రకార్యంబు.
4. రీతుల. (మా)

అనుటయు, వేడ్కఁ జా నాగంగననిచి
తనయునిఁ దెచ్చి, శంతనమహీవిభుఁడు
హాస్తిపురంబులో నతనికి వేడ్కఁ
బ్రస్తుత యుపరాజపట్టంబుఁ గట్టి,
రణమున సాధింపరానిశాత్రవుల
నణుమాత్రమున గెల్చి, యతనిసత్వమున
జలరాశి వేష్టిత సకలభూతలము
నలమి యేలుచునుండి, యటనొక్కనాఁడు,

### శంతనుఁడు సత్యవతిని మోహించుట

ఆపగేయునిమీఁద నఖిలభూభరము
మోపి, రథంబెక్కి ముదము రెట్టింప
యమున [1] వాలునకు నెయ్యమున వేటాడ
నమితసేనాఢ్యుఁడై యరిగి, యచ్చోటఁ
గప్పారుజలముపైఁ గాంచనచ్ఛాయ
నొప్పారుచున్న యాయోజనగంధి
నీలమేఘంబుపై నెలకొను మెఱుపుఁ
బోలియుండఁగఁ జూచి, బుద్ధినూహించి :
" యీసౌరభంబును, నీజవ్వనంబు,
నీస్వరూపము బ్రహ్మ యీయింతికొసగి
[2] నాకల వలనొప్ప నడుమ నిట్లునిచె ;
నీకార్యమునఁగదా యితఁడు [3] ఛాందసుఁడు ! "
అనితలపోసి యిట్లను నింతిఁజేరి :
" వనిత, నీరూప యౌవన విలాసములు
సూడిదగాఁ జిత్తజునకు నీవచ్చు ;
నోడరేవున నుండ నుచితమె నీకు !
నింతికి నర్ధాంగమిచ్చిన శివుఁడు
కాంత, నీరూపంబుగని సిగ్గువడఁడె !

---

1. చాల్పునకు. 2. నాకలోపల నొక్కనాప యిట్లునిచె. 3. ఛందసుఁడు. (పా)

కాముండు మూర్తితోఁ గలిగిననాఁడు
నీ[1] మేనుగలిగిన నిలుచునే [2]జగము !
ఎన్నంగ ధరయెల్ల నేలినవాఁడ,
నన్ను నేలుదుగాక నలినాయతాక్షి !
కాముబారికి మునుగాము ; నీప్రేమ
యేమనిభావింతు నెఱిఁగింపఁగదవె !"
అనిన నాతనిమూర్తి కతివమెచ్చియును,
మనసువికారంబు మఱువెట్టి పలికె :
"ఏనియ్యకొననేర నీయర్థమునకు ;
మానవేశ్వర, నీవు మాతండ్రినడుగు ;
అల్లదె మాపల్లె ; యందు మాతల్లి
పల్లీలతోఁగూడి జనకుఁడుండెడిని ;
వారినుండియు నీవు వచ్చునందాఁక
వారినుండెదఁ బూర్వవర్తనంబునను ;
విచ్చేయుము." మనవుడు, విరిదమ్మినుండి
యచ్చుగాఁ బోలేని యలిపోలె నతఁడు
సతిఁబాయలేకయు రఘువవై రిపురికిఁ
గతిపయ [3]మంత్రిసంకలితుఁడై పోయి,
దాసుఁడయ్యును విష్ణుదాసుఁడై యున్న
యాసతీమణితండ్రి నచ్చోటఁ గాంచి,
యతనిచేఁ బూజితుండై వేడ్కఁబలికెఁ :
"జతురత మాతోడి సంబంధివైతి ;
కాశి నీగతి మత్తకాశినీమణుల
దాసులు గానరు తపముచేసియును.
రత్నంబుగంటివి ; రభసంబు [4]మిగుల
యత్నంబుతో నడుగ నరుదెంచినాఁడ.

---

1. మేలు. 2. జయము. 3. మాత్ర. 4. అఖిల. (మూ)

గ్రామంబులిత్తునో ! కరులుగావలెనో !
హేమ మౌక్తిక రాసులిత్తునో ధనియ !
నెయ్యది నీకోర్కె ? యెఱిఁగింపు." మనినఁ,
దియ్యనిమాటల దేవలుండనియె :
"హరిణలోచనఁ బెండ్లియాడెదు గాక ;
ధరణీశ, నీకంటెఁ దగువారువేరి !
ఉంకువ నీచేత నొల్లముగొనఁగ ;
నింక చెప్పకపోదు హితలీల వినుము ;
నాపుత్రికుదయించు నందనునంద
యువరాజభారంబు నున్పనోపుదువె !
ఓపిన, నిది నాకు నుంకువ". యనినఁ,
గోపమించుకవచ్చి కువలయేశ్వరుఁడు :
"ఆపగేయుఁడు రాజ్య మరయుచునుండ,
నీపని యెట్లుగా నేనియ్యకొందుఁ !
గట్టిడికార్యంబు, కళ్యాణియైనఁ
గట్టినట్లున్నది కడునాత్మనాకు."
అనిఖిన్నుఁడై పోయి హస్తినాపురము,
తనయిల్లువెడలక తాపభారమున,
వాలినమొగులులో వనజాప్తుఁ [1] డట్లు
చాలఁదూలిన జీర్ణచంద్రుండువోలెఁ
గుంభినీజనులకుఁ గొలువియ్యకున్న,
గాంభీర్యజలరాశి గాంగేయుఁ డెఱిఁగి,
యయ్యెడ నొక్కనాఁ డయ్యయున్నెడకు
నొయ్యన సుముఖుఁడై యొక్కఁడుఁ బోయి :

భీష్మ ప్రతిజ్ఞ

"యిదియేమి తండ్రి ! నీవెన్నఁడు [2] లేదు,
చెదరియున్నావు నీచిత్తంబులోన !

1. డున్న. 2. లేమి. (మా)

సాధింప, ఘనుఁడైన శత్రుఁడా లేఁడు !
బాధింప, నోడినపాపంబు లేదు !
విల్లు నేనును గల్గ విజయంబునీకు ;
నెల్లకార్యములు నాకెఱిఁగింపు." యనిన,
(ననువొప్పఁ డా వేట కరిగినలాగు,)
ఘనుఁడు యోజనగంధిఁ గదిసినలాగు,
రమణికి సుతుయౌవరాజ్య మింకువగ
(సమరంగ దాశరా జడిగినలాగు,)
పలదని తా నంత వచ్చినలాగు,
లలిఁ బంచశరుఁడేయులాగుఁ జెప్పుటయు,
గురుభక్తి యాత్మలోఁ గొలఁదికి మిగుల
సురనదీతనయుండు క్షోణీశుఁబలికె :
"జాలరీఁడాడినచతురంపుమాట
మేలగైకొనవైతి ! నేనున్న నేమి !
గురుహితం బెఱుఁగని కొడుకేమికొడుకు !
ధరణీశ, నీకోర్కి తలకూర్తు వినుము ;
అందుఁబుట్టెడువాఁడు ననఘు, నీసుతుఁడు ;
పొందుగా ధర యేలఁబోలదే చెప్పుము !
తగ నేనపోయి, యాతని నొడంబఱచి
మగువఁదెచ్చెద"; నని మక్కువఁబోయి,
దేవలుఁగాంచి సుధీవరుఁడనియె :
"భూవరునకు నేల పుత్రినీవైతి ?
నాచిత్తమెఱుఁగక నరనాథుఁ డపుడు
నీచేత నతి నందనేరకపోయె.
అతఁడేమెఱుఁగు ! నీయాత్మజఁగాంచు
సుతునిఁ బట్టముగట్టి క్షోణియేలింతు ;
నేనేలనొల్ల ; సూర్యేందులు సాక్షి ;
మానవేశ్వరునకు మగువని." యనిన,

దక్కఁగా నాఁడుబిడ్డల నిచ్చుచోటఁ
దక్కక చింతింపఁదగుఁ ; గాన నతఁడు
నృపనందనునిఁబల్కె : "నీకు నీవోపి
నృపునిఁ జేసెదనంటివి ; నిజము నీమాట ;
నీకుఁబుట్టెడువారు నీయంశమునకు
రాకమానరు ; ఘోరరణములో నపుడు ;
కావునఁ, గూడదు కళ్యాణ". మనిన,
నావేళమెత్తిన ట్లతఁడు భీష్మించె :
"ఏను పెండిలియాడి యెన్నఁడే నొకనిఁ
గానఁగ మఱిగదా! గలుగుఁ గయ్యములు ;
మనుజేంద్రపెండ్లికై [1] మానెదఁబెండ్లి ;
ఘనతఁ బుత్త్రులఁ గానఁగలవాఁడఁ గాను.
[2] అమరమైయుండు నాయౌవనావస్థ ;
రమణుల [3] సంగ యారంభదీమముగఁ
గుసుమాస్త్రుఁడేయనీ కుసుమబాణముల,
వెస వీడిపోవనీ పితరులునన్నుఁ,
బట్టితిఁ బట్టితి బ్రహ్మచర్యంబు
గట్టిగా." ననుటయుఁ, గడు [4] మెచ్చి సురలు
'దేవవ్రతుం' డని దివినుండి పొగడ,
భూవరుపైఁ గురిసెఁ బుష్పవర్షములు.
'భీష్మించి యతఁడేఁగెఁ బితృభక్తి' ననుచు
భీష్మనామకుఁ జేసి పిలిచిరి జనులు.
అంత సంతోషించి, యాదాశరాజు
'శాంతనిచ్చితి' నని గాంగేయు వెనుక
నిభముపై గూఁతురి నెక్కించుకొనుచు
నిభపురంబున కేఁగె నెలమిదీపింప.

1. మానెనా. 2. అమరమై. 3. సంగనిరంభటోయము. 4. నొప్పి. (మా)

సత్యంబుతోవచ్చి సౌంజ్ఞ దైవార
సత్యవతీదేవి జనకున కపుడు
విభవంబుతో యుక్తవిధిఁ బెండ్లిసేయ,
నభినవోత్సాహుఁడై యపుడు పుత్త్రునకు
నరవిఁ గోరినదాఁక చావులేకుండ
వరమిచ్చి, యాసత్యవతియును దానుఁ
జిత్ర చిత్తజకేళిఁ జెలఁగుచునుండి,
చిత్రాంగదునుని విచిత్రవీర్యునిని
బుత్త్రులఁగాఁగాంచి, పుత్త్రోత్సవంబు
ధాత్రిమెచ్చఁగఁ జేసి తనరఁబెంచుచును,
రాజ్యంబుచేసి, యారాజు గీర్వాణ
రాజ్యంబు కాలధర్మమునఁ బ్రాపించె.
అప్పుడు భీష్ముఁ డయ్యబల నూరార్చి,
తప్పక శ్రాద్ధముల్ తండ్రికిఁజేసి,
నవలీల సింహాసనంబు గైకొనక
యవనికి రాజుఁ జిత్రాంగదుఁజేసె.
చేసినచోట నాచిత్రాంగదుండు
వాసవునైన సత్వమునఁ గైకొనక :
"కరి గండభేరుండ కంఠీరవముల
గరిడికిఁగొనివచ్చి కడఁక నొంచుదునో!
ఏఱులన్నియుఁ బూడ్చి, హేమాద్రి పెఱికి,
జారంగవిడుతునో జలధిలోపలను!
కాదేని, జలధిచక్రము ప్రక్కలించి
పోదునో శేషుతోఁబోరాడ! ననుచు,
నట్టిదిగాదేని, యవని సత్వాఢ్యుఁ
బట్టి సాధింతునో బలమున!" ననఁగ,

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

అంత నేతెంచెఁ జిత్రాంగదుఁడనఁగఁ
గాంతిభీకరుఁడైన గంధర్వుఁ డొకఁడు;
ఏతెంచి యారాజు నిట్లనిపలికె:
" భూతలాధీశ, చెప్పఁగుదు నీలావు;
అష్టదిక్కరులను నడిగితి రణము;
నష్టదిక్పాలుర నడిగితి రణము;
నెందులేదు; భుజంబు తీర్పులు వట్టె;
విందుసేయుము మల్లవిద్య నా ". కనుచు
నరులుతిచ్చపడంగ నలినాక్షులేడ్వ,
దొరలునివర్తింపఁ దోడ్కొనిపోయి,
భూరి కురుక్షేత్రమున నాజిచేసి,
యారాజుఁ దెగటార్చి యాతండువోవ,
నొక్కింతశోకించి, యూర్ధ్వకృత్యములు
తక్కక భీష్ముఁ డాతనికిఁ జేయించి,
యుర్వి కాతనితమ్ము నొడయనిఁజేసి
సర్వంబునడపుచో; [1] జగతిలో నంత,

### కాశిరాజుకూఁతుల భీష్ముఁడు తోడ్తెచ్చుట

మువ్వురుసుతలకు మొగిఁ గాశిరాజు
జవ్వనంబునఁ బెండ్లిసమకూర్ప వలసి
వీరస్వయంవరవిధికి భూవరుల
వారక పిలిపించువార్త పుట్టుటయు,
నొక్కఁడు రథమెక్కి యుర్విగ్రక్కదల
గ్రక్కున భీష్ముఁ డాకాశికిఁ బోయి,
తప్పక వీరులందఱు నల్గువాతి
కప్పలగతినుండఁ గనుఁగొని నవ్వి,

1. జనులలో. (మా)

కమనీయ కమలినీ కబళనార్థంబు
కమలాకరముఁజొచ్చు గజములనుబోలె
మచ్చుగాఁ బన్నిసమంచెలమీఁదఁ
జొచ్చి, కాశీశుండు చూడఁజూడంగ,
నంబుజగంధుల నంబ యంబికయు
నంబాలికయు ననునట్టి కన్యకలఁ
దనరథంబెక్కించి దర్పించిపలికె:
“ మనుజేంద్రులార, యేమఱియుండనలదు ;
అనుజునిపెండ్లికి నఖిలంబు నెఱుఁగఁ
గొనిపోవుచున్నాఁడఁ గుటిలకుంతలుల.
ఆసుర బ్రాహ్మంబులను వివాహముల
నాసుర మీపెండ్లి ; యర్హంబు మాకు ;
పెనఁగివినుండు నాపేరుభీష్ముండు ;
వినుఁ డొంటివచ్చితి విల్లునునేను ”.
అనిపోవఁ, బోనీక యడ్డంబుదాఁకి,
జననాథు లస్త్రశస్త్రంబులచేత
ముంచిన, నతఁడు రామునిశిష్యుఁడొటఁ
బొంచి యానృపవైరమునఁ బెచ్చుపెరిగి,
యనుపమాస్త్రంబుల నవి ద్రుంచివైచి,
తనరథవేగంబు దప్పకయుండఁ,
గృత్తసూత రథాశ్వ కేతన చ్ఛత్ర
మత్తేభ [1] కుంభముల్ మార్గంబుదెలుప,
విచ్చుచుఁ బొదువుచు వెస భానుమీఁద
వచ్చుమంచువిధంబు వైరులు దెలుప,
నావలవెడలినయతనిబాణములఁ
బ్రేవులుదునిసియుఁ, బృథివివ్రాలియును,

1. శుభముల. (మా)

[1] బిరుదులువోయియు, విఱిగియు, నృపతు
లరవరులయ్యు నయ్యనువుఁ డస్సి
[2] దీనాస్యులై పెక్కు తెరువులఁ బోవఁ,
దానట్లుపోవక తవిలి సాల్వుండు
భీష్ముని నారాచ [3] ప్రేరితుఁజేయు,
గ్రీష్మకాలాదిత్యు క్రియ నాతఁ డలిగి,
విల్లును జోడును [4] వెడఁదైన కేడె
మల్లిమఁ దునిమి, యయ్యెడ నొక్కకోల
నాటించి తేరుభగ్నముసేయ, నతఁడు
దాటి ధాత్రికిడిగ్గి తలపీడఁబాసె.
అంత నూరికివచ్చి యాపగేయుండు
కాంతల నొక్కలగ్నమునఁ దమ్మునకు
... ... ... ... ...
... ... ... ... ...
శక్తిత్రయంబుతో సంధించునట్లు
భక్తిమైనున్నచోఁ బలికె నయ్యంబ:
"నరనాథ, యిటమున్న నన్ను సాల్వుండు
వరియించె; మాతండ్రివచనంబుఁగలదు;
నీవునుఁదెచ్చితి; నీతిమార్గమున
భావింప, నీకంటెఁబ్రాజ్ఞులు గలరె!"
... ... ... ... ...
అనుటయుఁ, దనకుమున్నైన యాయింతి
ననిచి, భీష్ముం డంబికాంబాలికలను
ననుజునకిచ్చిన, నసమాస్త్రకేళిఁ
దనియక యతఁడు నిత్యంబుఁగ్రీడించి,
నానాఁటి కొడల జీర్ణవ్యాధిపుట్టి
మానక యాలీల మరణంబునొందె.

1. చిరవులుఁవోయివారిగియున్నపతు. 2. దీనాకులై. 3. ప్రేరితుని. 4. వెడఁగైన నమరి. (మా)

అరయ నట్టిదకాదె యధికశోకంబు
నరులకుఁ గొఱగాదు నయపథఁజూడ.
గాంగేయు భూనాథుఁగాకుండ నడఁగి
యంగననిచ్చిన నదియేల వెలయు!
అనుజుఁడిట్లేఁగిన, నాపగేయునకు
మనమున శోకాగ్ని మంటలై మండ
దీనుఁడై, మొవ్వారు దెలిపినఁ దెలివి
నూనక మూర్ఛిల్లి యొక్కింతదెలిసి:
"శంతనుమాఱుగాఁ జర్చించి మిమ్ము
నెంతయు నరసితి నేఁ దమ్ములార!
[1] ఒమ్మగుపనిగాఁగ నొకమాను వాఁడువ
బొమ్మరమ్మును గాకపోయినట్లయ్యె!
ఇలకు విచారింప నే నున్నవాఁడఁ!
గులసూత్ర మింతతోఁ గుఱుచయయ్యెడినో!
ప్రాణసాధ్యంబైనపని గాదుగాక,
ప్రాణంబునకు నడ్డపడనె యింతకును!"
అనియేడ్చి యతనికి నపరకర్మముల
నొనరించి, యరయుచునుండె భూతలము.

## చంద్రవంశోద్ధరణకై సత్యవతి ప్రయత్నము

నిత్య నిస్స్పృహావృత్తి నెగడినయతని
సత్యవతీదేవి జపవేళఁ గదిసి,
విపులచంద్రముఖంబు వెసవాంచియున్న
యపరయామినివోలె నాస్యంబువంచి,
మొలుఁగు[2] దగ్గువడంగ నేడ్చుచుఁబలికెఁ:
"గలరెధర్మజ్ఞులు ఘనుఁడ, నీకంటె!

1. నమ్మరొక్క పనిగానువాఁక. 2. దగ్గఱఁగ. (మా)

సకలపావనమైన చంద్రవంశమున
[1]నొకఁడవె శేషించియున్నాఁడ విపుడు ;
శంతనుహితముగా సంతానము నందఁ
గాంతానుభోగంబు గైకొనవలయు ;
అరులు నీతరువాత 'హాస్తినాపురము
దొరకునా' యని యాసతో నున్నవారు ;
ఆరయ బ్రహ్మచర్యం బింక వలదు ;
కారణం బెడలుచోఁ గార్య మేమిటికి !"
అనిన భీష్ముఁ డిట్లను : "నమ్మ, యిట్లేల
ననువిచారింపవు నయహీనుఁ జేసి !
పట్టనేరుతునఁట ! పట్టిన వ్రతము
నెట్టన విడుతునే నింగి పైఁబడిన !
ఎల్లధర్మంబుల నెఱుఁగుదు వంటి ;
తల్లి, యీమాటకుఁ దగుదునె యేను !
ఎఱిఁగినధర్మంబు నే విన్నవింతు ;
నెఱిఁ జంద్రవంశంబు నిలుచునట్టైన.
పరశురామునిచేతఁ బతులఁ గోల్పోయి
తరుణులు తొల్లి త్రేతాయుగాంతమున
నాచరించినధర్మ మఖిలపురాణ
సూచితంబైనది సుచరిత్ర, కలదు ;
సర్వలక్షణముల సంపూర్ణుఁడైన
యుర్వీసురేంద్రుని నొకని వరించి,
సన్మతి శుచి ఋతుస్నానంబు చేసి-
యున్న నీకోడండ్ర యొద్దకుఁ దెచ్చి,
పుడమికి దిక్కుగాఁ బుత్రభిక్షంబు
నడిగించు ; కలిగెద రతనివీర్యమున.

1. ఒకటియె. (హా)

కలరు నమ్మము రాజకాంత లీరీతిఁ
గులముగిల్పినవారు కుంభినిమీఁద."
ననిన శంతనుఁడేని యంగీకరించి,
తనకుమారుని వ్యాసుఁ దలపోసి పలికె:
"కన్నియావయసునఁ గంటి నేఁబుత్త్రు ;
నున్నాఁడు మునిచంద్రుఁ డుత్తమోత్తముఁడు ;
[1] ఆరయఁబోనేల యన్యునొక్కరుని !
మేరువుపైనుండి మిన్నేల వెదుక !
శాంతిశీలుఁడు చాలఁజక్కనివాఁడు
శాంతిమతులఁ జేరఁ దలిగించుసుతుఁడు ;
అతఁడు వ్యాసుండు ; మహాముని పుత్త్రుఁ ;
డితరుండుగాఁడు ; నీ వెఱఁగినవిధము.
అలయక నాయాజ్ఞ యమ్మహామౌని
తలఁదాల్చి పుత్త్రులదానంబొనర్చు."
ననిన భీష్ముఁడు లేచి యంజలిచేసి
కనుదోయి మోడ్చి చక్కఁగఁదూర్పునిలిచి:
"ఓంకారమయరూప, యోవ్యాసమౌని,
పంకజాసనునకుఁ బ్రతియైన స్వామి,
హరియుద్ధరించినయఖిలవేదములు
సరవి నేర్పఱచిన జగదేక హితుఁడ,
సావధానంబున సాత్యవతేయ,
రావయ్య మీతల్లి రక్షింపుమనియె ;
మునిచంద్ర, మునిసింహ, మునిసార్వభౌమ,
యనిమిషేశ్వరవంద్య, యరుగుదేవయ్య !"

వ్యాసుఁడు తల్లికిఁబొడసూపుట

అనిన, జేగురుకాల్వ లందును నిందు
[2] నినిచివ్రేలఁగవచ్చు నీలాద్రివోలె

1. అరసిపోవఁగనేల. 2. నిలి. (పా)

మెఱుఁగుఁదీఁగెలతోడి మేఘంబుపోలె
చేఱుపులై పింగళజట లుల్లసిల్ల,
ద్వైపాయనుఁడువచ్చి తల్లికిమ్రొక్కి :
'ఏపనిగలిగెనో యెఱిఁగింపు ;' మనిన,
నప్పుడు గాంగేయుఁ డర్ఘ్యాదివిధుల
నప్పరాశరసూను నర్థిఁ బూజించి,
యున్నతాసనముపై నునిచి కీర్తించి,
కన్నులుచల్లఁగాఁ గనుఁగొనుచుండ
నాసత్యవతి వేడ్క నతనికిట్లనియె :
" వ్యాస, తలంపఁగా వచ్చితి నేఁడు ;
వారిపోలె నందఱయంతరంగముల
చరితంబులెఱుఁగుదు సంయమితిలక !
ధర వచ్చివచ్చి శంతను [1] ననంతరము
[2] పఱిపోవఁగానుండె భరతవంశంబు ;
తనయులఁబడయఁ డీతఁడు బ్రహ్మచారి ;
పసివసి గురుసిక్కై పట్టెనువ్రతము ;
కూలిరిద్దఱుపుత్త్రకుల ధురంధరులు ;
వాలిన నాలోని వగలార్పవయ్య !
అంబుజముఖులు నీయనుజునిభార్య
లంబికాంబాలికలనియెడువార
లున్నారు ; వారిలో నొక యింతియందు
మన్నించి యొక్కకుమారు నీవయ్య !
దేవరన్యాయంబు ధృతిఁజేయవచ్చు ;
నావల నీకంటె నర్హుండు లేఁడు. "
అనిన, వేదవ్యాసుఁ డంబకిట్లనియె :
" విను మెఱుంగుదు లోకవిదితమీతెఱఁగు;

1. నందనుండు. 2. పఱిపోవుచునుండె. (మూ)

కలరు నమ్ముము రాజకాంతలీరీతిఁ
గులమునిల్పినవారు కుంభినిమీఁద."
ననిన శంతనుఁడది యంగీకరించి,
తనకుమారుని వ్యాసుఁ బిలిపించి పలికె:
"కన్యయైయుండఁ గంటి నేఁబుత్త్రు ;
నున్నాఁడు మునిచంద్రుఁ డుత్తమోత్తముఁడు ;
1 అరయఁబోనేల యన్యునొక్కరుని !
మేరువుపైనుండి మిన్నేల వెదుక !
శాంతిశీలుఁడు చాలఁజక్కనివాఁడు
శాంతిమతులఁజేసి వెలిగించుసుతుల ;
అతఁడువ్యాసుండు ; మహామునిపుత్త్రుఁ ;
డితరుండుగాఁడు ; నీ వెఱఁగినవిధము.
అలయక నాయాజ్ఞ యమ్మహామౌని
తలఁదాల్చి పుత్త్రులదానంబొనర్చు."
ననిన భీష్ముఁడులేచి యంజలిచేసి
కనుదోయిమోడ్చి చక్కఁగఁదూఁపునిలిచి :
"ఓంకారమయరూప, యోవ్యాసమౌని,
పంకజాసనునకుఁ బ్రతియైన స్వామి,
హరియుద్ధరించినయఖిలవేదములు
సరవి నేర్పఱచిన జగదేకహితుఁడ,
సావధానంబున సాత్యవతేయ,
రావయ్య మీతల్లి రక్షింపుమనియె ;
మునిచంద్ర, మునిసింహ, మునిసార్వభౌమ,
యనిమిషేశ్వరవంద్య, యరుగుదేవయ్య !"

వ్యాసుఁడు తల్లికిఁబొడసూపుట

అనిన, జేగురుకాల్వ లందును నిండు
2 నినిచిప్రేలఁగవచ్చు నీలాద్రివోలె

1. అరసిపోవఁగనేల. 2. నిలి. (మా)

మెఱుఁగుఁదీఁగెలతోడి మేఘంబుపోలె
చేఱపులై పింగళజట లుల్లసిల్ల,
ద్వైపాయనుఁడువచ్చి తల్లికిమ్రొక్కి :
'ఏపని గలిగెనో యెఱిఁగింపు ;' మనిన,
నప్పుడు గాంగేయుఁ డర్ఘ్యాదివిధుల
నప్పరాశరసూను సర్థిఁ బూజించి,
యున్నతాసనముపై నునిచి కీర్తించి,
కన్నులుచల్లఁగాఁ గనుఁగొనుచుండ
నాసత్యవతి వేడ్క నతనికిట్లనియె :
" వ్యాస, తలంపఁగా వచ్చితి నేఁడు ;
వారివోలె నందఱయంతరంగముల
చరితంబులెఱుఁగుదు సంయమితిలక !
ధర వచ్చివచ్చి శంతను [1] ననంతరము
[2] పతిపోవఁగానుండె భరతవంశంబు ;
తనయులఁబడయఁ డీతఁడు బ్రహ్మచారి ;
పనివడి గురుసిక్కై పట్టినవ్రతము ;
కూలిరిద్దఱుపుత్త్రకులు ధురంధరులు ;
వాలిన నాలోని వగలార్పవయ్య !
అంబుజముఖులు నీయనుజునిభార్య
లంబికాంబాలికలనియెడువార
లున్నారు ; వారిలో నొకయింతియందు
మన్నించి యొక్కకుమారు నీవయ్య !
దేవరన్యాయంబు ధృతిఁజేయవచ్చు ;
నావల నీకంటె సద్బాంధు లేఁడు. "
అనిన, వేదవ్యాసుఁ డంబకిట్లనియె :
" విను మెఱుంగుదు లోకవిదితమీతెఱఁగు;

---

1. నందనుండు. 2. పరవిపోవుచునుండె. (మూ)

జాదులు ధరియించి నసుదెంతుఁగాక ;
భూదేవుఁ డుస్స్త్రుఁడు పుర్వ్యుఁబాప్పుసు ;
అతఁడు వేదవ్యాసుఁ డతఁడు, మీ బావ ;
యమిశక్తిరయొనరించు నవనుతుడు సుతుని. ”
అనుటయు లజ్జించి యత్తమత్తరము
వనిత యీనోపక పరుసఁగ్గి సేసి,
రక్షదీప ములు రమణీయధూప
యుత్తలంబుఁ గలిగినయెముపాలికిఁ బోయి,
కపిలవర్ణంబైన గడ్డంబు జడలుఁ
దపసినల్లనికేసుఁ దప్పకచూచి,
రొదగఁగ [1] గబ్బరికింప నోఁడాడ నోడి,
పెడఁదకన్నులు మోడ్చి వెఱచుచునుండఁ,
దగినకార్యముదీర్చి ద్వైపాయనుండు
మగుడ మళ్ళవెఁబంచి, మఱునాఁడు తేవు
అంబికవృత్తాంత మడుగుచున్నట్టి
యంబతోనిట్లను : “ సద్యోగార్యంబు ;
పుడమియేలెడుభోగి భుజబలోన్నతుఁడు
కొడుకు జన్మించు నీకోడలియందు ;
ననుజూడనోడి యున్నతిఁగన్ను మోడ్చు
జననిదోషంబున జాత్యంధుఁడగును ;
అంబికాసంభోగ మభవుండు సేయ
లంబోదరుఁడుపుట్టె లలి వక్రముఖుఁడు ;
ఈయంబికయుఁ బుత్త్ర నిటుగనఁగలదు ;
చేయు నేమున్నది శివునాజ్ఞగాక !
వినుబోయెద. ” నన్న నింతి చింతించి :
‘ మహాసేంద్ర, పోకుము ; మఱిపోదు గాని,

1. “ జలదరింప ” అనుటమేలు. ప్రస్తుత పదము ఈయర్థముననే ప్రయోగింపఁ బడియుండును.

బాలికయైన యంబాలిక నేఁడు
నోలినంటుననుండి యుగకంబులాడె;
దానిఁ బుత్తెంచెదఁ దనయునొక్కరునిఁ
బూని దోషవిహీనుఁబుట్టింపుమందు."
అనుచుఁ దొల్లిటియట్ల కామినివేళ
మునియున్నచోటికి ముద్దియ సనుప,
నదిపోయి మునిపుత్త్రునాకృతిఁ జూచి
బెదరి వెల్వెలఁబాఱి, 'వెఱవకు' మనుచుఁ
గాలోచితముదీర్చి, ఘనుఁడు మాన్యుఁడు
కాలవేదుకనున్న జననికిట్లనియె :

## ధృతరాష్ట్రపాండురాజుల జననము

"అంబ, యంబాలిక[1] యందులోపమునఁ
గంబువర్ణుఁడుసువ్వొ గలుగు నందనుఁడు;
వెలవెలఁబాఱినవికృతికి నదియుఁ
దలఁప నూరకపోదు తల్లిదోషంబు."
అనిచెప్పిమునిపోవ, నంతఁ గోడండ్రఁ
గినిసి గర్భములురక్షింప నేమించె.
అంత వ్యాసులుచెప్పినట్ల నందనులు
కాంతల కిరువురు గ్రమముతోఁ గలిగి;
రాజానుబావాలువు లమరమార్తాండ-
తేజులునై యుండ దృష్టించి, యవ్వు
డుప్పొంగి గాంగేయుఁ డోలి బ్రాహ్మణుల
రప్పించి ధనముధారలువోసి యిచ్చి,
పురము శృంగారింపఁబుచ్చి, సక్రమగు
కరమొప్ప జాతసంస్కారముల్ చేసి,

1. యువనిలోపలను. (మూ)

దిననాథనిభుఁడు ధృతశాస్త్రసాంద్రు
లనియెడునామంబు లనువుగావించి
పెనుచుచో, మఱి యంతఁ బెద్దకోడలికి
ననఘ, పుష్పోదయంబైన యట్టైన,
మజ్జనదినమున మాపటివేళ
సజ్జనుతుఁ బరాశరసూనుఁ దలఁచి
రప్పించి : "పలుకనేరరు మఱఁదండ్రు ;
తప్పిరి నినుజూచి ; తమ కేలవెఱవ!
ఇంగితంబెఱిఁగి నిన్నించుకనేపు
శృంగారరసపూర్ణుఁ జూడలేరైరి.
ఊనంబుగలిగిన సర్వేశునైన
మానవు లొక్కింత మతులఁగైకొనరు.
అనిచెదఁ బ్రార్థించి యంబికనేఁడు ;
తనయునొక్కని దివ్యతనయుఁగా నీవె!"
అనిచెప్పి యారాత్రి యాయింతి ననుప,
మునిఁబొందనేరక ముద్దియరోసి
తత్తరింపుచు డాఁగి, తనదాదికూఁతు
నత్తగానకయుండ నంపె ; నంపుటయు,
నదిపోయి తననేర్పులన్నియు మెఱసి
మదనుండుమెచ్చంగ మౌనిఁగూడినను,
దల్లికి తేపాడి తనయుఁడిట్లనియె :
"సల్లోకవిజ్ఞాని యుదయించుఁ గొడుకు ;
[1]శూద్రఁ గాంచుటఁజేసి శూద్రుఁడౌఁ ; గాన,
భద్రాంగి, కులము నిల్పఁగఁజాలఁ డతఁడు."

1. శూద్రి. (మా)

## యముఁడు విదురుఁడై జనించుట

అని చెప్పి మునిపోవ, నంత న...
తనకర్మమహిమ నర్ధాదికాంశమున
విదురుఁడై పుట్టిన, ...
ప్రీదులక నానాఁటఁ[1] ...
ధర శూద్రయోని నట్లుఁ బుట్టుటకు
నరనాథ, విను కారణంబు చెప్పెదను.
ఒక్క భూపాలుని యూరి చేరువను
మక్కువ నడవిలో మాండవ్యమౌని
తపమున్న చోటున, ధరణీశు నగరి
విపులార్థములు చోరవీరులు దిగిచి,
యరుగుచు రాత్రి యయ్యాశ్రమభూమి
తెరువున నరుగుచోఁ, ద్రుతి నంతలోనఁ
దలవరు లాచొప్పు తడవి వెంటెంచి
తులువలఁ గానక ధూర్తులై గదిసి:
'మునినాథ, కానవే ముచ్చుల!' ననినఁ,
బనివడి యామౌని పలుక కుండినను:
'ఇతఁడును, దొంగలు నేకమై నేఁడు
పతిసొమ్ము దెచ్చిరి; పలుకఁడే!' లనుచు
జడలు కంపలఁ బట్టి, జపమాలఁ ద్రెంచి,
మెడ నల్లు గట్టించి, మిన్నక తిగిచి,
యంతరం బెఱుఁగని యాతతాయులకుఁ
జింతింపఁ బాపంబు సిద్ధించు[2] ననక
సందెఁ ద్రాడొనరించి, జనపతి[3] కడకు
నందఱుఁ గొని తెచ్చి యతనిసమ్మతిని
శూలాగ్రమున వైవ, స్రుక్కక మౌని
వాలిన తనతపోవైభవం బొప్పఁ

1. తెంపుసాతంతు. 2. గాన. 3. తోడ. (మూ)

జాకున్న, నాతనిసామర్థ్యమెఱిఁగి
భూకాంతుఁ డామౌని భూమికి డించి,
భూరి ప్రదక్షిణంబులుచేసి మ్రొక్కి
'నేరమి సైర్వవే నీవాఁక' యనుచు
నుతియించి, యాకొఱ్ఱునొకిండఁ ద్రుంచి
యతనియుల్కకుఁదప్పి యునిచిన, నరిగి
కుత్తుక నొకకొంత కొయ్యంగరాక
కత్తెఁడుకొఱ్ఱు నిల్చిన యాకొనలస
యాణిమాండవ్యుఁడై యతఁడ నామౌని
మానక తపముండి, మఱియొక్కనాఁడు
యమపురంబునకేఁగి యామునకిట్లనియె:
"శమన, కొఱ్ఱెక్కింపఁజనునయ్య నన్ను!
గలయంగ ధర్మాధికారి నీవన్న
నిలిపిన విధిఁగాక నిన్నాడఁగలదె!
ఏతప్పు నామీఁద నెన్నితి?" యనిన,
నాతఁడిట్లను: "నన్ను ననఁజనిలేదు ;
ఎప్పుడుఁ బ్రాణుల నేఁ 'జొప్పఁగొని
చొప్పఁగట్టినయట్టిచొప్పు' దీపింపఁ
గట్టుదు నిజనిజకర్మపాశముల ;
నిట్టుదూఱఁగఁ దగునే వట్టిదూఱు!
నీవు తూనీఁగల నీపిన్ననాఁడు
వావిరిఁ గొఱ్ఱులవైచితి గాన,
నాకర్మఫలమునే యనుభవించితివి ;
మాకేమివా!" దన్న మాండవ్యుఁడలిగి:
'యిలఁబుట్టి పదునాలుగేఁడులదాఁక
తలఁపంగనేరఁడు ధర్మంబునరుఁడు ;
ఆలోనికర్మంబు లతనిఁ బ్రాపింపఁ
జాలవు ; చేసితి సమయమీనిపుడు.

అంతయొఱుంగక యనుచితదండ
మంతక, నాయెడ నాచరించితివి ;
శూద్రుఁడవై పుట్టు క్షోణిలో.' ననుచు
నుద్వృత్తకోపుఁడై యొనర శపించె.
అదికారణంబుగా నంతకుండిట్లు
విదురుఁడై జన్మించె విను." మని మఱియు
జనమేజయునకు వైశంపాయనుండు
వినిపించెనని ప్రీతి వెండియుఁ జెప్పె.
మానసదుర్యోధన, మదస 1 సమాన,
మానవతీమాన్య, మదనాభిరామ,
రామణీయకధామ, రామాభిరామ,
రామాయణానంద, గణ్యప్రసార, (?)
సారస్వతామోద, సత్యవిహార,
హార నూపుర కంక ణాంగద యోగ,
యోగనిర్మలభాగ, 2 యుచితసంభోగ,
భాగవతాధార, భాగ్యప్రపూర్తి.
ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితాదిపర్వ నిర్మలకథయందు
నుచితమై యాశ్వాస మొప్పె మూఁడవది.



1. సరాము. 2. ఉచితాసుభాగ. (మూ)

# చతుర్థాశ్వాసము



శ్రీసమాశ్రితనేత్ర, శృంగారగాత్ర,
ధీసార, సరసయాధిపుచోడ, ధీర,
అసమాన దానవిద్యా వినోదముల
దెసలవర్తిల్లు మంత్రీ! చిత్తగింపు;
అక్కథకుండు శౌనకాది సన్మునుల
కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె.
ఆరీతి నామధేయములు గావించి,
ధీరుఁ డానుతులకు దేవవ్రతుండు
వరుసతోఁ జౌలంబు వడుగులుఁజేసి,
గురుకళానిధులైన కుశలులచేత
నంగపూర్వకముగా నఖిలవేదములు,
సంగీత సాహిత్య చాతురితోడ
నస్త్రవిద్యలు, [1] వాహనారోహణములు,
శాస్త్రపురాణవాసన లాదిగాఁగ
నెఱిఁగింపఁజేసి, మహీరాజ్యమునకుఁ
దెఱఁగొప్ప నృపునిఁగా ధృతరాష్ట్రు నిలిపి,
హితవృత్తిఁ గార్యంబులెఱిఁగించి, కొలువ
నతనికి విదురు సహాయుఁగా నిచ్చి,
యిమ్ముదెప్పరమైన నిందువంశమునఁ
గ్రమ్మఱ నొకరాజుఁ గల్పించెఁ [2] దాను
అగ్నియారినవేళ నరణిమథించి
యగ్నిహోత్రముసేయు యజమానురీతి.

---

1. వారణా. 2. గాన. (మా)

ధర్మంబులన్నియుఁ దనకుఁ దోడుగను
ధర్మాత్ముఁ డితఁడనఁ దగి చరించుచును,
బరభూమిపతుల కప్పంబులఁ గొనుచుఁ
దిరముగాఁ గృతయుగస్థిర [1] భూతి దనర,
సరసత ధృతరాష్ట్రశాసనంబునకుఁ
దిరముగా జనుల వర్తింపఁ జేయుచును,
అనఘు నా ధృతరాష్ట్రు యౌవనారూఢుఁ
దనరఁ బెండిలి సేయుఁ దలఁపోయుచుండఁ,

ధృతరాష్ట్రుఁడు గాంధారి నుద్వాహమగుట

ప్రబలుండు గాంధారపతియైనయట్టి
సుబలునికూఁతురు సురుచిరాకార-
కమనీయ రూపరేఖా విలాసముల
నమరకాంతల కెనయైనది యనియు,
గురుమతి నూర్వురు కొడుకులఁబడయ
వరము వ్యాసునిచేత వడిఁ గాంచెననియు,
సొరిది నిత్తెఱఁగు భూసురులచే నెఱిఁగి
యురుదార మోదించి యప్పుడుప్పొంగి,
యాశాంతనయుఁడైన యాశాంతనవుఁడు
శైశవాంతరమున జనపతిఁ జూపి
విదురునకిట్లను : "విదుర, యీరాజు
సదమల తేజుండు, సత్యసంధుండు,
వెలయ మదించిన వేయిదంతులకుఁ
గలలావు గలవాఁడు, గాంభీర్యజలధి,
పెండ్లిచేసెదఁగాక పెక్కండ్రుసుతుల
నిండ్లునిండఁగఁ గాంచునితఁడు మోదమునఁ ;

1. భూమి. (మూ)

గావున, నితనికిఁ గాంధారు పుత్త్రి
దేవి గాఁదగు నెల్ల తెఱఁగుల ; మఱియుఁ
దనయులు నూర్వు రత్తింటికిఁ బోతు
రనివింటి వ్యాసవరాభాషణమునఁ ;
దొయ్యలు లయ్యింతికిఁ దోఁబుట్టువులు
నెయ్యంబుగలవారు నధిసంఖ్యగలరు.
పుత్త్రమా ! యింటికి భూసురోత్తముల
విత్తంబులిచ్చి యావెంఁదుల నడుగ."
ననుటయు విదురుండు 'సత్యార్య' మనినఁ,
బనివడి యొంకెయు బ్రాహ్మణోత్తములఁ
గన్యకావరణంబు గావింపఁ బనుప,
సైన్యసహాయులై చనుదెంచి వారు
గాంధారు సుబలునిఁ గాంచి, కౌరవుల
బంధుత్వ మతని కేర్పడ మాటలాడి :
'సుతను గాంధారిని సుశీను సుచరిత
ధృతరాష్ట్రు[1]కడిగి మా దేవవ్రతుండు
పుత్త్రెంచె ; సోదరీపూర్వంబుగాఁగ
నిత్తుగా.' ననుటయు నిట్లనునతఁడు :
" కురువంశవిస్తారకుండగు ధృతరాష్ట్రుఁ
డరయ నీకన్యకు నర్హుండు ; గాన,
సచ్చరిత్రునకు నాజనవరేణ్యునకు
విచ్చలవిడిలోడ విశ్వంబుమెచ్చ
నిచ్చితి ;" నని తండ్రి యియ్యకొన్నంత,
మెచ్చక యచ్చోటి మేదినీజనులు
నతనిబంధువులును నట తమలోన
హితవేది గుజగుజ నిట్లనిరవుడు :

1. కడిగెను. (పా.)

“ అంగంబులందెల్ల నతిశయ ముత్త
మాంగ; మందును గన్ను లరయంగ మేలు;
జనులకు నిట్టిలోచనములు లేమిఁ
జెను [1] చిక్కులగు నిచ్చ; ప్రియతనూభవయు
గాంధారి సర్వలక్షణలక్షితాంగి
యంధున కక్కటా! యాలు కాఁదగునె!
ఈనాతి నంధున కీకున్న నేమి!
మానుగా మగపోఁడిమానంద మిడునో!
భువిలోన మగవాఁడు పుట్టఁడో కాక!
యువనీతలేశున కల్లుండు గాఁగ.
పడఁతిసౌందర్యంబు పతికట్టిదురను
అడవిఁగాచినవెన్నెలై పోవఁగలది!
ఈవల శకునియు నిట ‘తండ్రిమాట
గావలె’ ననుఁ; గాని, కాదనవెఱచు.”
ననుటయు, గాంధారి యచ్చోటనుండి
మనుజులమాటకు మదినొచ్చి పలికె:
“ క్షితిపతి [2] నన్ను నిచ్చితినన్నమాట
ధృతరాష్ట్రునకు నేను దేవినైనట్లు;
పతి యతఁడే కాక, పరికింప [3] నాక-
పతియైన, మఱి రతిపతియైన నొల్ల.
సింధురశతములఁ జెనకు బలాఢ్యుఁ
డంధుఁడై రాజ్యమదాంధుఁడు గాఁడు.
చతురుఁడు, జ్ఞానలోచనసహస్రాఢ్యుఁ,
డతని నూరక యంధుఁడన నెట్లువచ్చు!
ధృతరాష్ట్రునకులేనిదృష్టి నాకేల!
హితమతిఁ జూడుఁడీ యిందఱు!” ననుచు

1. చిక్కువను. 2. నన్నునుయిచ్చితినన్న. 3. నాకు. (మూ)

బంగారుపట్టంబు పడఁతి దెప్పించి,
పొంగారువేడ్కఁ గప్పురము మెత్తించి,
సోగలై మెఱుఁగెక్కు సొబగుకన్నులను
బాగులై లేనవ్వు పర్వమై నిక్క
చెంగావికోలుకుల సిగ్గుకందువలఁ
దొంగలిఱెప్పల దొరయునేత్రముల
మూయించెఁ ; బతినింద మును జేసియున్న
దాయలనోళ్లెల్లఁ దా మూసె ననఁగ.
అప్పుడాగాంధారి నర్థిఁ బూజించి,
తప్పక పసిఁడియందలమెక్కఁబనిచి,
తోయజాక్షుల దాసితోఁడఁబుట్టువుల
నీయెడఁ దొమ్మండ్ర నిచ్చితిననుచు
జనపతి రప్పించి, శకునిఁ దోడంపి,
యనిచెఁ గాంచనకోట్లు నందఱ కొసగి ;
యనిచినఁ గొనితెచ్చి, యాపగేయునకు
జనపతికూఁతుల శకునిచూపుటయు,
నొక్కలగ్నంబున నువిదలఁ బెండ్లి
యక్కొడుకునకును నతిభక్తిఁ జేసి,
గాంధారపతులకుఁ గట్నంబు [1]లీయ,
బంధుసామగ్రి యేర్పడ సంతసిల్లె.
ఘనుని నిశ్చలుని సంగ్రామభైరవుని
నినవిభ తేజుని నింద్రవైభవుని,
శరనిధిగంభీరు సన్నుతాకారు
భరతవంశేశునిఁ బాండునిఁ జూచి :
' యితనిచేఁ గురువంశ మెల్ల వర్ధిల్లు ;
నితనిపెండిలి సేయ నెలమిమై వలయు '.

1. లిచ్చి. (మా)

ననియుని విదురాదిమాప్తుల గోష్ఠ (?)
ఘనుఁడు భీష్ముఁడు ప్రసంగము సేయుచుండె.

## పాండురాజు కుంతిని వివాహమాడుట

అంతట, యదువంశ్యుఁ డగు శూరు సుతకుఁ
గాంతాలలామకుఁ గమలనేత్రకును
గుంతిభోజుండు తన్నుఁ గూఁతుఁగాఁ బెనిచి
సంతసింపఁగ నొప్పు సౌభాగ్యవతికిఁ,
జెలఁగి దూర్వాసుఁ డిచ్చిన మంత్రశక్తి
నెలమి మానవులకు నెఱుఁగ రాకుండఁ
జండాంశువలన సచ్చపువజ్రకవచ-
కుండలాలంకృతుఁ గుణగణశోధనుని
ఘనుఁ గర్ణుఁ గని తనకన్యాత్వహాని
జనియింపకుండఁగఁ [1] జరియించుసతికిఁ,
పృథయనఁ గుంతినాఁ బెంపువహించి
ప్రథితనామంబులఁ బరగుకోమలికి
సలరు స్వయంవరమను వార్త పుడమి
వెలయంగ వ్రాయుట వేగుచే నెఱిఁగి,
యంతట నొక్కనాఁ డాపగేయుండు
కుంతిభోజునికూఁతుఁ గుంతియన్ దాని,
మద్రరాజతనూజ మాద్రియన్ దాని,
భద్రాత్ముఁడైన యాపాండురాజునకు
వీరస్వయంవరవిధిఁ దెచ్చి యిచ్చెఁ.
గోరి నూర్వురఁ బెండ్లికూఁతుల మఱియు
నక్కడక్కడఁ దెచ్చి యాంబికేయునకుఁ
దక్కక వంశవర్ధనకాంక్ష నిచ్చి,

1. జనియించు. (మా)

పాండుని యువరాజ్యపట్టంబు గట్టె.

.............................

## పాండురాజుదిగ్విజయము

చంద్రప్రకాశుఁడై జగతిపై సతఁము
సాంద్రవైభవముల జనులెల్లఁ బొగడ
సుఖలీలఁ దనరుచు, శూరాగ్రగణ్యుఁ
[1]డఖలదిగ్విజయార్థ మనుగంగఁ దలఁచి,
పటుమతిఁ జతురంగబలములు గొలువఁ,
గుటిలారి నరపాల కులశైల వజ్ర-
[2]తులితుఁడై తొలితొల్లి తూర్పున కేఁగి,
బల [3]సమగ్రుల నరపతుల సాధించి,
యట దక్షిణమునకునరిగి, మార్కొనిన-
పటుభుజాబలుల భూపతుల నోడించెఁ ;
బడమటికరిగియు బహుధరాధిపులఁ
గడిమిమై ననమసంగరమున గెలిచె ;
నుత్తరంబునఁగల్గు నుర్వీశవరుల
నొత్తి యుద్ధంబున నుదుటెల్ల నణఁచి,
[4]యుల్లాసముననుండి యుర్వినద్దెసల
నల్లనల్లననొత్తి యరులసాధించి,
యక్కజంబుగ బల్మి నట వారిచేతఁ
జెక్కుగజంబులఁ, జెక్కుగుఱ్ఱముల,
రమణీయగతి నవరత్నరాసులను,
బ్రమదాజనంబుల, బహువస్తువితతిఁ
గప్పంబుగాఁదెచ్చె ; గన కాంబ [5]రంబు
లుప్పతిల్లినమాడ్కి [6]నూరివారెల్లఁ

1. డిల. 2. తూలితుఁడై. 3. సమగ్రతుల. 4. యుల్లంబురానుండి యూర్వి రూద్దసల. 5. కాదు. 6. నూరగాల్లెవు. (తా)

గ్రిక్కిఱిసియుఁగ, నాంబికేయుండు ధనము
తక్కక వేడ్కతోఁ దనచేతికొలఁది
నాలయంబులకు, దేవాలయంబులకు,
బాలాది [1]వృద్ధాంత పౌరమండలికి,
బంధువర్గములకు, బ్రాహ్మణోత్తముల,
కంధాదిదీనుల, కతిథికోట్లకును,
బేదసాదలకుఁ, బెంపారబంధులకు,
నాదట సఖులకు, నాశ్రితావళికి,
బంధురాత్మకులకుఁ, బరహిత సత్య-
[2]సంధ సత్పురుష సజ్జనవరేణ్యులకు
బాగొప్పవెచ్చించి, పదియశ్వమేధ-
యాగంబులనుజేసి యుదితెగకున్నఁ,
దమ్మునిశక్తికిఁ దలపులో మెచ్చి
యిమ్ముల ననురాగమెసగంగ నుండె.
పురుకుత్స సగర పురూరవులాది
కురుమహీశులఁబోలి కొమరుదీపించి,
యాపాండుఁ డంత నేకాతపత్రముగ
నేపారఁగా ధాత్రి నేలుచునుండె.

## పాండురాజు శాపోపహతుఁడగుట

అంతఁ, జంద్రునిలోనివారిణంబునైన
వింతగా నలయించి వెసఁ బట్టనేర్చు,
నింగినైనను జొప్పు నెమకంగనేర్చు,
సింగమైనను ద్రెయఁ జిక్కనేర్చు,
లలిఁ గాలినైనఁ గాల్నడఁగూడునేర్చు,
శిలనైన నొకసందు చేకొననేర్చు,

1. వృద్ధాంగ. 2. సంధుల సత్పురుష జనవరేణ్యులకు. (మూ)

నిలువున వ్రాఁకులై నిలువంగనేర్పఁ
గలుగుకిరాతు లొక్కొట నొక్కనాఁడు
కోఁకతాలికతలల్, కోర [1] చిందములు,
వాఁకైనయురితిఁగ, వట్టుబొంగులును,
నెఱియఁ జొత్తిల్లిననిడుదకన్నులును,
గఱకులై మిడిసిన కావిమీసములు,
నములియిూకెలు, నిల్వనాటినతలలుఁ,
జుమచుమనైన నెత్తురుచుక్కబొట్లుఁ,
[2] గంపులుపుట్టెడు కఱకందుమేను,
లంపచిప్పతోఁడనలరు హస్తములు,
బీరనరంబులు, బిగువుపిక్కలును,
దోరవన్నియచెప్పుదోయినిఁగలిగి,
వసుధకుడిగ్గిన వానకాళ్లనఁగఁ
గసరున నెసగుసాగర [3] వీచులనఁగఁ
బోరిపోరి నేతెంచు భూతంబులనఁగ
నరులచూడ్కికి వింతసనుప చేయుచును,
నినుపు వున్నమనాఁటి నెలలునుబోలె
ఘన పుండరీక భీకరకరులగుచుఁ,
జౌలసంస్కారవిశాలురు పోలె
నాలోల కాకపక్షాంకితులగుచుఁ,
బొనర మేడలమిూఁది పురజనుల్ పోలె
ఘన జాలమార్గ వీక్షణపరులగుచుఁ,
గనుఁగొన సుగ్రీవరాక్షసులును బోలె
ఘన రామలక్ష్మణాగ్రహ యుక్తులగుచుఁ,
ద్రుమలనిమ్నగములఁ బ్రవ్వసేయించు
తమకాన నందఱుఁ దమకానసుండి

1. చెందమూలు. 2. క్రంపులుబట్టిన. 3. వీధులనఁగ. (మా)

యరుదెంచి, పాండుసుతతతి భక్తి మ్రొక్కి,
కిరముచక్కసితూపు కానుకయిచ్చి,
[1] నాదారు లెఱుకుల కాధారమైన
యాధరణీపతి కప్పు డిట్లనియె :
“ ఏమున్నయడవిలో నిభపురాధీశ,
భూమికి వ్రేఁగైన భూరిజంతువులు
మాయలవులరాక మాయలఁబెట్టి,
నాయుగ్రవిధముల కాత్మలో వెఱచి
వచ్చినారము ; నీవు వానివధింప
విచ్చేయుటకు వేఁటపిన్నాణమునకు.
అందలిమృగముల యదటుగర్వములు
పొందుగా నవధరింపుము ; ధాత్రిఁగొంత
త్రవ్వి, పాతాళవరాహంబుఁబెచ్చి,
క్రొవ్వునఁ దమకదుపుఁ గూర్తుమన్నట్టు
లట్టులావెసగ మహావరాహములు
మిట్టువల్లముగాఁగ మేదినిగ్రుచ్చి,
యెత్తిన బిగువున సించుకతడవు
నెత్తిభారముమాన్పు నిజముశేషునకు ;
బులిరక్కసునిఁజంపి పులితోలుగట్టి
పులినోరికండ మొప్పాడువ్రేలనిటికి
హరుఁడున్నవాఁడని యాతనిమీఁది
[2] గుటికమార్గములందుఁ గూడెనోయనఁగ
బబ్బరింపుచు గుంపుబలసి గుబ్బలుగ
బెబ్బులు లుబ్బులుబెరయ వర్తించుఁ ;
జెలఁగుచు గుహలలోఁ జీకటి [3] వెడలి,
తల కేలు కాలు చైతన్యంబువచ్చి,

1. యాధార మెఱుకకు సాధారమైన. 2. గురు. 3. కార్క. (మూ)

యరిరాజచంద్రుని యచలాగ్రమెక్కి,
గుఱుతుగాఁ గుధరంబు గోరాడ నసఁగ
వెల్లమోరలతోడ వెదుళులుప్రాఁకి,
భల్లూకములమూఁక భయముపుట్టించుఁ;
గొండలుగోరాడి, కొమ్ముల నొడల
గండెక్క మెట్టురేఁగడిమున్న మెఱయు,
మొసళులమడుగులమునిఁగి, యాఁబోతు
లెసగి యల్లనమోములెత్తియల్లార్చి,
ముక్కులుబిగియించి ముసురూర్పువుచ్చుఁ;
జక్కులగతి మిన్నుసోఁకుదుప్పులును,
లాసికటారికోలలుపట్టియాడు
మాసటీలునుబోలె మసలకడాసి,
కొమ్ములరవళి దిక్కులఁ గప్పుదుప్పు
లిమ్ములఁ బోరాడు నిలపెల్లగిల్ల;
భువినుండి రొకయిట్టి వుటముగానెగసి,
ప్రవిమలచంద్రులోఁ బడఁ దాఁటెఁదొల్లి;
యంతవారము నేమునగుదుమన్నట్లు
వింతగా నిఱ్ఱులు వినువీధిదాటుఁ;
జెరిగినపెక్కువఁ జెక్కుటెకములు
నురవడి మెఱయును నొక్కొక్కచోట;
నన్నితూపులఁగాని యణఁగమన్నట్లు
మున్నాడి యేదులు ములుచూపు మాఱు;
మూరిబోఁ జెరుగు చమూరుమృగంబు
లూరిపోఁకటి [1] నొంటిఁబోనీవు;
కడఁతులలెక్క యెక్కడఁబట్టు [2] వచ్చుఁ!
గడలేవు హరి ఖడ్గ కరి శరభములు;

1. నొండు. 2. పెట్టు. (మూ)

సబలత వానిమాంసము చూచి చేగ
శిబిమాంసమడుగుట సిగ్గుగాఁ[1] దలఁచు ;
నెఱియ నొక్కొక్కటి నెఱిచూపియున్న,
[2] నెఱి జగత్త్రయమును నీరసంబగును ;
ఓలి నొక్కొక్కటి యుగ్రత నెసఁగఁ,
గాలానలంబైనఁ గఱిబొగ్గునగును ;
నెమ్మి నిన్నియుఁ గూడి నీటికి డిగిన,
నమ్మడుగునఁ జిక్కి నడుసున మీలు ;
సవి రాజులను బోలె నాత్మవైరమున
భువి భీతులను బోలెఁ బూని మేయుచును,
ధరఁ బత్తులను బోలెఁ దగ[3] నెగురుచును,
బారిపారి మ్రుచ్చులు పోలెఁ ద్రవ్వుచును,
చెడని కాపులువోలెఁ జేనుపట్టగని,
కడుఁ[4] గోలంకులువోలెఁ గనుమలు ద్రొక్కి,
[5] కూరిననెలవోలెఁ గొమ్ములు [6] పొదలి,
[7] కారుమొగిళులు పోలెఁ గంకుచు వచ్చి,
పెద్దకందయుఁ బోలెఁ బిల్లలఁ బొదివి,
తద్ద ధూర్తులువోలె ధరకు వ్రేఁగగుచుఁ,
బుట్టజున్నులు పోలెఁ బుటపుటనగుచు,
నిట్టప్రౌఢలుపోలె నెందు వెల్వడక,
గడి భూమి ప్రజవోలెఁ గడు బెదరుచును,
సుడి భిక్షుకులువోలె శునకవైరమున,
నరఁటిమ్రాఁకులు పోలె నటపొరలెక్కి,
పొరిఁ గర్ణధారులు పోలె గాడ్పు[8] ఱెఁగి,
భువి విరహులు పోలెఁ బొదరిండ్లు దూరి
వివిధరూపులనుండు ; వేయేల చెప్ప !

---

1. దనుచు. 2. నెరినెత్రయాగంబు నిరసంబులను. 3. నొరయు. 4. దొలంకులు. 5. కూడిన. 6. బదవి. 7. కోరమొగిలువోలె గొంకులుబట్టి. 8. రెసి. (భూ)

నాశచేసెదమన్న నపఁగవుమాకు ;
పూశరమ్ములవాఁడి మాసె ర". మ్మనినఁ,
పాండుభూపతి వేఁటపై నాసపుట్టి
పొండువచ్చెద ననిబోయలఁబనిచి,
యన్నకునెఱిఁగించి యనుమతివడసి,
సన్నుతిఁ దనమంత్రిసంఘంబుతోడ
గొల్లెనకంబాలు గొడుగులుఁ బడగ
లల్లికవలమోపు లమ్ముఁబండ్లు
మెత్తనిశయ్యలు మెఱుఁగుకొప్పెరలు
ముత్తియంబుల పవడముల పల్లకులును
బసిఁడిమంచములును బట్టుమేల్కట్లుఁ,
బొనఁగ సరాతులు బోనకావళ్లుఁ
బరిచారకులుఁ బాఁడిపసులు బియ్యములుఁ
బరిమళవస్తుసంపదలు నేతేరఁ,
జపలాక్షు లిర్వురు సంప్రీతిఁగొల్వ,
విపులయాత్రాభేరి వేయించి కదలి,
కరి రథ సుభ టాశ్వ ఘన[1] పాదధూళి
యరుణున కరుణత్వ మచ్చుగాఁబొదువ,
దారుణ హిమశైల దక్షిణాటవుల
వీరప్రతాపుఁడై వేఁటలాడుచును,
వాహనంబులు వెంటవచ్చుచో గాని
సాహసంబునఁ బాదచారంబుగలిగి,
నదులైననీఁదుచు, నగములమీఁదఁ
బొదలైననెక్కుచుఁ, బులి పంది వెనుక
చఱినైన నుఱుకుచు, సొగనిపూఁట
[2] నెఱవైన నమలుచు నీరీతిఁ [3] దిరిగి,

1. రథ. 2. నెఱవనై. 3. దిగిచి. (మూ)

తెరవేట వలవేట ధృతిఁజొంపువేఁట
మఱి [1] మఱివిడివేట మచ్చువేటయును,
గంటవేటయు వేడ్కఁగలకోలవేట
వెంటవేటయు నిడువేటయు నాఁటి,
యొఱపులై క్రొవ్వి మిన్నొరయుజంతువుల
నఱికివ్రేసియు, మఱి నాటనేసియును,
జంచియు నొంచియు జీవనాళములు
త్రెంచియుఁ ద్రుంచియు ధృతినొక్కమొదల
నుంకించిమొగసిన యుగ్రమృగముఁ
గొంకులునఱికియు, గొందిలోనిఱికి
గవినుండివెడలక గాఱించుమృగముఁ
దవిలిపట్టించియుఁ, దగుఱనేసియును,
జొంపులోవలదాఁటి సురిగినమృగముఁ
బుంపులుపుచ్చియుఁ, బోవనిచ్చియును,
తెంకిచేరక యొంటిఁదిరిగెడుమృగము
దొంకలుమూసియుఁ, ద్రోవ నేసియును,
వలఁజొచ్చిమించి యావల నేఁగుమృగము
నలి నడ్డగించియు, నడుముఁద్రుంచియును,
బిలమాక్రమించుచోఁ బిల్లలఁబొదివి
బలమున నొండ్రించి పాఱినపంది
మనసువట్టక లంకిమగుడఁజేరినను,
గనికరంబున దానిఁ గాచిపుచ్చియును,
ఈరీతి వేఁటాడి యుభపురికతేఁడు
తోరంపుమృగకోటిఁ దోడ్తోడ వేడ్క
నన్నకునిమ్మని యనిపిపుచ్చుచును,
విన్నాణమగువేట విడువంగలేక

1. [illegible]

యతిమృగయాసక్తి నాదశరథుఁడు
..............................
..............................
..............................
ధరవేట మున్న సప్తవ్యసనములు
[1] నిరవొప్పఁ గీడని యెఱుఁగానలేక
తనపాలివిధి తన్నుఁ దవిలిప్రేరేప
ననఘు, కార్యాకార్యమదియెఱుంగకయు,
నిది చంపఁదగినది, యిదికావఁదగిన,
దిదియది యనుబుద్ధి యినుమంతలేక,
యటపోయి యటపోయి యద్రులుగడచి,
కుటిలమహాటవీ కోట్లును గడచి,
మునులున్న యాశ్రమంబులు పెక్కు గడచి,
యొనరఁ గార్యాంధుఁడై యొకనాఁటివేఁట
లేడియిఱ్ఱియు రెండు లీలఁగ్రీడింప
నోడక యేసిన, నుఱుకమూర్ఛిల్లి
తెలిసి యొయ్యనఁ గన్నుతెఱచి యాయిఱ్ఱి
పలికె మానుషభాషఁ బార్థివోత్తముని :
"ఓపాండుభూవర, యోరాజచంద్ర,
యీపాపమునకొడిగట్టితివి !
పగఱపై నీబాణపస చూపలేక,
మృగములమీఁదనే మెఱసిచూపితివి.
పోలేక రతిసౌఖ్యములనున్న మమ్ము
నేలయేసితివి ! యిట్లేయుంగఁదగునె !
మించి నీకు వధింప మృగములులేవా !
పొంచి మావిధమంత పొడగానవైతి.

1. నిలబొప్పుఁగీడనియొఱల. (మూ)

తెగనేయుమృగమును, దెగనేయరాని
తగవెఱుంగక యేలదాయవైతిపుడు!
అలసి మేయుచునున్న యాఁకొన్నమృగముఁ,
జలకగాఁబోలేక చూల్గొన్నమృగము,
నీరానఁగావచ్చి నిలిచిన మృగము,
నీరీతి రతికేళి నెనసినమృగము,
మూలకుముట్టుగా ముదిసినమృగముఁ,
బోలేక మృగములఁబొదివినమృగము
బోయయునేయఁడు; భూపాల, తగున!
నాయంబుదప్పితి నాకొడాటమున.
తగునయ్య! యేను గిందముఁడను మునిని;
మృగమాత్రమనిచూచి మేనుమఱచితివి;
అతివయు నేనును హరిణరూపముల
రతిసల్పుచున్నవారము వేడ్కపుట్టి.
అదియెఱుంగక యేసితకట! యోరాజ;
మొదలంట మాప్రాణములు నిల్వవీఁకను.
ప్రతిలేని యీపాపఫలమున నీవు
సతిఁగూడినప్పుడె చత్తువుగాక;
మానినియును నీకు [1] మాద్రి సహాయ
మా.'' ననిశపియించి, యాలునుదానుఁ
బరలోకగతుఁడయ్యెఁ; బాండురాజపుడు
తరుణులఁజూచి, చింతయుఁజిన్నవోయి,
శరములుఁ జాపంబు జారంగవిడిచి,
తోరఁగడుకన్నీటితో వెచ్చనూర్చి,
యనలసంస్కారంబు లామృగంబులకు
నొనరించి, సరసిలోనుదకంబులిచ్చి,

1. మాన. (మా)

'యథమత్య[1] మీఁగతినందితి' ననుచు
విధి నాత్మదూఱుచు వేదనతోడఁ
గొండొకదవ్వేఁగి[2] గొంతులఁబలికె :
"పొందు మిమ్మనిపెదఁ బురవరంబునకు ;
నక్తులసేవించి యట నుండుఁడీరు ;
తత్తరించినఁగాదు ; తప్పేఁగార్యంబు ;
మనచేత మునులును మరణంబుఁబొంది
మనకును నొకకీడు మఱి చేయకుండ్రె !
ఇంకనెక్కడిరాజ్య ! మింకేటిసుఖము !
ఇంకనాకీశాపమేమిటఁదిరుగు !
వలనొప్పఁ గౌరవాన్వయపయోరాశి
బలమఱి యీశాపబడబాగ్నినింకె !
.
............................
కడతేఱ నీశాపకాలాహిచేత.
నే నింక భోగంబులిన్నియు విడిచి,
మానావమానముల్ మమతయు విడిచి,
సకలపాపంబులసమితియు విడిచి,
ప్రకటిత నిజకర్మఫల మాసపడక,
యడవిని నిత్యఫలాహారనియతిఁ
గడపెదఁగాలంబు కడముట్టనిపుడు ;
పుడమియేలఁగ నాకు బుద్ధిగా ; దింకఁ
గడుఘోరతపము నేఁ గావింతు నిచటఁ ;
గాన, మీకిప్పుడు కానల నవయఁ
గానేల ! చనుఁడింకఁ గరిపురంబునకుఁ ;
జని, యొల్లవారి కీచందమంతయును
వినిపింపుఁ." డనిన, నవ్వేలఁదులిట్లనిరి :

---

1. మీఁగితినందు నేననుచు. 2. 'గొంతి' పదమును స్త్రీపర్యాయముగా వాడి నాఁడనవలెను ; లేదా 'గొంతితో' అన్నను సరిపడును. (పూ)

"పాయనోపమునిన్ను బాండుభూపాల!
యేయనువున నైన నేము వచ్చెదము.
అకట! శంతనువంశ మణంగిన చోట
నొకభాగ్యమహిమచే నుదయించితీవు.
కులమునిల్పెదవని కోరియుండంగఁ
గలిగెనే నీకిట్టి కారణావస్థ!
ఏమిచేసిననాఁడు నీపాతకంబు!

.....................

రతిలేకయుండవు రాత్రియొన్నఁడును;
రతిచేసి తనియవు రమణ, యొన్నఁడును.
పరఁగ నిప్పటినుండి బ్రహ్మచర్యంబు
చరియింపనోపుదే జగదీశ నీవు!
ఇది పురాతనదోష మేమనఁగలదు!
విదితాత్మ, నీవింక వినుము మామాట;
శైలాటవుల నొంటిఁ జరియింపవలదు
లాలితజటల వల్కలములుఁ దాల్చి;
యడరి వానప్రస్థమును నాశ్రమమున
నడపుము మమ్మును నరనాథ, కూడి.
ప్రాణేశ, నిన్నేము పాయుదుమేని,
ప్రాణంబులును మమ్ముఁ బాయునాక్షణమె.
సతితోడ రామభూజనపతి గూడి
ధృతివట్టి యడవి వర్తింపఁడే మున్ను!
అటుగాక, నిను బాసి హాస్తినాపురికిఁ
బటుభంగి నరుగంగఁ బదము లెట్లాడుఁ!
బొనరంగ మధ్యాహ్నమున నిటగ్రుంకి,
యనలునిఁ ద్రేల్చుచు నతిథిఁ బూజించి,
జలములఁ బితరుల సంత[1]సపెట్టి,
నిలువవె! మాకునునీడయయ్యెదవు."

1. తెట్టుచును. (మా)

అనిపాదయుగళిపై నబలలుపడినఁ,
దనకరంబులనెత్తి ధారుణీశ్వరుఁడు :
" మీరు చెప్పినయట్లు మృగనేత్రలార,
కోరివర్తించెదఁ గొంకనేమిటికి !
పాయక హృదయంబు పదిలమౌనేని,
యేయాశ్రమంబైన నేమియుఁగాదు.
మనవెంట వచ్చినమంత్రులనెల్ల
ననిచెద వస్తువాహనములతోడ.
పోయినవారలు భూనాథుతోడ
నాయున్నయునికి నిశ్చయముఁజేసెదరు ;
పూనెదఁగాక తపోభార." మనుచు
మానినీసహితుఁడై మానవేశ్వరుఁడు
జడలు వల్కలములు శాంతిమైఁదాల్చి,
యడలుచున్న సైన్యము వీడుకొల్పి,
తమభూషణంబులుఁ దమవస్త్రములును
క్రమముతో భూసురగణములకిచ్చి,
తక్కినధనములు తనయన్నకప్పు
దక్షిణంబుగఁ బంపి, యతినిశ్చయముగ
నిందుబింబాస్యల నెలమిఁ దోకొనుచుఁ
గందమూలముల నాఁకలిదీర్చుకొనుచు
మునుకొని యుత్తరముఖముగాఁ గదలి,
మునులెల్ల విస్మయంబుగఁ జూచి పొగడ
నయగుణోజ్జ్వలుఁడంత నాగశైలమును
రయమున నట చైత్రరథమునుగడచి,
తొలఁగక చనిచని తుహినాద్రిదాటి,
యలఘుపుణ్యుఁడు గంగ నట యుత్తరించి,
సురసిద్ధసేవ్యమై సొంపగ్గలించి
ధరనొప్పు గంధమాదనమునకరిగి,
గురుమతితో హంసకూటంబుగ్గడచి,

## పాండురాజు శతశృంగమందుఁ దపమొనర్చుట

యల్లన శతశృంగమను గిరిచేరి,
చల్లని నవపర్ణశాల గావించి,
యందు దేవేంద్రాదులచ్చెరువంద
నందంద తపముసేయఁగ, నొక్కనాఁడు
పిన్నలయ్యును శాంతిపెరిగినమునులు,
నెన్నియుగంబులో నెఱుఁగని మునులుఁ,
గన్నన హరిఁగాని కాననిమునులు,
హరివచ్చి 'వర' మన్న నడుగనిమునులు,
హరిరూపు హరురూపు నందినమునులుఁ,
బెంపార మఱియును బెద్దలౌమునులు,
గుంపులుగుంపులై కోటి సంఖ్యములు
పుణ్యులు, ఘనులు, సభ్యులు, యశోధనులు,
గణ్యులు, విబుధలోకస్తోత్రమతులు,
సత్యసంధులు, మహేశ్వరపదధ్యాన
నిత్యులు, వరతపోనిధులు మోదమునఁ
బోవఁగాఁ, బొడగాంచి భూపాలకుండు
దేవీసహాయుఁడై తెరువునఁగూడి
వారివెంటనెపోవ, వారువీక్షించి
భూరాజుగాఁదలపోసి యిట్లనిరి :
"ఎవ్వరు నీ? వేల యిట్లు మావెంట
దవ్వనితలఁపక తలఁగివచ్చెదవు?
నెలఁతలురాలేరు నిలువుమిచ్చోటఁ;
దెలియ నింతటినుండి దేవమార్గములు;
సురమునీంద్రులమేము; సురలకుఁగాని
నరులకు మావెంట నడచిరారాదు",

అనుటయు, దీనుఁడై యప్పాండురాజు
తనపేరుచెప్పి యందఱకుఁ గేల్మొగిచి :
" యేనును వచ్చెద హితపుణ్యులార,
మానినులలసిరి మముఁగూర్చుకొనుఁడు.
నారు తెన్నుఁడుఁ దొల్లి నడచినవారు
గారు ; త్రోవల [1] చక్కఁ గరగరగాదు.
ఏమితీర్థంబుల కేఁగుచున్నారు ?
హేమాద్రి కేఁగుచో నెఱిఁగింపుఁ ". అన్న
మౌనులు పలికిరి మనుజేశుఁజూచి :
" కానఁబోయెద మేము కమలసంభవునిఁ ;
బోయి, యమావాస్యపుణ్యకాలమున
నాయన సేవింతు రమరులు మునులు.
ఇంద్రాదిలోకంబు లిన్నియుఁ గడచి
చంద్రవంశాధీశ, చనవలె మాకు.
ఎంతవారలకైన నింతటినుండి
సంతతిలేనిచోఁ జనుదేరరాదు.
లోలత నాక బ్రహ్మలోకంబయేల !
యేలోకమును [2] లేద పేతపుత్త్రునకు.
సంతానలాభంబు జననాథతిలక,
చింతింపు ; మది నీకు సిద్ధింపఁగలదు.
వరసుతుల యమ వాయు వాసవాశ్వినుల
వరమునఁగాంచెదు వంశవర్ధనుల ".
అని నిల్చి పోయిన, నాతండుమరలి
చనుదెంచి, ఖిన్నుఁడై సతిఁ గొంతిఁ బలికె :
" మానిని, చూచితే ! మనల నేర్పఱచి
మౌనులుపోయిరి మఱి కూడనీక.

1. సక్క. 2. లేదు పేద. (మూ)

ఉన్నతి సంతానమొకటి తప్పించి
యన్నిభోగంబులు ననుభవించితిమి
కలదొకో పుత్త్రునిఁ గన్నారఁ గానఁ!
గలకంఠి, యట్టుల గలుగుఁ బాండునకు!
పుత్త్రలాభములేనిబొంది నాబొంది,
ధాత్రినుండిననేమి! తప్పిననేమి!
సంతతిగలదని స్వర్గలోకమున
కింతి, పోదముగాక యుండదటియట్లు.
ధృతి 'నపుత్త్రస్య గతిర్నాస్తి' యనెడు
శ్రుతివాక్యమున్నది శూలహస్తుదవుం.
ఎంతతపంబున నేధర్మములను
నింతి, గల్గఁగనేర విహపరోన్నతులు.
అది విచారించి, మీయందు నందనుల
ముదమునఁబడయంగ మొగి నాకు రాదు.
మృగశాపభయ మూర్తి వెఱయుచున్నదియు;
[1]సుగతి నాకిక యెట్లు చొప్పడఁగలదు!
క్షేత్రజన్యాయంబు చింతించి, నీవు
పుత్త్రులఁబడయుము భువి నిందరాదు.
నాయాజ్ఞనేయుము నాతి, పుణ్యంబు
సేయుచోట్లను నేను వింటినాక్రమము.
ప్రబలధర్మములకుఁ బ్రబలమీచంద;
మబల, నీ వింక నాయనుమతంబునను
దలఁపఁగ ధర్మసంతతి గాంచితేని,
పొలుపార నాకబ్బుఁ బుణ్యలోకంబు.
లనువార దేవరన్యాయంబునందు
ఘను శ్వేతకేతునికథయును వినవె!

1. [illegible]

ఏము జనించితి మీ ప్రకారమున ;
భామిని, పిలుతునా ! బ్రాహ్మణు ;" ననినఁ :
"బతివి నీవై యుండ భరతవంశేంద్ర,
యితరుని మనసులో నెట్లు నిల్పుదుము !
పతియేమి చెప్పినఁ బనివడి సేయ-
కతివలకుండుట యధికపాతకము.
తలఁప, నీవలనను తనయులు మాకుఁ
గలుగు నుపాయంబు గావింపు ; మిదియె
తపము సేయుట ; మేలు దపముగఁ దొల్లి
[1]వపితాశ్వ సతికి దైవంబిచ్చె సుతుల.
'పుత్త్రులు దేవాంశమునఁ బుట్టఁగలరు
ధాత్రిని' కన్నారు తపసులు వినవె !
నీవేమి చెప్పిన నీ చెప్పినట్లు
గావింతు ; మింతేల కడఁక [2] నీకిపుడు !
తమకింపవల." దని తరుణియాడుటయు,
రమణుఁడిట్లను : "నోర్వరాదంతతడవు ;
తనువు లెవ్వఁడు నమ్మఁ ! దలఁచినట్లగును !
'దినవానిశుభములుదినుు' నని వినవె !
ఇంతి, సేయుదుగాక యేఁ జెప్పినట్లు ;
కాంత, వేగమె పిలు ఘనునొక్క మునిని ;
మానినిఁ బనిచి కల్మాషపాదుండు
పూని వశిష్ఠుచేఁ బుట్టించె సుతుని ;
మామతేయునిఁ దెచ్చి మగువతోఁ గూర్చి,
యామగధుఁడు తొల్లి యాత్మజుఁ గాంచె ;
సందేహమేటికి సాధ్వి నీ కి" కనిన,
నిందువంశ్యునిఁ జూచి యిందీవరాక్షి :

1. 'వ్యుషితాశ్వసతి' అని వచ్చును. ఆది. ప. ౫. గాథలను. (హా)

అక్షులునాకు వాయుజధనంజయులు; (?)
పక్షీంద్రగమన, నాభావంబు నీవు;
మిముఁబాసి నిముషంబు మేముండలేము;
కమలాక్ష, నీదివ్యకారుణ్యమునను
భీమునకును జంభభేదిసూనునకు
నేమియుఁ దలపోయ నివ్వాడునలదు."

## కృష్ణుఁడు భీమార్జునులతో జరాసంధుఁ జంపింపఁబోవుట

అని వారినిచ్చి నెయ్యమున దీవించి
యనిపిన, వారలు నాత్మనుప్పొంగి
నదులయందును కృతస్నానులై గిరులు
విదితాటవులు దాటి వివిధ దేశములు
గనుఁగొంచు మగధేశుఘనభూమిఁ జొచ్చి,
యనుపమ గోరథంబను గిరియెక్కి,
యాలోకనముచేసి యాగిరివ్రజము,
మేలైన రత్నపుమేడలదాని,
నమరావతీపురి కలకాపురికిని
సమమైనదానిని, సకలసంపదలఁ
జెలువొందుదాని వీక్షించి మిక్కిలిని,
జలజాక్షుఁ డనిలజశక్రసూనులకు
నరుదంద భక్తితో నప్పుడిట్లనియె:
"పరికింప గో [1] రథపర్వతాగ్రంబు,
వైహారి, [2] ఋషిగిరి, వరచైత్యకాద్రి
యూహింప నివినాల్గు నొసరఁజుట్టులను
గాచియుండును త్రిలోకములు నుతింప;
నేచందములఁజూడ నిది గిరివ్రజము;

1. వధ. 2. సిరిగిరివరచైత్ర. (మూ)

గౌతమమునిచేతఁ గడురమ్యమైన
పూతదుర్గంబిది భువినసాధ్యంబు.
తెరల మాగధుని సాధింపంగలేరు
దురములో." నని చెప్పి తుదిఁజైత్యనగము
దండకుఁజేరి మోదమునని ట్లనియెఁ :
"జండభేరులు మూఁడు చాలనొప్పారు ;
మగధాది [1] నాథులు మానుపాదమును
అగణితవృషభంబు నణఁగించి, దాని
చర్మంబు భేరుల సరవిమూయింప,
నర్మిలినీపురి నటు వింతవారు
చొచ్చినప్పుడుమ్రోయుచును మునిశక్తి
నిచ్చలో నెఱిఁగించు నిట మగధునకు."
అనిన వారలుచూచి హస్తదండముల
ననువార భేరీత్రయంబును జించి,
వారలుద్ధతి గిరివ్రజమర్థిఁజొచ్చి,
బోరన నప్పుడు పుష్పలావికల
సదనంబునకుఁబోయి సకలపుష్పములు
ముదముతో నిష్టుల ముడిచి, గంధములు
మేననిండుగఁబూసి, మేటిగంధమున
మానుషంబున రాజమార్గంబుచేరి,
గుహాలుచొచ్చుమృగేంద్రకులముచందమున
మహనీయులై చొచ్చి మఱియు వచ్చుటయు,
నాజరాసంధుండు నర్ఘ్యపాద్యములు
తేజంబుతోఁగొంచు ధృతినదు రేఁగి

---

1. నాథునిమాషదంబనెడి. (మూ) చాలవఱకుఁ గవిత్రయభారతమననుసరించి యీద్విపదభారతము వ్రాయఁబడుటచే, లేఖకప్రమాదాదులవలనిదోసఁగులు సవరించుటలోఁ అదియే ఆధారముగాఁ దీసికొనఁబడెను.

భూదేవముఖులని పూజసేయంగ
నాఁటఁగదిసి, వారంవిరులొల్లకునికిఁ
జూచి యామాగధరాజును వారికనియె :
'మీచందములుచూడ మేదినీగోత్ర!
ధరణిదేవతలైనఁ దర్కింప మీరు
సురభిపుష్పంబులు శోభిల్లఁబైన
గంధంబులును ధూర్తగతిఁ గొనుటేమి?
బంధురభేరు లుద్భటవృత్తి వ్రచ్చి
సాలయుక్తి నాపురిఁ జొచ్చుటయెట్లు!
అలఘుసద్భక్తితో నట సచ్చినట్టి
సాధువర్గమొల్లక మాటి యుండుటెట్లు!
పృథివీశ్వరులుగాని పెంపున మీరు
ధరణీసురులుగారు తర్కించి చూడ
గురుబాహుసత్త్వ లక్ష్ముద్రవిక్రములు."
అనుటయు వారికి నచ్యుతుండనియె :
"జననాథులము మేము సత్తుగా వినుము ;
నీపురిఁజొచ్చుట నీతి మాకందు ;
నేపారుగంధంబు నెల్లపుష్పములుఁ
గైకొనుటది జయకారణంబనుచుఁ
జేకొంటి మిప్పుడు సిద్ధంబుగాను.
కార్యంబు నీయుందుఁ గలుగుటఁజేసి
యార్యమతంబున నర్ఘ్యంబు గొనము."
అనిన జరాసంధుఁ డప్పుడిట్లనియె :
"మును మీకు మాకునిమ్ములఁబగలేదు ;
సురలకు ధారుణీసురులకు మునుల
కరుదారభక్తుండ నాదిభూవిభుఁడ."
ననుటయు నచ్యుతుం డతనికిట్లనియెఁ :
"జెనసి రాజులనెల్లఁ జెఱఁబెట్టి తీవు ;

వారిరక్షింపను వసుధ నీతోడఁ
బోరాడఁగా నేను భుజబలంబునను
వచ్చితి ; మీరొకండు వాయునందనుఁడు ;
సచ్ఛరిత్రుఁడు వీఁడు శక్రనందనుఁడు ;
ఏను శ్రీకృష్ణుఁడ ; నెల్లదుర్జనుల
బూనిశిక్షింపంగఁ బుట్టినవాఁడ.
నిన్నాజిఁ దెగటార్చి నృపతులనెల్ల
నెన్నిక కెక్కంగ నీక్షణంబునను
విడిపింతు మము దేవనికరంబు పొగడఁ
గడిమితో.” ననవుడుఁ గడువడిఁ గినిసి
యాజరాసంధుండు నాగ్రహంబునను
రాజసంబున మృగరాజచందమునఁ
గుటిలసద్భ్రుకుటీ [1] వికుర్వాణఘటిత
నిటలుఁడై పటుకార్య నిర్భరత్వమున
వారితోఁ బలికె దుర్వారవైరమున :
“ ధారుణీశులగెల్చి తలఁబట్టి తెచ్చి
కారాగృహంబులఁ గడిమితోఁ బెట్టి
భైరవపూజలు పరఁగఁ జేయుచును
ఇలలోపలను గ్రొవ్వి యేచియుండుటలు
తలపోయఁగా వీరధర్మంబుగాదె !
నాకుదోషములేదు నరనాథులఁ
జేకొని పట్టితెచ్చినమహీపతుల
దేవహితార్థంబు తెగవ్రేయువాఁడ ;
నీవేళ వారల నేనేలవిడుతు !
భావింప నాప్రతాపము లోకములను
నీవెఱుంగవె ధారుణీధర, యెవ్వరు !

1. నికుర్వాణ. (మా)

ఎన్నిమాఱులుఁ బాఱి వెనుదిరిగితివో !
మున్నుగా ; నీవు సముద్రంబులోన
దుర్గంబుగట్టుక తూఁగఁజరించితివి ;
దోర్గర్వమున నిన్నుఁ దూలఁద్రోలెదను.
మొక్కలంబున నీకు మువ్వురుఁ గూడి
యొక్కటికయ్యాన కెత్తివచ్చినను,
రయమున నీతోడ రణమొనర్చెదను
నియమింపఁ ; గాదేని నిఖిలసైన్యములఁ
గూడుకరమ్మన్నఁ గొసరక నత్తు
నోడక ; యటుగాక, యొక్కండవీవు
రమ్మన్న రణము తీవ్రముగఁ జేసెదను ;
ఇమ్ముల నీతోడ నేయాయుధములఁ
జెనకంగవలసినఁ జెండివైచెదను. ”
అనవుడు శ్రీకృష్ణుఁ డప్పుడిట్లనియె :
“ పలువురొక్కనితోడఁ [1] బ్రధనంబు సేయ
నిలనధర్మము ; గాన నిపుడు మాయందు
నొకనితో రణముసేయుము ప్రతాపమున ;
సకలంకగతియందు సతిధర్మమునను
మల్లయుద్ధంబు సమంబుగావునను
దెల్లముగాఁ జోరు ధీరత్వమునను.
సృష్టివారికిఁ గీడుసేయ నేనంటి ;
దృష్టమిప్పుడు ధరిత్రీపాలతతులఁ
జెఱఁబెట్టితివి ; సదా శివహితార్థముగ
వెఱవక చంపంగ వేగఁబూనితివి ;
ఎవ్వరు హారునకు నిల జీవహింస
యివ్విధంబునఁ జేయ నేయుగంబునను ;
ఇది యధర్మముగాదె యిల నీదుచేత !
తుది మహాశౌర్యవంతుఁడనని క్రొవ్వి

1. బ్రదరము. (మా)

పలికితి దుర్బుద్ధి, పాపబుద్ధి;
మలసి పుణ్యుఁ డనవమానంబు చేయు-
చుండితి నీకంటె మూఢులు లేరె!
మండలంబున; మహామత్తగర్వమునను
గార్తవీర్యుండు భార్గవునిచేఁ దెగియె;
ధూర్తవిద్యలయందుఁ దుది నింక నీవు
చెడక నానచనంబు చేసి రాజులను
విడిచిపుచ్చుము జగద్విఖ్యాతముగను;
విడువకుండెద వేని, వేగ నీతనువు
విడిపింపుదుము బలువిడితోడ." ననుచు

### భీమజరాసంధుల మల్లయుద్ధము

రౌద్రంబుతోడ జరాసంధుఁ డవుడు
భద్రేభవరదుని బహుభాషలాడి
బిరుదు ప్రతాపించి భీమునితోడ
దురము సేయఁదలంచి, దుదిఁ దనపుత్రుఁ
ద్రిభువనస్తుతు సహదేవు నుత్తముని
నభిషిక్తుఁ జేసి, నిజాప్తభూసురుల
దీవనల్ గైకొని, దిక్కులల్లాడ
లావునఁ బొంగి, లీలను గాసెగట్టి,
పాటల [1] చొల్లెంబు బాగుగాఁ దీర్చి
చూపట్టినగ్గల; చూడ భీముఁడును
సర్వ [2] సారగ్రంథు సతతమదాంధు
నుర్వీశనిర్బంధు యుక్తిసంబంధు
గాంభీర్యగుణసింధు గతసత్యసంధు
జంభారిరిపుబంధు జయుజరాసంధుఁ

---

1. కుల్లెంబు. 2. సర్వ. (మా)

మొదలుగా నుద్దండముష్టిఘట్టనలఁ
బదివేలభంగులఁ బ్రధనంబుచేసి,
పడిఁ ద్రయోదశినాఁడు పరసత్త్వములను
బెడిదంబుగాఁ బోరి పెనఁగి, వెండియును
ఆచతుర్దశినాఁటియర్ధరాత్రమున
వైచిత్రి మగధభూవరుఁడలసినను,
ఆవేళ భీమున కచ్యుతుండనియె :
"లావుదొలంగెఁ జాలఁగ మాగధునకు ;
పవమానుబలిమి నీపటుభుజాబలిమి
బవరంబులో వీనిభంజింపు." మనిన
ననిలసుతుండు నయ్యనిలునిఁ దలఁచి
ఘనసత్త్వుఁడై బాహుగర్వంబునందు
నాజరాసంధుని నాజిరంగమున
గాజువాఱఁగఁజేసి, కడుపడఁబట్టి
ముక్కున వాతను మొగిఁ జాలరక్త
మొక్కటియై కాఱ నొగినూఱుమార్లు
విసరి నేలనువైచి, వెస వానితనువు
కొసరక [1] చీల్చి గ్రక్కున రెండుకడలఁ
బాఱవైచుటయు, నపాంవైచిత్రి-
తో రయంబునను దోడ్తోన నారెండు
బద్దలవ్వాను నెడఁబాయకండఱును
'అద్దిరా! వీనినే'ర్పని కొనియాడ
నంటేర్పడకయుండ నంటిన, లేచి
తొంటియట్లనె వాఁడు దురమున నెదిరె.
అదిగని భీముఁడత్యాశ్చర్యమంది
కదిసి కన్నుల నగ్నికణములుదొరఁగ,

1. నిలిచి. (మా)

నాగిరివ్రజపట్టణాధీశుఁ బట్టి
లాగించి త్రోసి తా లఘుగతి వానిఁ
గాలను నేలను గాయంబునొంచి
చీలిచివైచి హెచ్చినసాహసమున
మారుతి వానిఁ బల్మఱు చీల్చిపిసిగి
యేరీతిఁ దెగటార్తు నీనీచు ! ననుచు
జింతింపుచుండ, నాశ్రితవత్సలుండు
కంతునితండ్రి శ్రీకలితగాత్రుండు
వనజోదరుండప్డు వడముడిఁ జూచి
ఘనవృక్షశాఖ చొక్కంబుగాఁ జీల్చి
తాఱుమాఱుగవైనఁ, దనమదిఁ దెలిసి
ధీరుఁడై యమ్మగధేశునిఁ జూచు
పిడికిట భుజసంధి బెడిదంబుగాఁగఁ
బొడిచియు నడిచియుఁ బొరలించి నొంచి,
యొకకాలు నొకకాల నొకకాలుఁ గేలఁ
బ్రకటంబుగా మెట్టి పట్టి యమ్మేను
పటపటమనఁజీల్చి పవమానుపట్టి
తటుకునఁ బడవైచెఁ దాఱుమాఱుగను.
ఆవేళ శ్రీకృష్ణుఁ డతిమోదమందె ;
నావేళ దేవతలార్చిరి మింట ;
భీమునియుద్దండభీమశక్తికిని
భూమికంపించె ; నంబుధులెల్లఁ గలఁగె ;
హిమగిరియొఱిగెనో హేమాచలంబు
కమనీయశక్తి భగ్నంబయ్యెనొక్కొ !
యిదియేమియుత్పాత మిప్పుడటంచు
వదలక పురివారు వడఁకిరి కడఁగి.
మగధేశుమానినీమణులగర్భములు
తెగివిచ్చె ; వానియుద్దీప్తసైన్యములు

పొదివిచ్చె; వానివిస్ఫుటకళేబరము
విదితంబుగా రాజవిపులసద్గృహము
తోరణాం[1]తరమునం దొడరివేయుటయు,
నారూఢి సూర్యోదయంబయ్యె నంత,
గరుడధ్వజుండు సత్కరుణ మాగధుల
నరుదారరక్షించె సభయంబువేడ.
ఆగిరివ్రజమున నటుచెఱనున్న
సాగరవేష్టిత క్ష్మాతలేశ్వరుల
విడిచి, జరాసంధవిభునసూభవుని
సుదురాజనిభుని సత్కృత్తమోత్తముని
నాసహదేవుఁ గృపార్ద్రచిత్తమున
భాసురయుక్తితోఁ బట్టంబుగట్టి
.........................
.........................
“ఆజరాసంధు మహాదివ్యరథము
భ్రాజిత నవరత్నరాజి నొప్పారు;
నాయింద్రుఁడును దాని నర్థిఁబ్రార్థింపఁ
బాయక వసువను పార్థివుకిచ్చె;
నావసువొసగె జయద్రథునకును;
ఆవసుధేశుండు నట జరాసంధ
విభునకునిచ్చెను వేడుకదీనిఁ.
త్రిభువనస్తుతమైన దివ్యరథంబు
మనమెక్కిపోదము మానుషంబునను.”
అని విహగేంద్రుని హరిదలంచినను,
అతఁడేఁగుదెంచిన నారథంబునకు
జతనంబుతోడను సారథిఁజేసి

1. తంబున. (మా)

హరియును భీముండు నమరేంద్రసుతుండు
నరదంబు నెక్కి ధరాధీశకోటి
గొలువంగ వచ్చిరి గురువేగమునను
దలఁపులోఁ బొంగి యింద్రప్రస్థమునకు.
ఆపట్టణపుజను లప్పుడిట్లనిరి :
“ భూపాలవినుతుండు భుజబలాన్వితుండు
భీముండు సంగ్రామభీముండు గనిరె
యామాగధేశ్వరుఁ జంపెఁ గావునను
జతురబ్ధివేష్టిత జగతీతలంబు
చతురంబుగా నేలు శమనునందనుఁడు.
సమధికబలు జరాసంధునిఁ జంప
నమర భీముండె కాక యన్యు లోపుదురె ! ”
అని రాజనివహంబు నప్పౌరజనులుఁ
జనుదెంచి చూచిరి జలజలోచనుని
భీము నర్జునుని గంభీరంబుతోడ.
ఆమెయిఁ గృష్ణభీమార్జును లంత
ధర్మరాజునకును దగుభక్తి మ్రొక్కి,
పేర్మి జరాసంధుఁ బెనఁచి నుగ్రాజి
నగాఁచినక్రమమెల్ల నంతయుఁ జెప్పి,
గణుతింప నతనిచేఁ గారాగృహముల
నున్న రాజులనెల్ల నొగిఁ దెచ్చి చూప,
సన్నాహమున వారు శమనసూనునకు
దండప్రణామంబు దగఁ జేయుటయును,
దండితో వారినందఱ నాదరించి
నిజదేశములకంపె నెయ్యంబుతోడ.
భుజగేంద్రశయనుఁ డప్పుడు పాండుసుతుల
వీడ్కొని రథమెక్కి వెసఁ బురంబునకు
వేడ్కతో నరిగె వివేకంబునందు.

అంతట ధర్మజుం డనిలజునకనియె:
'నెంతయుఁగడఁక మీరెల్ల సైన్యములు
సేవింపఁ బూర్వదక్షిణపశ్చిమముల
కా [1] యుత్తరంబునకిరిగి రాజులను
గెలిచి కప్పంబులఁ గీర్తితోఁ గొనుచు
బలిమి నేతెం.' డని పనుప నాక్షణమె
నాల్గువారథులపై నడచెడి క్రొత్త
నాల్గువారిధులట్లు నలుగురుఁ గదలి
చనిరి నా." రనవుడు జనమేజయుండు
జననుతుండైన వైశంపాయనునకు:
"నేదేశమునకు వారేఁగిరి? ధనము
లేదెసఁ దెచ్చిరి? యెఱిఁగింపు." మనినఁ
జతురాత్ముఁడైన వైశంపాయనుండు
మతి జనమేజయక్ష్మానాథునకనియె:

విజయునుత్తరదిగ్విజయము

"వర్ణనకెక్కు పావకదత్తమైన
స్వర్ణదివ్యరథంబు జయముతో నెక్కి,
..........................
..........................
మత్తశాత్రవరాజమణుల మర్దించి,
యుత్తరభూమికి నురువడినేఁగి
రణరంగమున నుమారమణునిఁ బ్రమథ-
గణములగెలిచి, భీకరశౌర్యమునను
ధనదునోడించి యర్థముచాలఁగొనుచు,
ననిమిషేశ్వరునిచే హాటకంబంది,

1. వుత్తరంబున. (మూ) వ్యావహారికోచ్చారణననుసరించి కవి యీపదమును వకారాదిగాఁ బ్రయోగించియుండును.

క్రమ్మఱ పూర్వభాగమునకే తెంచి
సమ్మదమ్మున బాహుసత్వుఁడై మెఱసి
వరపుళిందావనీశ్వరు నోర్చి పేర్చి,
దురములోఁ బ్రతివింధ్యుఁ ద్రుళ్లడఁగించి,
సకలమహాద్వీప జగదీశ్వరులను
బ్రకటంబుగా గెల్చి పౌరుషంబునను,
రాజులుగొలువంగ రాజసంబునను
రాజశేఖరకృపా రమణీయుఁడగుచు
శూరతవచ్చెఁ బ్రాగ్జ్యోతిషంబునకు.
నారూఢిఁ దత్పట్టణాధీశుఁడైన
భగదత్తుఁడేతెంచి పార్థునిఁ గడఁ
దెగి రణంబొనరించెఁ దివిటిపోటీగ.
ఎనిమిదిదివసంబు లెదిరి పోరాడి
యనిమిషేంద్రకుమారు నఖిలాస్త్రములను
వడి భగ్నమగుచుఁ గవ్వడికినిట్లనియె :
“నెడపనికడఁకతో నే నింద్రసఖుఁడ ;
నీవింద్రసుతుఁడవు ; నీకును నాకు
వావిరిఁబగలేదు ; వలసినర్థముల
నడుగుమిచ్చెద.” నన్న నతఁడాహవంబు
తడవక [1] కార్యసంధానుఁడై మించి
భగదత్తు సంతతప్రముదితచిత్తు
.........................
బాహుబలోద్వృత్తు బహుదానవృత్తు
నాహవస్థాయిత్తు నతిపుణ్యసత్తుఁ
గని వానికినిభక్తిగలిగి యిట్లనియె :
“ననఘాత్మకుఁడు భరతాన్వయుండైన

1. కార్యవాదియని కవియూహగాఁబోలు !

రాజు ధర్మజుఁడు సంరంభంబుతోడ
రాజసూయమహాధ్వరంబొనర్చెడిని;
అరివెట్టునీ." వన్న నఖిలహేమములు
వరరత్నములు గజవాజియూథములు
నిచ్చినఁ గొని భక్తినిట్లనిపలికె:
"మచ్చిక ధర్మజు మఖమునకీవు
రమ్ము వేగమున వీరశ్రేష్ఠ!" యనుచు
నిమ్ములఁ దమభూమి కేఁగె శౌర్యమున.

## భీముని పూర్వదిగ్విజయము

చతురంగబలములసంఖ్యలుగొలువఁ
బ్రతిపక్షులనుగెల్చి, పవననందనుఁడు
నానార్థములుగొని నడచి ముందటను
బూని కులూతభూభుజు బృహద్బలుని
గెలిచి, యుత్తరభూమికిని జని యందుఁ
దెలివితోడను వామదేవ గోత్రముల
వసునామములుగల వసుధేశ్వరులను
బొసఁగఁగ గెలిచి, యాపూర్వదిక్కునకుఁ
జని భక్తిఁ బాంచాలచక్రేశుచేతఁ
గనకాంబరంబులు గాంచి, విదేహ
రాజుజయించి, ఘోరదశార్ణవిభుని
యాజి [1] సుధన్వుని యతిశౌర్యమునకు
వెస మెచ్చి తనసైన్యవిభునిఁగాఁ జేసి,
యసమానయశుఁడైన యశ్వమేధేశుఁ
డగురోచమానుని ననుజయుక్తముగ
మగఁటిమిగెలిచి, సమ్మదచిత్తమునను

1. సుధర్ముని. (మా) సుధన్వుఁడని నన్నయ. అధిసేనాపతిం చక్రే సుధర్మాణం మహాబలం. అని వ్యాస. భా.

చేదిభూమికివచ్చి శిశుపాలుచేతఁ
బ్రోదిమీఱంగను బూజితుండగు ఘను
నతనిచే శమనసుతాధ్వరంబునకు
నతులితంబైనట్టి యర్ఘ్యంబు గాంచి,
చేదిదేశము వెళ్లి చిత్రునిఁగాంచి
[1] మేదినీశు సుపార్శ్వ మేటిసత్వమున
ననిగెల్చి, గజపతి నామత్స్యనృపతి
ఘనవరాళవులను మాగధమహీశ్వరుని
దండించి, మగధభూధవతనూభవుని
నండజపతిజవు నాసహదేవు
మన్నించి వానిచే మఱి పూజవడసి,
యొన్నంగ హిమగిరికేఁగి తేజమున
నాగిరీంద్రునిచేత ననుమతిఁబడసి,
వేగంబె నిర్జరవిభుపర్వతమున
బహుకిరాతావళీపతుల నేడ్వ్యగను
సహజశౌర్యుల [2] మదంచజ్జయాధికుల
ధర్మయుక్తులను సుధర్మధార్మికుల
నర్మిలిఁ జంద్రసేనాధీశ్వరులను
మారహారహితుల సముద్రసేనులను
నాశవిక్రములఁ గర్ణవత్సపతులను
వైరి [3] భంజన పౌండ్రవాసుదేవులను
గౌరవంబున [4] వశంకరులుగాఁజేసి
ధరణీశ్వరులగెల్చి ధనము రత్నములు
గురుతరంబగుశతకోటి సంఖ్యములు

---

1. మేదినీశుని పార్శ్వమేటిసత్వమున. 2. మదంజభవకౌశుకులను. 3. జంభన.
4. వశీకరులు. (మూ)

## సహదేవుని దక్షిణదిగ్విజయము

గొని యేఁగె భీముఁ డత్యుగ్రశౌర్యమున ;
ననఘుఁ డుత్తముఁడు [1]సహదేవుఁ డంత
ధీరత దక్షిణదిక్కునకరిగి
శూరసుమిత్రుని శూరసేనులను
దంతవక్త్రుని సాళ్వధరణీశ్వరులను
సంతత ప్రతిపక్షజగదీశవరుల
శృంగారయుతుల గోశృంగగిరీంద్ర
సంగుల నృపుల నిస్సంగులఁ జేసి,
కుంతిభోజునిచేతఁ గోరి యర్థములు
సంతసమునఁ గాంచి, జయము రెట్టించి
జలజాక్షుపగవాని జంభకునోడిచి,
తలకొని వానినందనునిచే సమద
గజ హయరత్నసంఘంబులఁ గొనుచు
విజయుఁడై నర్మద వేడుకఁ జేరి,
యందు నవంతిదేశాధీశ్వరులను
విందానువిందుల వేడుక గెలిచి
పోయి మాహిష్మతీపురమున విడియ,
నాయెడ వడి నీలుఁ డనుమహారాజు
దీకొనియెను సహదేవునితోడ.
ఘోర మాద్రేయుఁ డడ్డముచొచ్చి పోర,
నతనిపై నీలుండు ననలంబుఁ బఱప
నతివేగమున వహ్ని యాసహదేవు
సకలసేనలమీఁద సరవితోఁ జుట్టెఁ
బ్రకటితగతి." నన్నఁ బారీక్షితుండు

---

1. ఈపదమును దీర్ఘమధ్యముగాఁ బ్రయోగించుట ఇతనికే గాక, ఆదిపర్వకర్తయగు తిమ్మయకును బరిపాటియే.

చతురోక్తిఁ బలికె వైశంపాయనుఁడు :
" ప్రతిభటుండై వచ్చి పావకుం డేల
యీసహదేవుని నపుడు డగ్గఱెను ?
ఈసమయంబున నింతయుఁ దెలుపు. ”
మనిన నమ్మునివరుం డతనికిట్లనియె :
" జననాథకులవార్ధిచంద్రుఁడైనట్టి
నీలువంశంబున నిషధుండు ధాత్రి
యేలంగ, వహ్ని మహీదేవుఁడగుచు
వేదంబుచదువుచు వేడ్కఁ దత్పురము
సాదరంబునఁ జొచ్చి, చక్కనియువతిఁ
బరసతిఁ బట్టుక భావజకేళి
నరసతసలుపంగ, జనపతిహితులు
పట్టుక వచ్చి భూపతిమ్రోలఁ బెట్టి
పెట్టిన [1] శాస్త్రసంప్రీతితో నతని
దండింపఁ బోయిన, దహనుఁడై మిగుల
మండుచునుండిన, మానవేశ్వరుఁడు
వెఱచి పావకునకు వెస మ్రొక్కి పలికె :
" నెఱుఁగక యజ్ఞాన మిపుడు చేసితిని
మన్నించు. ” మనవుడు మఱి పావకుండు
సన్నిధినై మహీశ్వరునకిట్లనియె :
" నడుగు నీకోరినయట్టివరంబు
తడయకిచ్చెద. ” నన్న దహనునకనియె :
" నాపురిమీఁద నేనరపతులైన
నేపారవచ్చిన నెంతయు నీవు
కదియు వారలమీఁద గ్రక్కున. ” ననిన
వదలక యగ్నియు వరమిచ్చి పలికె :

1. శాస్త్రసమ్మతముతో నని యర్థము కాఁబోలు !

"నీపురిఁగల మానినీరత్నములకుఁ
బాపంబుపొందదు పరపతులందు
రతిసల్పినను ; మహీరమణ, నీవిపుడు
హితబుద్ధినుండుము యెంతయు." అనుచుఁ
జెప్పిన నృపుఁడును జేయుచునుండె.
నెప్పుడు పరధరణీశులవీట
విడిసిన నీలుండు విదళింపుచుండుఁ
గడువడితో ; నదికారణంబునను
అనలదేవుండు సహదేవుమీఁదఁ
గనలుచుఁ గదిసినం గరసరోజములు
మొగిచి మాద్రేయుండు మును శుచియగుచు
మిగులంగ దర్భపై మెలకువనుండి
యగ్నిసూక్తంబు లయ్యెడఁబఠింపుచును (?)
అగ్నిదేవుని ఘను నభినుతిచేసె :
1 "నీతదర్థంబులు నిఖిలవేదములు ;
పూతంబులకునెల్లఁ బూతయుక్తుఁడవు ;
ధర్మజాక్రతువు కిత్తఱిని విఘ్నంబు
పేర్మితోఁ జేయకు పెరిమ మన్నింపు":
మనవుడు ప్రీతుఁడై యగ్నిదేవుండు
జననుతుఁడైన యాసహదేవునకును
వరదుఁడై యుండెను ; వడిని నీలుండుఁ
గరిహయరత్నముల్ కనకాంబరములుఁ
దెచ్చి వేడుక సహదేవున కప్పు
డిచ్చి సద్భక్తితో నిట్లనిపలికె :
" అమితప్రభావ, ధైర్యామరగ్రావ,
విమలకంబుగ్రీవ, విజితారిరావ,

1. నిత్యత్వమైయుండు. (మూ)

భూతిసీఁగ్రీన, పోషితజీవ,
నీతిసద్మజసేవ, నిత్యస్వభావ, (?)
నుతమహీదేవ, మానుషబలదేవ,
చతురశిఖాదేవసమ సహదేవ, (?)
శరణులఁగాన ప్రజ్జనులను బ్రోవఁ
బరఁగ విష్ణునిసేవఁ బరఁగితి వీవ;
నీకు నెవ్వరుసరి నృపులులోకముల !
రాకాసుధాకరారవితారకముగ
మన్నంపు; నిలుపుము మము రాజ్యములను
ఉన్నతి." ననవుడు సుప్పొంగి వేడ్క
నాసహదేవుండు నారాజుకనియె :
" భాసుర ప్రౌఢితోఁ బరఁగ రాజ్యంబు
సేయుము; నేఁగల్గఁ జింతనీకేల !
ఏయెడ నీకు నాకెంతయుఁ బొందు."
అని వానివీడ్కొని యట దక్షిణమునఁ
జని మహారాష్ట్రరాజన్యులచేత
సకలార్థములుగొని, సాగరద్వీప
నికటనిషాదులు, [1] నిజకాలముఖులు,
కర్ణసత్ప్రిభులు, రాక్షసయోధవరులు,
స్వర్ణవర్ణులు రామశైల సుతామ్ర
పతులు, ద్వీపజయంతి పట్టణాధిపులు,
సతులిత వశవర్తులై తన్నుగొలువఁ
బోయి కేరళ పాండ్య పుండ్ర కాళింగ
నాయకులను [2] బ్రధనంబున గెలిచి,
ద్రావిడ యవన గాంధారభూపతుల
లావుననోర్చి, చాలఁగ లక్ష్మిఁగొనుచు

1. ఇట్టిపదములను వ్యర్థముగాఁ బ్రయోగించుట యీతనిపరిపాటి.
2. ప్రదరము. (మూ)

దక్షిణభాగమునకుఁ దద్దయు నేఁగి
రాక్షసేంద్రుఁడు రఘురామభృత్యుండు
శ్రీవిభీషణునకుఁ జెప్పి పంపినను,
భావించి యతఁడును భక్తితోఁ దనను
1 శ్రీరామమాడలుఁ జింతితార్థములు
వారణ హయ రథ వ్రాత రత్నములు
నెసగఁ జతుర్దశ హేమతాళములు
నసమాంబరంబులు నఖిలార్థములును
బంపెను సహదేవ పార్థివేంద్రునకు.
సొంపొంద నదిగొని చూచి మాద్రేయుఁ
డంతన పౌలస్త్యునధిపుల చేత
నెంతయుఁ గప్పంబు లింపుగాఁ గొనుచు
సహదేవుఁడే తెంచె జనలోకనాథ,
విహితప్రతాపుఁడై విశ్వంబు పొగడ.

## నకులుని పశ్చిమదిగ్విజయము

నకులుండు నతులితోన్నత పరాక్రముఁడు
వకుళప్రసూనోరు వరకచభరుఁడు
బలములు గొలువంగఁ బ్రఖ్యాతముగను
దెలివితోఁ బశ్చిమదిక్కున కేఁగి
కరి తురంగ భట ప్రకర ఘట్టనలను
శరధులు ఘూర్ణిల్ల, సంభ్రమంబునను
మాద్రేయుఁ డత్యుగ్ర మానుషంబునను
భద్రసైన్యంబులు బహుముఖంబులుగ
నరుదేర 2 మాహితశావనీశ్వరులఁ
దెఱఁగొప్పఁగా లాటదేశాధిపతుల

1. రామనామాంకితములగు నాణెములు గాఁబోలు. 2. మహితఉద్యావనీశ్వరుల. (మా)

నాభీరగణముల నవలీలగెలిచి
యాభారతీసింధువందువర్తించు
[1] ద్రావణేయుల సముద్దండవిక్రములఁ
బావన గాంధార పర్వతాధిపుల
వశవర్తులనుజేసి, వాసుదేవునకుఁ
గుశలంబెఱింగించి కోరికతోడ
శాకల్యపురమున శల్యు [2] మద్రేశు
భీకరశౌర్యునిఁ బృథుబాహుబలునిఁ
దమమేనమామ నుత్తమగుణాంభోధి
రమణీయుఁడై కాంచి, రత్నరాసులను
హేమవాహనములు నీప్సితార్థములఁ
బ్రేమతోఁగొంచును బిరుదుఁడై యరిగి
యక్షయ శ్రీపశ్చిమాంబుధిఁ జూచి
కుక్షినివాసులఁ గ్రూరకర్ములను
బహుకిరాతులఁ బ్రతాపంబున గెలిచి,
విహిత సద్వరుణేంద్ర విశదసంపద
నరనాయకులచేత నానాధనములు
పరమానురాగుఁడై పడసి యవ్వాని
దశసహ [3] స్రోష్ట్రకదంబంబు చేత
వశముగాఁ బెఱికి రా వైరిభీకరుఁడు
నకులుండు వోయె ననంతశౌర్యమున.
అకలంకులైనట్టి యనిలజ పార్థ
నకులసహదేవ నరవరోత్తములు
ప్రకటిత గుణధైర్య బాహువిక్రములు
విశ్వభూతలము దిగ్విజయంబుచేసి
శాశ్వతశ్రీలెల్ల శమననూనునకు

---

1. గ్రామణీయులని నన్నయ. సింధుకూలాశ్రితా యేచ గ్రామణీయా మహాబలాః. అని. వ్యా. భా. 2. మాద్రేయు. 3. స్రొష్ట్ర......చేత. (మూ)

వేడుకతోఁగ వేర్వేఱనిచ్చినను,
బ్రోడలుపొగడ నప్పుడు ధర్మసుతుఁడు
సంతోషమునఁబొంది సద్వారుణేశు
కంతుభంజనమిత్రుఁ కైవడి లక్ష్మి
చాలంగఁబ్రబలి సోత్సాహుఁడై యుండె.
ఓలి ధరాపాలుఁ డూర్జితశ్రీల
రాజసూయమహాధ్వరము సేయఁబూన
రాజిత నిజమంత్రిరత్నంబులనిరి :
" ధనధాన్యములును రత్నములు గోధనము
ఘనదంతివాజులుఁ గలిగెఁజాలఁగను ;
నవనిధానంబులు నానా [1] ధనములఁ
బ్రవిమలంబైనట్టి బండారమిండ్లఁ
బరిపూర్ణమైయుండుఁ బ్రఖ్యాతముగను ;
అరుదుగా రాజసూయాధ్వరంబిపుడు
గావింపు." మనునంతఁ గమలలోచనుఁడు
వేవేగమునవచ్చి వెస ధర్మజునకు
వందనంబొనరించి వలయురత్నములు
పొందుగానిచ్చినఁ, బుండరీకాక్షుఁ
బూజించి యా యమపుత్త్రుఁడిట్లనియె :
" రాజీవనాభ, ధరాధరవర్ణ,
నీయనుగ్రహమున నిఖిలరాజులును
ఈయెడనరిపెట్టి రెంతయుమాకు ;
నపరిమితంబైన యర్థంబుగలిగె ;
నుపమ విప్రులకును నుచితదక్షిణలు
దానంబులును బ్రసిద్ధముగఁజేయించి
మానుగా మఖము సమ్మతిముగావింపు."
మనిన నారాయణుం డధిపతికనియె :
" నెనయంగఁ బూజ్యుండ నెల్లయంశముల ;

1. విధ. (మా)

రాజులలోనెల్ల రాజసంబునను
రాజితధర్మ నిర్మలయశోనిధి ;
సకలసామ్రాజ్య ప్రశస్తలక్ష్ములును
నకలంకగతిఁ గర్త నవనీశతంబునీవు ;
ఇదితగుఁ దగదన కేపనికైన
ముదమునఁ బనిపంపు పూనుకొని చేసెదను ;"
అనిన సంతోషించె నపుడు ధర్మజుఁడు.

## రాజసూయాధ్వర ప్రారంభము

వనజాక్షు ధౌమ్య సద్వ్యాసానుమతిని
ఘనరాజసూయయాగము సేయఁబూని
యనుజన్ము సహదేవు నత్యాదరాన బిలిచి
పలికె ధర్మజుఁడు : "భూపతులందఱను
బిలువంగఁబంపుము పెద్దటికమున ;
రప్పింపు భూదేవరాజులనెల్ల ;
నొప్పుగా వారికి నుచితగేహములు
కట్టింపు ; యాగోపకరణంబులెల్ల
గట్టిగాఁ దెప్పింపు గడఁకనీ." యనిన
నగుఁగాక యనుచు సహదేవుఁడపుడు
నిగమోక్తిగాఁగ నన్నియు సమకూర్చి,
యుర్వీదేవతల రాజులను రప్పించి,
సర్వసౌఖ్యములను సంతోషములను
నుండుచో ; ధర్మజుండొగి నకులునకు
నిండినభక్తితో నెఱయనిట్లనియె :
"గాంగేయుఁడాదిగాఁగల బాంధవులను
సంగతిఁదో తెమ్ము చయ్యన." యనిన
నతఁడును గరిపురికరిగి భీష్మునకు
ధృతరాష్ట్రునకును యుధిష్ఠిరుముఖము

క్రమమొల్లఁజెప్పి వేగమునరుగఁడనిన,
బ్రముదితంబుగను గుంభజ భీష్మ విదుర
ధృతరాష్ట్ర కృప కర్ణ ధృతిసోమదత్త
చతురభూరిశ్రవ శ్శల్య సైంధవులు
దుర్యోధనుండును దుశ్శాసనుండు
1 నార్యనిగ్రహులైన యాశకునియును
వచ్చిన, నవ్వేళ వరుసతోడుతను
మచ్చికఁబూజించి మనుజేంద్రుఁడనియె:
"మీయనుగ్రహమున మెఱసి యీక్రతువు
నేయంగఁబూనితిఁ జిత్రంబుగాను;
ఇదినిర్వహింప మీరెంతయు వలయు
విదితంబుగా." నని వెస వారియాజ్ఞఁ
బడసి ధర్మజుఁడు ప్రభావంబునందుఁ
గడఁగి హాటకరత్నఘనదానతతులు
పెట్టంగ 2 నియమించెఁ బేర్మిలోఁ గృపుని;
గట్టిగా నాఁగామికార్యముల్ దెలియ
గాంగేయ ద్రోణులఁ 3 గర్తలఁజేసె;
సంగతి మీఱంగ సకలార్థములకుఁ
గలయురాజులుదెచ్చు కప్పంబులకును
గొలఁదితో నీఁబుచ్చుకొనఁ గర్తఁజేసె
విదురుని బహునీతివిదుని నుత్తముని;
ముదమున నిష్టాన్నములు భక్తిఁబెట్టఁ
దుదిని గట్టడచేసె దుశ్శాసనునిని;
బదవితో మణిహేమభండారములకుఁ
గురురాజుఁ గర్తగాఁ గొనకొనిచేసె.
నిరుపమాలంకార నీతిశోభితుఁడు

1. ఆర్యాది. 2. నిర్మించె. 3. కర్తగా. (మూ)

ప్రాజ్ఞుండు నయశాలి పాండవాగ్రజుండు
యజ్ఞదీక్షితుఁడయ్యె నాగమోక్తులను.
రాజతేజము విప్రరాజతేజమును
రాజిత నవరత్నరాజి తేజమును
గల ధర్మసుతుని లోకముల వారెల్ల
నలరుచుఁ జూచిరి యద్భుతంబంది.
బ్రాహ్మణోత్తమ మణిప్రకరంబు నడుమ
బ్రహ్మతేజంబున బ్రహ్మయుఁబోలి
యుండంగ నవ్వేళ యురువినోదముల
మండలేశ్వర................
భూసురాశీర్వాద పుణ్యనాదములు
భాసిల్లఁజేయుచో బహువిధంబులను
బంచమహాశబ్ద పటునినాదములు
సంచితంబై మ్రోసె; నాసమయమున
ధౌమ్యుండుఁ బైలుండుఁ దగినహోతలుగ,
సౌమ్యుండు నిగమార్థ చతురుండు ఘనుఁడు
యాజ్ఞవల్క్యమునీంద్రుఁ డధ్వర్యుఁడుగను,
సుజ్ఞానుఁడైన వ్యాసుండు బ్రహ్మగను,
................................
పూతనారదముఖ్య పుణ్యమానులును
రాజిత భీష్మాది రాజశేఖరులు
నోజతో సభ్యులై యున్నతిఁగొలువ,
నభిరామ సర్వక్రియా సమగ్రముగ
శుభకరంబుగ రాజసూయయాగంబు
సువ్రతంబుగఁజేసి, సొంపుమీఱంగఁ
దీవ్రార్కతేజుఁడై త్రిజగంబుఁబొగడ
వేదవిప్రులకును వివిధదానములు
మోదంబుతోఁ జేసి, మునివరేణ్యులకు

ధరణీసురులకు భూతలనాయకులకు
మఱియును వర్ణాశ్రమముల వారికిని
నమిత దానంబులు నన్నదానములుఁ
గ్రమముతోఁ జేసెను ఘనధర్మసుతుఁడు.”
అనుచు సభాపర్వమందలికథలు
జనమేజయునకు వైశంపాయనుండు
వినిపించె శాస్త్రోక్తివిఖ్యాతముగను
మునిసమూహంబు లిమ్ములఁ బ్రస్తుతింప.
భానుకులాంభోధి పావనచంద్ర,
భానుకోటిప్రభా భాభాసమాన,
యంజనాత్మజలోల, యతికృపాశీల,
మంజీరయుతపాద, మధురప్రసాద,
శరముఖాకర్షిత జలధికల్లోల,
ధరణిజాలింగన తాత్పర్యశీల,
బాణాసనాంకిత పటుభుజాదండ,
బాణభీకర శత్రుపటలసంహార,
అసమసాహిత్య విద్యాచతుర్ముఖుఁడు
రసికుఁడు బాలసరస్వతీశ్వరుఁడు
పసనొనర్చిన సభాపర్వంబునందు
నసదృశంబుగఁ బ్రథమాశ్వాసమయ్యె.



# ద్వితీయాశ్వాసము

శ్రీభోగసంపన్న, విపదాపన్నభిన్న,
సౌభాగ్యసుత్రామ, సాకేతధామ,
శరణాగతత్రాణ జయాభిరామకమున
ధర నగధీరమహాత్మా, సత్కీర్తింపు;
అగ్రకథకుండు శౌనకాదిసన్మునుల
కథకథాసూత్రి మిట్లని చెప్పఁదొడఁగె.
దానధర్మాచార తత్పరుండైన
భూనాథ కులశిరోభూషణుం డధిక
వైభవసురరాజు వాక్యాహిరాజు
.........................
సత్యాంతిరాజు [1] నిశ్చలగిరిరాజు
సత్కీర్తిరఘురాజు సద్ధర్మరాజు
రాజసూయ మహాధ్వరంబొప్పఁజేసి
తేజంబుతోడ సుస్థిరలక్ష్మినుండ,
నతనిని నారదుం డఖిలభంగులను
స్తుతియించి, శ్రీకృష్ణుసొంపుతోఁబొగడ
రాజులువినఁగ సంరంభంబుతోడ :
" రాజీవనేత్రుండు రవికోటితేజుఁ
డతఁడు కేవలుఁడె మహానుభావుండు !
సితపద్మభవ మునిశ్రేష్ఠులయాజ్ఞ
నాదినారాయణుం డబ్జనాభుండు
వేదాంతవేద్యుండు విమలాత్మకుండు

---

1. ధైర్యమునకు హిమవంతునివంటివాఁడని కవియూహ కాఁబోలు !

యదువంశమునఁ బుట్టె నఖిలంబు నెఱుఁగ ;
మధువైరి పనుపున మనుజేంద్రులెల్ల
యక్షగంధర్వ విద్యాధర సిద్ధ
రాక్షసాంశంబులఁ బ్రభవించిరుర్వి."
ననుచు నానారదుండనిన, వారలకు

## ధర్మజుఁడు శ్రీకృష్ణుఁ బూజించుట

సభయందు భీష్ముఁడిట్లనెను : "ఋత్విజుఁడు
గురుఁడు స్నాతకుఁడు సత్కువలయేశ్వరుఁడు
వరసంయమియు మునివర్ణితయశుఁడు
పూజనీయులు వీరు పుణ్యచరిత్ర !
రాజితంబునను వీరలలోనఁ బెద్ద
యగువానిఁబూజింపు." మనిచెప్పుటయును,
దగ ముదంబంది యాధర్మనందనుఁడు
గాంగేయుతోడను గడఁగి యిట్లనియె :
"[1] ఆంగికు లుత్తములగు వీరిలోన
నెవ్వనిఁబూజింతు నెఱిఁగింపు." మనిన
నవ్వసుధీశుతో నాతఁడిట్లనియె :
"సర్వలోకములను సర్వతేజములఁ
బర్విడి సూర్యునిభాతి, సుధాంశుఁ
డేపారఁగా ధాత్రినెల్ల కాంతులను
జూపట్టుభంగిని. శోభితంబుగను
దనదీప్తి జగములఁ దగ వెలిఁగించు
ఘనుఁడచ్యుతుండు పంకజలోచనుండు
పరికింప నర్ఘ్యుండు పసనర్ఘ్యమునకు ;
నొరులర్హులుగారు యుక్తిభావింప.

1. ఈపదమునీతఁడు పదింపదిగాఁ బ్రయోగించును ; సభ్యులనియూహయా !

హరిపూజసేయుట యజ్ఞఫలంబు
సరసత్వమున నీకు సమకూరు." ననిన
నొగి నాసహదేవుఁ డనేకంబుఁ గోయు
నిగమవేద్యుం డైన నీరజాక్షునకుఁ
బూని యర్ఘ్యంబిచ్చి పూజసేయుటయు,
దాని సహింపక త్తఱిఁ గోపించి
శ్రీకృష్ణుదూషించి శిశుపాలుఁ డుగ్రుఁడు
శ్రీకరుండగు యుధిష్ఠిరున కిట్లనెఁ :

## శిశుపాలుఁడు ధర్మజునధిక్షేపించుట

"పట్టాభిషిక్తులు బలసియుండఁగను
నెట్టణంబుగ ధర్మ[1]నియతులుండఁగను
అతివిశిష్టాచార్యులార్యులుండఁగను
మతిదప్పి భీష్మునిమాటలుఁ నమ్మి
యేల దాశార్హుని నిల నర్హుఁడనుచుఁ
జాలఁబూజించితి సద్భక్తితోడ ?
కురువృద్ధుఁడగు భీష్మకువలయేశ్వరుఁడు
పరధర్మమెఱుఁగక వాసుదేవునకు
జడునకు నేల పూజలు సేయఁబనిచె ?
[2]వెడగుఁదనంబిది ; వృద్ధున కేల
బుద్ధులుగలుగును భువనంబునందు !
సిద్ధతేజులు విప్రులెల్ల భూపతులు
[3]నుండంగ, నర్ఘ్యంబు నుచితోక్తి నిచ్చి
పుండరీకాక్షునిఁ బూజింపఁదగునె !
అతనికిఁ గూర్తురే నఖిలసంపదలు
నతివేగమున నిచ్చుటదితగుఁగాని ;

1. నీతు. 2. ఉడుగు. 3. చూడంగ. (మూ)

యితనికి బహుమాన మిటు సేయఁదగునె!
క్షితిఁ బెద్దయనుచుఁ బూజించితే కృష్ణు!
వసుదేవుఁడుండంగ వసుమతీనాథ!
అసమాన ఋత్విజుండసువిచారించి
వరుసఁబూజించితే వ్యాసుఁడుండఁగను!
హరిని నీవాచార్యుఁడని కొల్చితెల్లు?
ద్రోణుండు కృపుఁడును [1] ద్రౌణియుండఁగను;
క్షోణీశుఁడని పూజ సొరిదిఁ జేసితివా!
యాదవు లెచ్చోట నవనినాయకులె!
మేదినిలోన నమితధర్మపరులు
పూజనీయులు గుణాంభోనిధులుండఁ,
బూజించితేలయ్య పుష్కరనయను!
బాలిశుండగు భీష్మపలుకులునమ్మి
బేలవై తేలయ్య పృథివీశతిలక!
నీవధికుఁడవని నిఖిలభూపతులు
వే వేగవచ్చిరి వేడుకతోడ
నీముఖంబునకును నెఱివచ్చునట్టి
యామహాత్ములనెల్ల యవమాన మేల
చేసి కృష్ణునిఁ బూజచేసితివీవు!
ఈసమస్తధరిత్రి నిటధర్మతనయ,
ధర్మమేనీకును! ధర్మాత్మ, వినుము
ధర్మంబెఱుంగక తత్తఱిని నీవిడిన
భావంబునకు సిగ్గుపడక యర్ఘ్యంబు
గోవిందునకు నందుకొన నుచితంబె!
భువి నపుంసకునకుఁ బూర్ణేందుముఖయుఁ,
జెవిటికి గీతంబుఁ, జీకు కద్దంబు,

1. ద్రోణుండుండంగను. (మూ)

హారంబుకరుచగు, నఖిలగంధములు
గౌరవోన్నతి నాసికాహీనునకును,
వేదురునకుంజీర, విరసగాత్మునకు
వేదంబు, లోభికి నితరగాగుణంబుఁ
జేయుట విష్ణుఁబూజించుట ; మఱియు
నీయవనీశ్వరు లిందఱు [1]ండంగ
నర్చింతురే కృష్ణు ? " నని యొగ్గులాడి
పేర్చినయలుకతోఁ బెనుమోఁగుటయు,
నతనిపిలుండనే యమసుతుండరిగి
యతులితప్రియభాష నప్పుడిట్లనియె :

### ధర్మజాదులు శిశుపాలు ననునయించుట

" ధీమంతులకుఁ గృపాదృష్టియుక్తులకుఁ
గోమలయశులకు గుణవిశాలురకుఁ
జారునిర్మల ధర్మచరితులైనట్టి
భూరితేజులకు నెప్పుడుఁ గోపమేల ?
క్రూరంబు శిఖికంటెఁ గులిశంబుకంటె
దారుణంబై యుండు ధారుణిలోన.
ఆదినారాయణుండైనట్టివాఁడు
వేదాంతవేద్యుఁడై వెలసినవాఁడు
ప్రల్లదులను ద్రుంపఁ గాల్పడ్డవాఁడు
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
శరణాగతులఁ బ్రోవఁ జాలెడువాఁడు
పరమాత్ముఁడై లక్ష్మిప్రబలినవాఁడు
నాతఁడర్ఘ్యుండని యాభీష్ముఁ డెఱిఁగి
సతతంబుఁ బూజింప సరవితోఁ బనుప,

1. సనంగ. (మూ)

నేనుఁ బూజించితి ; నిది యొగ్గుఁ గాదు ;
మానసంబున నీవు మానుము కోపంబు.
గురుఁడు దైవంబని కుంభినీశ్వరులు
వరుసతోఁ గృష్ణుని వదలఁ గొల్చుచును,
నిందింపఁ దగునయ్య నీ కనఘాత్మ!
యెందును బగమాను హితబుద్ధి." యనుచు
శిశుపాలు రమ్మని చెలఁగి పిల్చుచును
విశదోక్తులందును వేడ్క మన్నింప,
నంత భీష్ముఁడు పాండవాగ్రజున కనియె :
" యంతరం బెఱుఁగని యట్టి వీనికిని
బ్రియము చెప్పంగను బేల వె నీవు!
నయవిహీనుఁడు జగన్నాథదూషకుఁడు
శిశువు క్రూరాత్ముఁ డీశిశుపాలుఁ ; డితని
వశవర్తిఁ జేయంగ వలదు నీ కధిప!"
అని ధర్మసూనున కంతయుఁ జెప్పి
జననాథచంద్రుండు జాహ్నవీసుతుఁడు
బాలుఁడయిన శిశుపాలున కనియె :
" నేలరోమంబు లక్ష్మీశ్యామధీరుఁడ !
తగదంటివక్షస్స్థలంబు ధరణీభుగనా ;
దగ వెఱుంగవు మహాధర్మబాహ్యుఁడవు ;
క్రూరచిత్తుండవు కుంభినిలోన ;
పేరు వెఱుంగవు నీతిదూరుఁడవు ;
వారితోడఁ బోరినయట్టివారెల్ల
[1] మరణంబులగుదురు ; మఱి కైటభారి
శరణన్నవారెల్ల జయము నొందుదురు ;
సరసిజాక్షునితోడ శత్రుత్వమేల !

1. మృతులగుదురనునర్థములో నిట్టిప్రయోగము శ్రీనాథునిరచనయందును గలదు. 'మాటనాల్కనయుండంగ మరణమయ్యె.' కాశీ. 5 అ. 154 ప.

బాలుఁడై యున్నను బ్రాహ్మణోత్తముఁడు
చాలంగఁ బూజ్యుండు జగములయందు;
అతులవిక్రమశాలియగు మహీవిభుఁడు
నుతికిఁ బాత్రుండెందు నూతనశ్రీల;
ఈ రెండువిధముల నెలమిఁ గృష్ణుండె
చూరయు [1]సర్హుఁ డర్ఘ్యంబునకిలను.
సచరాచరంబైన జగములకెల్లఁ
బ్రచురంబుగాఁ గర్త పద్మలోచనుఁడు.
వృద్ధులై యుండియు విశ్వంబులోన
బుద్ధులు లేనట్టి పురుషులేమిటికి!
పరమాత్ముఁ డాద్యుండు భక్తవత్సలుఁడు
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
కర్తగావునఁ బూజ కడఁగి చేసితిమి.
మూర్తిత్రయాత్మకు మురవైరి భక్తిఁ
బూజించినను మహాభువనంబులెల్లఁ
బూజితంబులయగు భూరితేజమున.
బుద్ధియు మనమును బుండరీకాక్షుఁ
డిద్ధతేజుఁడు పరమేశుఁ డవ్యయుఁడు;
వెలుఁగొందు ప్రకృతియుఁ బరపరంజ్యోతి
జలజారి సూర్యులు జగతియు గాడ్పుఁ
బావకుండును నభోభాగంబు యముఁడు
దేవేంద్రుఁడును మునుదిక్పతితతియు
సకలభూతంబులు సచరాచరములు
వికచాబ్జనేత్రుండు వెలయంగఁ దాన.
యిట్టిమహా[2]త్మకుఁ డిందిరాధిపుఁడు
నెట్టణంబుగ యోగినివహంబులకును

1. సర్హంబులవనిలోపలను. 2. త్మని యిందిరాధీశు. (మూ)

గానంగఁబడుఁగాక ; కష్టజీవులకు
నేనాఁటఁ గనఁబడు నిందిరాధిపుఁడు ?"
అని భీష్ముఁ డాడినయవసరంబునను
అనఘుఁడై నట్టి సహదేవుఁడవుడు
పలికె : " శ్రీకృష్ణునిఁ బద్మలోచనునిఁ
గలుషుఁడై దూషించు కపటాత్ములను
జగణంబుఁ బెట్టెదఁ జయ్యన." నను
నరుగు డెంచినఁ, జూచి యాసభవారు
భయమందియుండిరి ; బ్రహ్మాదిసురలు
రయమున దివినుండి రాజితంబైన
పుష్పవర్షంబులు పొలుపుమీఱంగ
నిష్పత్తిఁగురిపించి నిగుడిరి ; యంతఁ
గలహబంధుండైన ఘనుఁడు నారదుఁడు
పలుమాఱు నృత్యంబు పలుభంగి నాడె.
అంతట శిశుపాలు నాత్మసైనికుఁడు
దంతివైరిబలుండు దగు [1] సునీథుండు
కోపించి సేనలఁగూడి తానుండ,
నేపార శిశుపాలు నెల్లసైన్యముల
రవమున కప్పుడు రాజసైన్యాబ్ధి
వివిధభంగుల నందు వేగంబె కలఁగె.
అతులభయంకరంబైన యారవము
నతిచిత్రముగ విని యమనందనుండు
గాంగేయునకు భక్తిగలిగి యిట్లనియె :
" సంగరవిజయులు జగదీశులెల్ల
మొరయుచున్నారు సముద్రములట్లు ;
గరిమ నామఖము విఘ్నము నొందకుండ

---

1. సునామండు. (మూ)

అవని నీయట్టి దురాత్ముఁడు గలఁడె!
విసరింపు మున్ను గోవిందునిచేఁత;
[1] పూతకిఁజంపి యాపూజ్యశకటును
రీతిభేధించి గిరిన్ గేలనెత్తి,
వృషభంబువధియించి విగ్రహంబునను
విషచిత్తుఁడైన గోవిందునిపేరు
పొగడ నీకొకజివ్వా పొందుగా; దదియుఁ
బగిలి వ్రక్కలునూఱు పరఁగునుగాక.
అతివల, గోసమూహంబు, బ్రాహ్మణుల,
నతులితాన్నములిడినట్టివారలను,
విశ్వసించినవారి వేగఁద్రుంచినను
విశ్వధారుణియందు వే పాపమంద్రు;
వనజనేత్రుండు గోవధయు స్త్రీవధయుఁ
జెనసిచేసెను భూప్రసిద్ధంబుగాను;
అట్టిగోవిందున కర్ఘ్యంబు నీవు
గట్టిగా నిప్పించి ఘనతనుండితివి.
అదియునుగాక, పరాంగననాక
కదిసి యంబికయనుకన్యకామణిని
నీవుదెచ్చుటెఱింగి నీసహోదరుఁడు
శ్రీవిలాసుండు విచిత్రవీర్యుండు
ధర్మజ్ఞుఁడై దానిఁ దగవిడ్చిపుచ్చె.
దుర్మదాంధుండవు దురితదేహుఁడవు
జననిందితుండవు సంతానహీనుఁ
డన నున్న నినునమ్మ నగునె లోకులకు!

---

1. ‘పూతకింజంపిన పూజ్యసంఘముల–రీతిభేదించి గిరికేలనెత్తి’. అని యీపాదము లిట అనన్వితములుగా మూలమునఁగలవు. “పూతనాఘాతంబు చేతనేతరమైన...” అనుపద్యము పైరచనకాధారమైయుండును. చూ. నన్నయ. భా. సభా. 2 ఆ. 41. ప.

తలపోయఁ మును సముద్రంబుతీరమున
విలసితంబుగ నొక్క వృద్ధహంసంబు
క్రమము దప్పక ధర్మకథలు చెప్పుచును,
క్రమముదప్పక యుక్తి ఖగములనెల్ల
శిక్షింపుచును ధర్మశీలుఁడై ప్రాణి
రక్షకుండై విహారము సేయుచుండు;
విహగంబులును దాన విశ్వాసమంది
సహజపార్థోరాశి జలచరంబులగు
పక్షుల మాధుర్యభక్ష్య భోజ్యముల
దక్షతఁదెచ్చి నిత్యముఁ బెట్టుచుండె
తమయండమండముల్ దత్సమీపమున
నమర నిక్షేపించి యతిదూరమరుగ,
నాసమయంబున నాహంసరాజు
గ్రాసంబుగా సర్వఖగకులాండములు
భక్షించియుండినఁ, బలితెంచి యొక్క-
పక్షివీక్షించి తప్పక పక్షితతికి
వృత్తాంతమంతయు వేగఁ జెప్పినను,
చిత్తంబులందును చింతించి వగచి
యాముదిహంసను నడగించె నవుడు.
భీమవిక్రమమునఁ బేర్చి మిక్కిలిని
ధర్మచిత్తుండవై ధర్మసత్కథలు
కూర్మిఁ బాండవులకుఁ గురుకుమారులకుఁ
దెలుపుచుఁ గలహంస ధృతి నొనర్చెదవు.
బలియురఁ బెక్కండ్రఁ బద్మలోచనుఁడు
దండించె నని సంస్తుతంబొనర్చెదవు;
పుండరీకాక్షుని భూరిబలంబు
నే నెఱుంగనిదియే నిఖిలంబునందు !
మానుషంబునఁ బొంగు మాగధునకును

విఱుగఁడే పదివూర్లు విక్రమంబెడలి!
మెఱసి జరాసంధు మేటిసాహసుని
భీమార్జునులఁ దోడుపెట్టుక పోయి
భూమీసురాకృతిఁ బొంగణఁగించె;
నిది విక్రమంబె మహీమండలమున!
మదదైత్యహరు నేల మాటిమాటికిని
బొగడుచున్నాఁడవు [1] బూతుచందమున?
పొగడక నీకును బొద్దు [2] పోదేని
సుగుణాకరులు రణశూరులైనట్టి
జగదీశ్వరులు కర్ణశల్యులాదిగను
కౌరవులఁ బొగడు మత్యున్నతితోడ.
సాధునిందయు నన్యజనకీర్తనంబుఁ
జేయురు గాంగేయ, నృపసత్తములు
ఏయెడ నని మునులెంతయు ననిరి."
అనుచును దుర్భాషలాడుట చూచి
యనిలతనూభవుండలిగి రౌద్రమునఁ
బ్రలయకాలమునాఁటి ఫాలాక్షువగిదిఁ
గలనను శిశుపాలు ఖండింపఁజూడ,
భీముని వారించి భీష్ముఁడిట్లనియె :

## శిశుపాలుని జన్మవృత్తాంతము

" ఈదురాత్ముండు మహీస్థలిఁ దొల్లి
చేదివంశమునఁ బ్రసిద్ధుఁడైనట్టి
యాదవఘోషున కాసాత్వతికిని
బుట్టెను ఘనచతుర్భుజములతోడ,
నట్టనంబుగ ఫాలనేత్రంబుతోడ,

1. పూత. 2. పోదండు. (మూ)

బంధుర దైతేయభాసంబుతోడ ;
సంధిల్లుటయుఁ, జూచి జననియు గురుఁడు
నరుదంది భయమంది యట్లున్నఁ, జూచి
వరుస నక్కడ నభోవాణి యిట్లనియె :
'నొరులు వీనినిజంప నోపరెవ్వరును ;
దొరయంగ వీని నెత్తుకయుండు వేళ
నెవ్వరిచేత నీయెక్కుడుకన్ను
నివ్విశాలభుజంబు లివి రెండు నణఁగు,
నతనిచే శిశుపాలుఁడణఁగు గ్రక్కునను
జతురంబుగా ;' నని సర్వంబుఁ దెలిపె.
అదినిమిత్తంబుగా నాకుమారకుని
వదలక చూడంగవచ్చువారలకు :
'బాలుండువీఁడె నాపట్టి ; ముద్దాడుఁ
డోలిమై.' నన వార లాదవిన ప్రీతి
నెత్తుక ముద్దాడి యింపుసొంపలర
బత్తితోఁ జేతికి ఫలములనొసగి
వారి [1] యూరికిఁజన, వసుధ నీవార్త
బోరనవిని యదుపుంగవులైన
భీమవిక్రములు గంభీరనాయకులు
రామకృష్ణులు నిందురవి తేజు లపుడు
అమరంగ జయశీలు నాశిశుపాలు
సుముఖులై వేడుకఁజూడంగఁ గోరి
పోయిరి బుధబంధుపుంజంబుతోడ.
ఆయెడఁ దన మేనయత్త సాత్వతియు
బాలకుండగు శిశుపాలునిఁదెచ్చి
చాలంగ సంతోషజనితయై యపుడు

1. వారికి. (మూ)

బలభద్రుకిచ్చినఁ, బరఁగంగ సతిఁజు
జలజాక్షుచేతికిఁ జయ్యన నిడిన,
శిశుపాలు మిక్కిలిచేతులుఁగన్న
దిశయెఱుంగక పోయెఁ జెల్లమిగాను.
దానిఁదలంచి సాత్వతి యశరీర
మానితవాక్యంబు మదిలోన నెఱిఁగి,
హరిచేత శిశుపాలుఁ డణఁగు గ్రక్కునను
బరమార్థమని కైటభద్వేషికనియె :
‘మకరాంకజనక, నీమఱఁదిని వీనిఁ
బ్రకటితబలు శిశుపాలునివలన
నూఱుతప్పులుగావు నూతనంబుగను ;
మాఱుమాటాడక మన్నించు నన్ను.’
అని వానిజనని పద్మాక్షుఁ బ్రార్థింప,
వనజనేత్రుండును వరమిచ్చెఁ ; గాన
నపరాధములునూఱు నటు నిండుదనుక
నుపమ యూరకయుండుటుచితంబు మనకు.
కనకాంబరునిచేతఁగాని యీదుష్టు
మనచేత నాజిలో మరణంబుగాఁడు.
ఇతరమానవులు నన్నెగ్గులాడినను
హతముసేయుదు మదీయాస్త్రములందు.”
అనెడుభీష్మునిమాట లాలించి, భీము
మనుపుగైకొనక, యమ్మురవైరికనియె :
“ అవమాన్యుఁడగు నిన్ను నాస్థానమునను
అవిరళమతి మాన్యుఁడని పాండుసుతులు
గాంగేయుఁడును నిష్ఠ గడఁగిపూజించి ;
రాంగిక మెఱుఁగక యధికదుర్బుద్ధి,
నీవునుగైకొంటి నెఱయఁగాఁ బూజ ;
యీవసుమతి నీకు నిటు చెల్లునోటు !

నాతోడ వడిఁ బ్రథనము సేయు నిలిచి
యాతఁడె." ననుచును నెగ్గులుపలుకు
శిశుపాలుఁగనుఁగొని శ్రీకృష్ణుఁడనియె
విశదోక్తులను మహీవిభులువినంగ :
" అమరఁ బ్రాగ్జ్యోతిషంబనుపురంబునకుఁ
బ్రముదితంబుగవచ్చి భగదత్తుతోడఁ
జోరాడ నీచేదిభూపతి పోయి
ద్వారకానగరంబు దగ్ధంబుచేసెఁ
గ్రూరుఁడై యన్యాయ [1] కుశలాతఁ బేర్చి ;
భూరివిక్రములగు భోజరాజాది
ధారుణీశులు [2] రైవతకగంబునందుఁ
జారుతరంబగు స్మరపరవశతఁ
బాలఁతులతోఁగూడి భోగింపుచుండఁ
దెలిసి వారలను వధించె నేకతము ;
దేవాభుఁడగు వసుదేవుండు సేయు
పావన హయమేధ పటుమఖంబునకు
నర్పితంబైనట్టి హయమును గొనియెఁ ;
బేర్చి యామఖముకుఁ జెరిను విఘ్నంబు
చేసె వీఁడతిపాపశీలుఁడై పూని ;
భాసురమతియైన బభ్రుని భార్యఁ
దనకు భార్యనుజేసె దర్పంబుతోడ ;
ననురక్తి మామేనయత్త తాఁబలుకు
మాటకునై నూఱుమాఱులు వీని
మాటలకోర్చితి మఱి వీనిఁద్రుంతు."
ననుటయు శిశుపాలుఁ డబ్జాక్షుకనియె :
" నానరంగ నీకూర్మియును నీదుపలుకు

1. కులశత. 2. రైవతానగంబునను. (మూ)

నాకదియేటికి నయమార్గదూర!
నాకునిచ్చినయట్టి నవినలోచనను
నీవువగించితి సఖిలంబు నెఱుఁగఁ;
గావున మఱి సిగ్గుగలదె నీకెందు?"
ననుచు దుర్భాషల నాడుచునుండ
విని కృష్ణుఁడప్పుడు వేగఁ గోపించి
తలఁచినంతటిలోనఁ దద్దయు వచ్చెఁ
గలితనిర్వక్ర విక్రమము చక్రమును.

## శిశుపాలవధ

అది శతకోటిబాలార్కప్రకాశ
విదితమై శతకోటివిస్ఫూర్తియగుచు
వచ్చినఁ, జక్రంబు వాసుదేవుండు
చెచ్చెఱ నుగ్రుఁడై చేతసంధింపఁ
గులగిరులూటాడెఁ; గూర్మమల్లాడె;
జలధులుగలఁగె; నాశాచక్రమగలె;
రవితప్పఁదిరిగెఁ; దారకములు డుల్లె;
దివికంపమందెను; దేవేంద్రుఁడడలె;
నుడుగక రొక్కమ్రోఁత యూఁటక మ్రోసె;
నడరి రసాతలంబద్భుతంబందె;
బ్రహ్మాండములు భయభ్రాంతివహించె;
బ్రహ్మాది సన్మునిప్రణుతాంఘ్రుఁడైన
హరి యట్టివేళ మహారౌద్రమునను
బిరబిరమని త్రిప్పి బిట్టువ్రేయుటయు,
గురుతర నిర్ఘాత ఘోషంబుతోడఁ
బరిపూర్ణ విలయోగ్ర పావకశిఖలు
భూమండలమున నభోమండలమున
భీమమై పర్వంగ బెట్టునవచ్చి

చేదిభూపాలు శిరశ్ఛేదంబు సేసి ;
నాదట నాళీకనాభు శరీరము
ఘనతేజంబుచేఁ బద్ధ్వోదుగు చనంగనునట
నిలువరింపఁబడె నక్షత్రమండలము వోఁగగ
జగతీతలేశులు సంచలింపఁ
దగ శిశుపాలుని తనువున నున్న
తేజంబు వెలువడి దిశలెల్ల వెలుఁగ
రాజకోటులు చూడ రాజీవనయను
తేజంబులోఁ జొచ్చె సందేహంబు లేక.
యాగంబునకు వచ్చు నుర్వీశులనిరి :
" జయపుండరీకాక్ష, జయచక్రపాణి,
జయరమాధీశ్వర, జయవ్యాపీకేశ,
ఖగరాజగమన, రాక్షసరాజదమన,
నగరాజహస్త, పన్నగరాజశయన,
రక్షించు సర్వేశ, రాజీవనాభ,
యాశ్రితులము మముఁ గృప నిభరాజవరద ! "
అనుచు సన్నుతిచేసి యందఱు మ్రొక్కి
మనమున సంతోషమగ్నులై యంత
ననురక్తి రాజసూయాధ్వరం బొప్ప
ఘనత సంపూర్ణంబుగా నొనరించి
యాధర్మనందను నధికపుణ్యాత్ము
సౌభాగ్యవర్యు నత్యుత్తమోత్తమునిఁ
గని మోదమును బొంది కమలాక్షుఁడాది
యనిమిషావళి గొనియాడెరి ; మఱియుఁ
గురువీరులెల్లఁ జేరొప్పనిరి వేడ్కఁ.
వరుసతో నంత నైశ్వర్యుఁడై యున్న
ధర్మజుకడకు భూధవులేఁగుదెంచి
యర్మిలి సద్భక్తి నప్పుడిట్లనిరి :

" సకలరాజన్యవంశములలో నెల్లఁ
బ్రకటమై యొప్పు నీభరతవంశంబు ;
రంజిల్లఁ జేసితి రాజసూయంబు ;
మంజులవాక్య, నీమహానీయకృపను
ఇలఁ గృతార్థులమైతి ; మేము భూములకు
నేలికఁబోలెద." మన్న నెఱిఁగి ధర్మజుఁడు
ఆనతియొసఁగింప, నపుడు భీముండు
ననిచె భీష్ముని ధృతరాష్ట్రు ; నర్జునుఁడు
ననిచెను యజ్ఞసేనాదుల ; సుబలు
వెనువెంటనరిగి వావిరి భక్తిననిచె
నకులుండు ; కృపు ద్రోణు నయభక్తిఁ బంచె
నకలంకమూర్తి సహదేవుఁడంతేఁ ;
బరగ విరాటుని భగదత్తుఁబనిచె
సరసచిత్తమున ధృష్టద్యుమ్నుఁడపుడు ;
పార్వతీయుల మహీపతులను ననిపె
సర్వసామ్ములునిచ్చి సౌభద్రుఁడెలమి ;
ధరణీసురులఁబంచెఁ దమగృహంబులకుఁ
గరుణవాటిల్లంగ గౌఁగిళ్లఁజేర్చి ;
పాండునందనులను బద్మలోచనుఁడు
నిండువేడుకల మన్నించి యిట్లనియె :
" సకలభూతములు పర్జన్యునిఁ బక్షి
నికరంబు [1] ఫలధారుణీజంబు నెపుడు
భజియించుకైవడి బంధువులెల్ల
భజియింపుదురు నిన్ను భక్తియుక్తముగ."
అనిన శ్రీకృష్ణున కనియె ధర్మజుఁడు :
" అనఘాత్మ, నీకృపయందు నామఖము

1. లోధారుణీజంబునందు (మూ) చూ. నన్నయ. సభా. ద్వి. ఆ. 79 ప.

సఫలమైయుండునని జగమెల్ల నెఱుఁగ;
సభికసంస్తుతుఁ డేఁజతురుండనైతి; (?)
ద్వారకానగరీస్థలినుండి నీవు
దూరంబుగానుండఁ దోఁచు మామదికి;
శుభములుగలుగుచు మెచ్చోటను మాకు;
సిభరాజవరద, నిన్నెంచియుఁ బాసి
నిమిషమాత్రంబును నిలువనోపము
క్రమముతో." ననవుడు కంజనాభుండు
నాధర్మనందను నట్లూఱడించి
సాధులు నుతియింప సంతోషమునను
అనిలవేగములైన హయములఁబూను
కనకరథంబెక్కి కదలిపోవుటయు,
ధర్మతనూజుండు తమ్ములుఁ దానుఁ
బేర్మిఁ గృష్ణునిసంపి పెరిమనేతెంచి
యుండంగ, మేటిసుయోధనుండంత

మయసభాసందర్శనమున దుర్యోధనుఁడు లజ్జితుఁడగుట

దండితో శకునియుఁ దానును గూడి
సమధికంబైన యాసభఁ జూచువేడ్కఁ
గొమరొప్ప నక్కడ కొన్నిదినములు
నిలిచి యాసభరమణీయతఁ జూచి,
లలిత నిరంతరాలంకారమహిమఁ
దేజంబుతోఁ దత్ప్రదేశంబునందు
రాజితంబైన ద్వారమున నెయ్యమున [1]
..........................
..........................

1. గ్రంథపాతమైయుండును. చూ. నన్నయ. భా.

నీలరశ్మిచ్ఛటానిచయంబుపర్వ,
నాళీకసరసి జలంబని సంశయించి
రమణీయ దివ్యాంబరమ్ము లన్నియును
క్రమమున నెగఁద్రోసి కడురభసమునఁ
జొచ్చిన, నది నీలశోభితమణుల
నచ్చుగాఁ జూపట్టు నాస్థలంబయ్యె.
అటుమీఁద నేఁగంగ నంబుజాకరము
పటుతరంబుగఁ జూచి బహునీలరుచుల
మణితలంబనుచుఁ గ్రమ్మనఁ జొచ్చుటయును,
బ్రణాళికి నెక్కిన భవ్యాంబరములు
తడిసినఁ గమ్మఱ తడయకే తేర
నడరి పాండుకుమారులయ్యెడ నగిన,
ధర్మంబుదలపోసి ధర్మనందనుఁడు
కూర్మి రెట్టింప నాకురుమహీపతికి
దివ్యవస్త్రములును దివ్యగంధములు
దివ్యభూషణములుఁ దెలియఁగొప్పఁ బనిచె
ననిలసూనునిచేత నానందమునను ;
బనిచినఁ గురుమహీపతియును గట్టి
చాలంగ ధర్మజసభఁ జూచి లజ్జ
నోలి పాండవులను నొగివీడుకొనుచు
నిజపురంబునకును నేర్పునవచ్చి,
భజనలేకతలంచి బహుభంగి వగచి
రాజచంద్రుఁడు ధర్మరాజశేఖరుని
రాజసూయమహాధ్వరంబు మానవుల
నయనోత్పలముల కానందమై యొప్ప
నియమింపఁగాఁ దన నేత్రంబులకును
బావకనిచయమై పరఁగుచునుండె.
భావింపఁగాఁ దగు పసిఁడిగాచినను

గందినకై వడి కౌరవేశ్వరుఁడు
కుంది మనోవ్యథఁ గొనగి ఖిన్న
దేహుఁడై యుండె ధాత్రీరాజ్యభార
మోహంబుదక్కి యిమ్ముల సుహృజ్జనుల-
తోడ మాటాడక తుది రహస్యముగ
నోడకయుండె యథోచితంబుగను.
వేదనఁబొరలుచు విముఖుఁడై యున్న
యాదుర్యోధను నప్పుడు చూచి
శకుని యిట్లనియె నాశ్చర్యంబుతోడ :

## దుర్యోధను దురాలోచన

"వికలుఁడవై రోషవేశంబునొంది
యేల నాతోడ నీ [1] పిన్నన్నినాళ్ల-
వోలెను బలుకవు భూమీశతిలక !
ఇంతచింతింపంగ నేటికినీకు ?
నెంతటికార్య మిట్లితేఁగింపవలయు.
నేనుండఁగా నీకు నేటికిఁ దలఁకి !
గానఁగఁబడు నెంతకార్యంబుదీర్తు ;
వ్యాకులపడకుండు వసుధేశతిలక !
లోకంబులో నృపలోకసంసేవ్య ! "
అనిన సుయోధనుం డాశకునితోడ
వినుపింపఁబూని వివేకంబుతోడ :
"నీవునుజూచితి నేనుఁజూచితిని
భూవలయంబున బురణించిచూడ
నేయుగంబునఁగల్ల దీసభమహిమ
శ్రీయుతంబై భూప్రసిద్ధమైయొప్పె.

1. పెన్నునినాళ్ల. (మూ)

అతిమనోహరమైన యాసభయందు
నతులితభద్రసింహాసనాసీనుఁ
డంతకతనయుఁ డత్యంతసంపన్నుఁ
డెంతపుణ్యంబు దానిలఁ జేసెనొక్కొ !
సకలభూపతులు నసంఖ్యంబులైన
ప్రకటితార్థములు దప్పక తెచ్చిపెట్టి
కొలుచుచునుండిరి కొంకకకదిసి ;
బలవంతులై ప్రతాపమునశోభిల్లి
భూసురోత్తములకు భూరిదానములు
చేసి దిగ్విజయలక్ష్మీసమగ్రమున
నున్నారు రాజులై యుర్వియేలుచును
సన్నాహమునఁ బాండుజగదీశసుతులు.
వారికెవ్వరుసాటి వసుధీశకోటి ;
వారికి వరదుఁడై వాసుదేవుండు
హితమాచరింపుచు నెల్లకాలంబుఁ
జతురత్వముననుండు ; శౌర్యంబునందుఁ
జేదిభూపతి శిరశ్ఛేదంబుఁ జేసె
మేదినీనాథులుమిక్కిలిబెగడ ;
యాదవోత్తముఁ గృష్ణు నందఱుఁ జూచి
భేదింపఁగాలేక పెంపుతోడుతను
బొగడుచునుండిరి భుజశక్తి దలఁగి ;
తెగువతోఁ బాండుధాత్రీనాథసుతుల
సంపదలెల్ల నీక్షణములోపలను
సొంపుతోఁ గొనుబుద్ధి చొనుపంగవలయు."
ననుకురురాజు భవ్యాలాపములను
మనమునఁ దలపోసి మామయిట్లనియె :
"మాతండ్రి ధృతరాష్ట్రమేదినీశ్వరుని
నీతివిచారించి నెఱయఁ గావింపు."

పిదప శకునియును వేగ సుయోధనునిఁ
గొనిపోయి ధృతరాష్ట్రు నవనీశ్వరుని
సన్నిధిఁ గాంచి నిశ్చలవృత్తిఁ బలికె :
" నెన్నికకెక్కిన యీసుయోధనుఁడు
నీకుమారుఁడు ధారుణీనాథుఁ డాత్మ
వైకల్యమునను వివర్ణుఁ డగుచుండుఁ
బొగిలియున్నాఁడు పెంపున విచారింపు
సుచితంబుగా. " అన్న నాధృతరాష్ట్ర-
ధరణీశుఁ డాసుయోధనుశరీరంబు
పరికించి నిమిరి తత్పరబుద్ధిఁ బలికె :
" శాశ్వతైశ్వర్యంబు సకలోత్తమంబు
విశ్వంబులోపల వెలయంగఁగలవు ;
అనుజులు మిత్రులు సఖులబాంధవులు
ననుకూలురై యుందు రనిశంబు నీకు ;
నింద్రునికంటెను నెక్కుడై నట్టి
సాంద్రభోగము నీకుఁ జాలంగఁగలదు ;
సకలభూపతులును సతతంబు భక్తి
ప్రకటంబుగాఁగ నీపంపు సేయుదురు.
ఏమితక్కువ నీకు నెల్లసౌఖ్యముల !
నీమేను డస్సిన నిర్ణయం బేమి ?
నిజదేహకాంతులు నీ కేల తఱిగె ?
.........................
[1]పరసత్త్వమున నీవు సకలసామ్రాజ్య
పరభారకము దప్పి పరఁగియుండితివి. "
అనవుడు ధృతరాష్ట్రు కాతఁ డిట్లనియె :

1. 'సకలధరణిరాజ్య భోగసుఖపరాఙ్ముఖత్వముఁ బొంద నేల.' అని నన్నయ. సభా. ద్వి. ఆ. 102. ప. నన్నయభారతము ననుకరించియు, నీరసిల్లఁజేసిన రచనాభాగము లిట్టివింకను గలవు.

## పాండవాభ్యుదయమునకు దుర్యోధనుఁ డసూయపడుట

" జననాథ, పాండుపుత్త్రావనీశ్వరుల
భాగ్యభోగంబులుఁ బర్జన్యుకంటె
సౌగ్యమైయున్నవి యున్నతంబగుచు ;
సకలదిక్కుల వారిసత్ప్రతాపములు
వికటమైచూపట్టి వెలసెను పేర్మి ;
నరుఁడు విక్రమశాలి నయగుణోన్నతుఁడు
పరరాజ్యవిజయుండు బలసమగ్రుండు
కామరూప్య నుత్తరకురుభూములాది
యమరదేశములెల్ల నర్థి సాధించె ;
శక్రుండు ద్రుపదరాజన్యశేఖరుఁడు
చక్రధరుండును జగతిలోఁ దక్కఁ
దక్కనరాజులందఱుఁ బాండవులకు
మ్రొక్కి యుప్పనము లిమ్ములఁబెట్టువారె ;
కాని, కొల్వనివారిఁగానము జగతిఁ
గానన శైలసంఘ ద్వీపములను.
వనధివేష్టిత చక్రవాళమధ్యంబు
ననురక్తితో నేలె నఖిలంబుఁ బొగడ.
నేనొకరాజనా యీమహీస్థలికి !
దీనిఁజూడఁగఁజాల ; దిక్కులెఱుంగ
ధర్మనందనుఁడు రత్నపరిగ్రహంబు
పేర్మిసేయఁగ నన్ను బెద్దయుఁ బనిచె.
నేనునుజూచితి నెనగ నమ్మణుల
భూనాథ, యేజగంబులఁగాన నెందు.
యజ్ఞదీక్షితుఁడైన యమనందనునకు
విజ్ఞానవంతులు విశ్వభూవిభులు

కాంభోజనృపులు నుత్కటరథంబులును
జృంభితహయములు సింధురావళులుఁ
దెచ్చియిచ్చిరి మహా తేజంబుతోడ;
మెచ్చి శ్రీకృష్ణుండు మెలఁగువతోడఁ
దరుణార్కరుచుల రథవ్రాతములును
మరగరత్నములు బంధురరత్నములును
బదునాల్గు వేలు సింధురగజేంద్రములు
మోదముతోఁ బాండవముఖ్యునకొసఁగె.
నవరత్నములు సువర్ణములు గంధములు
వివిధాంబరంబులు వేడ్కతోడుతను
కేరళ సింహళ కేకయ చోళ
శూరసేన సుపాండ్య శోభితనృపులు
ధర్మరాజునకు మోదమ్ముతోడుతను
అర్మిలినిచ్చిరి యధికలక్ష్ములను;
నరుఁడు నాద్యంతైననారాయణుండు
నిరువురు సుఖగోష్ఠి నేకతంబునను
వర్తింపుదురు మహావైభవంబునను;
మూర్తితో ధర్మజుమూర్ధాభిషిక్త
కాపిరాటుండు పరాక్రమోన్నతుఁడు
వేవేగమున రెండు వేలదంతులను,
వేడుక ద్రుపదుఁడు వెయ్యానుఁగులను,
జూడనొప్పిన తనుసురుచిరాశ్వములఁ
బదునాల్గువేలనుబటువిలాసినులఁ
బదివేలదాసులఁ బసనిచ్చిరపుడు.
గాంధార కేకయ కాంభోజ మద్ర
బంధురకాశ్మీర బహ్లీకులాట
కురు మరు మాళవ కుంతల మగధ
కరహాట వంగాంగ కాళింగ నృపులు

భగదత్తుఁడాఁగఁగాఁ బార్థివోత్తములు
నగణిత గోమహిషాశ్వటంకములను
అజముల రథముల నంబరంబులను
నిజభూషణంబుల సీంజాసనఁ
దెచ్చియిచ్చిరి యాయుధిష్ఠిరునకును.
అచ్చుగా మఱియును నపరిమితంబు
రత్నకాంచనముల రాజీవముఖుఁ
రత్నసాను ధరాధరశ్రేష్ఠ తుహిన
గిరి మందరాచలక్షితితలేశ్వరులు
కరు కుసుమాసవ కోమలపాత్ర
దివ్యౌషధంబులు దివ్యాంబరములు
[1] దివ్యేంద్రనీల సుస్థిరచంద్రకీర
మరకతవర్ణసమానితహారులు,
వరమౌక్తికచ్ఛత్ర వర్ణితతల్ప
చామర దివ్యాస్త్ర సముదయంబులును,
గోమలంబగుపట్టు గొల్లెనగములు
నిచ్చిరి ధర్మజు కింపుసొంపారఁ ;
జెచ్చెర గంధర్వచిత్రరథుండుఁ
దుంబురుండునుగూడి దొరసి నూతేసి
కంబువర్ణములైన గంధర్వహరుల
మహిమతోనొసగిరి మహనీయముగను ;
బహుభంగి నందుకై పరఁగఁజొక్కితిని.
ఒకలక్షభూసురు లొగి భుజియింప
సకలయత్నములందు శంఖంబుమ్రోయుఁ
దనకుఁదాన సమంచితంబుగా నెపుడు ;
మునుమీడి యాగంబు ముగియునన్నాళ్లు

1. దివ్యపీతేంద్ర సుస్థిర చంద్రకీర్ణ—మరకతవస్త్ర సమానితహారులు. (మా) 'ఇంద్ర నీల...పీత చంద్ర...కీరవర్ణతురంగంబులను.' అని. నన్నయ. సభా. ద్వి. ఆ. 113 గ.

నుడుగకమ్రోసెఁ బెంపొదవి శంఖంబు.
అడరి జన్నముచూడ నరుదెంచినట్టి
సర్వభూములమహీశ్వరుల భూసురుల
దుర్వారవైశ్య శూద్రుల నాప్తజనులఁ
బ్రాణబంధువులను బ్రాణిసంఘముల
క్షోణిపైఁ బేదల సుజనుల నరసి
ప్రతిదివసంబును భాసురాన్నములు
చతురత్వమునఁ బెట్టి సంతోషమునను
అర్ధరాత్రంబున నన్నంబుగొనును
అర్ధేందుధరుకృప నాద్రౌపదియును.
అధికుఁడాధర్మజునధ్వరంబునను
అధమాధముండును అధికపూజ్యతను
బొందుఁ; [1] గానప్రియంబును బొందఁడెందు.
ముందు హరిశ్చంద్రు మూర్ధాభిషిక్తుఁ
డరుదుగా రాజసూయాధ్వరంబొప్ప
నరవిఁ జేసెను; గాని, చర్చించిచూడ
ధర్మనందనుమహాధ్వరముతో నదియుఁ
బేర్మితో సరిగాదు పృథివిఁ దర్కింప.
ఆయాగదీక్షితుండై ధర్మసుతుఁడు
పాయక ధారుణీపతులు భూసురులుఁ
[2] దిరుగువారి భజింప దిక్పతిశ్రేణి
వరుసఁగొల్వఁగనున్న వాసవుఁబోలె.
ధర్మనందనుఁడు మోదముఁబొందియుండ,
ధర్మమూర్తుఁడు మునీంద్రసముత్కరంబుఁ
గొనియాడ, ధౌమ్యుఁడు గోచరతీర్థ
ఘనజలంబులను యోగ్యంబుగాఁ బూని

1. కాని + అప్రియము. 2. తిరుగ. (మూ)

యభిషేక మొనరించె నతివిచిత్రముగఁ.
బ్రభ నభిషిక్తుఁడై పరఁగినయట్టి
సత్యసంధుఁడు ధర్మజమహీశునకును
సాత్యకి మౌక్తికచ్ఛత్రంబుపట్ట,
భీముండుఁ బార్థుండుఁ బ్రేమంబుతోడఁ
జామరంబులు విశేషంబుగా నిడిరి ;
కమలనాభుండును గవలును ద్రుపదు
కొమరుండు వేర్వేఱ కువలయేశ్వరుల
మ్రొక్కులంపుచుండిరి మోదంబునందు ;
దిక్కులరాజులుఁ దెఱఁగొప్ప నేను
జిన్నఁబోయున్నను చేష్టలెఱింగి
వెన్నుండు పాండుభూవిభుతనూజులును
ద్రౌపది సాత్యకి దగుసంతసమునఁ
జూపట్టియుండె ; నచ్చో యుధిష్ఠిరుఁడు
నెనయఁగ నెనుబదియెనిమిదివేలు
ఘనమహీసురులకుఁ గల్యాణమొప్పఁ
జేసి, ప్రత్యేకంబు చెలఁగి ముప్పండ్రు
దాసుల వేర్వేఱ తడయక యిచ్చి,
పదివేలు వేదవిప్రవ్రాతములను
బదవికెక్కిన హేమపాత్రంబులందు
భుజియింపఁగాఁ జేసి, భూషణవ్రజము
నిజవస్త్రములు గంధనివహంబు నొసఁగి
[1] మన్నించియుండును మహనీయరుచుల.
నెన్నంగ నాజన్మమేమిఫలంబు!
పాండునందనుల సంపదలుచూడంగ
మండలంబుననోర్వమఱి." యనుటయును
శకునియిట్లనియె నిశ్చలవృత్తితోడ :
" సకలంకమగుచున్న యయ్యక్షవిద్య

1. మన్నింపుచుండును. (మూ)

నేర్పరి సగుణాను సుఖలాభమొంగ ;
దర్పంబు లణఁచి దుర్యోధనుఁడు పాండవులఁ
దూకొని యూడక నాతో నొనఁగూర్చు ;
శోకింపకుండుము సుఖశ్రేమమునంఁ
జాలంగ." నరనాయకుఁడు శకునివాక్యమ్ము
లాలించి కురుపతి హర్షించి మదిని,
చతురత ధృతరాష్ట్రుచరణాబ్జయుగముకు
నతిభక్తితో మ్రొక్కి యాతఁడిట్లనియె :
"జననాథశేఖర, శకునిమాటలను
ననుకూలమైయుండ ననిశంబువలయు ;
శకునియు నను సర్వసామ్రాజ్యమునకుఁ
బ్రకటితకర్తగాఁ బరఁగఁగఁ జేయు ;
నోడఁబడు మతని కార్యోక్తుల." అనినఁ
గడువిచారము చేసి గౌరవంబునను
బలికెను గురుమహీపాలచంద్రుండు :
"కులగిరిస్థైర్యుండు గుణసముద్రుండు
విదురుండు సత్కళావిదుఁడు సత్తముండు
సదమలచరితుండు శాస్త్రార్థవేది
నీతిమార్గంబున నిర్జరగురుని
బ్రాంతిగేల్వఁగఁజాలు భావంబువాఁడు
సముచిత్తుఁ డుభయపక్షములవారికిని
క్రమమొప్ప నతనితోఁ గడువిచారించి
చేయుద మీపని సిద్ధంబుగాను ;
పాయక భీష్ముని బాహాబలమున
విదురునిమతమున విశ్రుతంబుగను
వదలక మనమహీవలయంబు నిలిచు."
ననవుడు ధృతరాష్ట్రు కాసుయోధనుఁడు
మనమునదుఃఖించి మఱియు నిట్లనియె :

“ పాండుపుత్త్రులయోగ్య భాగ్యంబు లెఱిగి
యుండునువిదురుండు యుక్తంబుగాను ;
అతఁడేలశకునికార్యములకు లీల
క్షితిలోన నొడఁబడుఁ జింతించి చూడ ?
నుర్వీశ, యిందులకొడఁబడ నేని,
సర్వభక్షకుఁ జేతఁ జత్తునిక్కముగను ;
విదురుండు నీవును వేడ్కనుండుండు
హృదయంబులుప్పొంగి యెల్లకాలంబు.”
నని యడలుగ మాటలాడినఁ జూచి
మనుజేశ్వరుండు కుమారునకనియె :
“ నీకు విచారింప నెఱయంగ వలదు
చేకొని యొకరీతి చేసెద నింక ;
శిల్పకాచార్యులఁ జెలఁగి రప్పించి
కల్పింతు నొకసభ గౌరవంబునను.”
అని ధృతరాష్ట్రుండు నాక్షణంబునను
అనఘాత్ములను శిల్పకాచార్యవరుల
రప్పించి, హాటకరత్నహర్మ్యముల
నొప్పుగాఁ దెప్పించి యుగసరచిత్ర
సన్మణిద్వారదేశములు నిర్మించి
సన్మోదమున నుండు సమయంబునందు,
ధృతరాష్ట్రుఁడొకనాఁడు తెల్లమిగాను
మతిమంతు విదురుఁ గ్రమ్మనబిలిపించి
యేకాంతమున భక్తి నెల్లనుబలికి,
కైకొని శకునియుఁ గౌరవేశ్వరుఁడు
పలికినపలుకులు పరఁగఁజెప్పినను,
కలఁగి వే వివశుఁడై కడువడిఁ దెలిసి

తగఁ [1] గలిద్వారసందర్భంబునగుట
జగడంబు జూదంబు సత్ప్రిజాత్తుయుముఁ
గాఁగలవని మదిఁ గడిమి నెఱిఁగి,
లోఁగుచు నృపునకాలోన నిట్లనియె :

జూదమాడఁదగదని విదురునుపదేశము

" ఇట్టికార్యమునకు నేనోడఁబడను ;
బుట్టును మీఁదను భూరివైరంబు.
పుత్త్రులకెల్లను బోరాటనేల
ధాత్రిఁజేసెదవు చిత్తంబున నెఱిఁగి !
ఇదిమీఁద నొప్పదు ఎన్నిభంగులను ;
వదలక జూదమేపలన నాడినను
ఎట్టిశాంతులకైన నీసులువుట్టు ;
గట్టిగా నీనేర్పుకలిమి నీశకుని
కురుమహీపతుల దుర్గుణములువాపి
కురువంశమెల్లను గోరి రక్షింపు."
మన విదురునిఁజూచి యారాజుపలికెఁ :
" దనయులకేల యుద్ధముసంభవించు ?
నీవును నేనును నీతి [2] మంతులగు
పావన భీష్మకుంభజులుండఁగాను ;
అటుగాన యిందుల కనుకూలమొందుఁ ;
దటుకున నీవు రథంబెక్కిపోయి
ధర్మనందనుని మోదమునఁ దోతెమ్ము
పేర్మితో." ననిపంపఁ బెద్దయు నతఁడు
నేకాంతమున భీష్మకెఱిఁగించియుండె.
ప్రాకటంబుగ ధృతరాష్ట్రుఁడంతటను

1. కలిప్రవేశసమయమని కాఁబోలు కవియూహ ! ' కలి ద్వాపరసమీపంబగుటయు '. అని. నన్నయ. 2. వంతుండు. (మూ)

ఘనతమీఱంగఁ దాఁగట్టించినట్టి
కనకసన్మణిసభ కౌరవేంద్రునకుఁ
జూపి యాతనితోడ సొలవకిట్లనియె :
“ నాపదయగుజూద మాడంగవలదు ;
కలహంబు మీలోనఁ గలయంగఁబుట్టు ;
నిలఁ బ్రజాక్షయమగు నింతమీఁదటను ;
నీవుఁ బాండవులును [1] నెయ్యంబుగలిగి
వావిరి సుఖలీల వర్తించుటొప్పు ;
వలదుజూదంబాడ ; వారిలక్ష్ములకు
నిల నసహింపంగ నేటికినీకు ?
పాపంబుగట్టుకోఁ బాఁడియే నీకు !
నోపికగలిగుండు ముచితయత్నముల ;
వేదార్థవిదుఁడైన విదురున కిదియు
యేదియు సమ్మతంబెంతయుఁ గాదు ;
ధర్మనందనుసంపదకు నెక్కుడైన
భర్మంబు నీకును బసఁ జాలఁగలదు ;
అతఁడుచేసినయట్టి యజ్ఞంబుకంటె
నతివిశేషంబుగా యజ్ఞంబుసేయు ;
భూలోకమునఁగలభూపతులెల్లఁ
జాలంగ సంపద చయ్యనఁదెచ్చి
యిత్తురునీ. ” కన్న నిలనాయకునకు
నత్తఱిఁ గురుపతి యుల్లనఁబలికె :
“ ధర్మజుతోడ జూదంబులాడుటయె
ధర్మయజ్ఞము నాకు ధరణీశలేశ !
అందుమూలంబున నఖిలసంపదలుఁ
జెందుననునాకుఁ బ్రసిద్ధంబుగాను.

1. క్షేమంబులకును. (మూ)

ఇందుఁ గొనను మీఁగవేఁకు చేరంగ
సందున నేఁటుండి మాయాసభ మహిమ
1 చూపింపఁ, బచటి సంశోభితరత్న
వైచిత్రి భావించి వదలి నగుచు
మానిత స్ఫటికల స్థలశిలంబునను
గానక నే జేరఁ గలశాతిజడియు,
నను జూచి భీమాదులు నగియె మిక్కిలిని.
కని ధర్మజుఁడు నాకుఁ గప్ప నంబరములు
పుత్తెంచినను మీఁదఁబున ధరియించి
తత్తరంబున మణిద్వారమని నేఁట
జేరంబు వీక్షించి ధృతి గోనకరుగ,
నాశశిదాంత శిలాగ్రంబుదాఁకి
నాలలాటమునొవ్వ, నను బెట్టునవ్వ
బాలాజనంబు లపారంబుగొల్వ
ద్రౌపది రూపసౌందర్యగర్వమున.
ఆపట్టునను ద్రోవయరయంగలేక
భ్రమసి యేనుండంగఁ, బలితెంచి కవలు
కమనీయ రాజమార్గంబిది యనుచుఁ
దోకొనిపోయిరి; దోరయంగ నట్టి
శ్రీకరసభఁ జూచి సృష్టిలోపలను
బ్రాణంబుతోడను బ్రదుకంగఁజాలఁ.
ద్రోణతోఁ బెద్దలు తద్దయు మిగుల
నవమానమొందిరి; యధములందఱును
బ్రవిమలశ్రీలతో బహుమానములను
బొందిరి యేను భూభువనమెఱుంగఁ;
గుందుచున్నాఁడను గురుతరంబుగను.
.........................
.........................

1. చూచునప్పటికి. (మా)

చేకొనుకంటెను సృష్టిలోపలను
శ్రీకరంబెయ్యది సృష్టీశ్వరులకు ?
నముచిదానవుఁడు కానఁ దపంబుచేసి
యమితప్రతాపుఁడై యలరుటచూచి
ధరణీధరారి యధర్మంబునందు
దురమున వాని నుద్ధురశక్తిఁద్రుంచె ;
నలరినగతి శత్రులగు నాగినెల్ల
నిలనాశనముసేయ నెంతయువలయు.
నధముఁడై యుండెను నధికుఁడై యుండె
నధిగత పరమార్థులగువారు మెచ్చఁ
జెట్టుచుట్టును జనించినయట్టి మేటి
పుట్టచందంబునఁ బొదలుశాత్రవుల
నణఁచంగవలయు బాహాశక్తితోడ.
గణుతింప వ్యాధినిఁగలితౌషధములఁ
జక్కఁబెట్టకయున్న జనులబాధించు
నిక్కువం ; బటుగాన, నెఱయఁ బాండవుల
లక్ష్మి సర్వంబుఁజాలంగఁ గైకొందు
సూక్ష్మమార్గంబునఁ జోద్యంబుగాను.
పాండవేయులలక్ష్మి బహుభంగిఁ గొనక-
యుండినవాఁడు నాయుదరరోగంబు
మానదు పదివేలమార్గంబులందుఁ ;
గాన దీనికి నుపక్రమము గావింపు."
మనఁ గురుపతితోడ నాడెనాశకుని :
" అనుపమంబగు నాగజాశ్వసన్నాహ
మొనరింప, కాజిలో నుభయసైన్యములు
చెనకకమున్నె ప్రసిద్ధంబుగాను
నాయక్షవిద్యను నైపుణంబునను
నీయెడఁ బరధరిత్రీశులలక్ష్మి

నీకొసఁగిప్పించెద ; నెఱయను ధర్మజుని
జోకతో రప్పించెదు ; సుఖాంబునఁబడు
జూదంబునన్ గాని సొలసక్షోణిఁగా
మేదినీరాజ్యంబు మెఱసి నీకొదవు ;
నూరక పాండవేయులతోడఁ గదిసి
పోరాడి గెలువ వేల్పులకశక్యంబు.”
అనువేళ ధృతరాష్ట్రుఁ డావాక్యములకు
నొనరంగ నొడఁబడె కొదవియుట్లనియె :
“ విదురునిమతమున విశ్వభూభాగము
పదిలకసేయుదు వ్రతముగానందు.
జూదంబులాడంగఁ జూచ విగ్రహము
వాదంబుఁ బుట్టును ; వలవదీపనులు.
పాండవేయులతోడఁ బగ నీకు వలదు ;
నిండినవేడ్కతో సిరతలంబునుండుము ;
నామాటద్రోవక పడవునీతులన
వేమఱు.” ననవుడు విని సుయోధనుఁడు
తుది ధృతరాష్ట్రునితోడ నిట్లనియె :
“ విదురుండు పాండుభూమిభుతనూజులకు
హితముగా విహరించు నెప్పుడు ; నతని
మతము సేయకుము సమ్మదచిత్తమునను ;
దలపోయ నెందు జూదము పురాణములఁ
గలదు దోషములేదు గౌరవంబందు ;
దేవలుండటుచెప్పె దిక్కులెఱుంగ ;
దేవతాధర్మంబు ధృతిఁ బడయుదురు ;
కావున శకునికింకను నానతిమ్ము ;
రావించు వడి ధర్మరాజు నిచ్చటికి.”
ననుటయు ధృతరాష్ట్రుఁ డాత్మఁజింతించి
ఘనయుంగ నొడఁబడె నట్టకేలకును.

ఒడఁబడి విదురుని నొప్పరావించి
తడయకిట్లనిపల్కెఁ దత్పరయుక్తి:
“సౌవర్ణ నవరత్నసభ యొనరించి చూడఁ
భావనాతీతమైన పాండవాగ్రజునిఁ
దమ్ములఁ దోతెమ్ము తగిలి చూచుటకి;
నిమ్ముల జూదంబు నీకురురాజు-
తోడ నాడంగ బంధురముగా వలయు
వేఁడు.” అనవుఁడు విని విదురుండు
చకితాత్ముఁడై మదిఁ జాలఁ జింతించి:
“యనిటు బుద్ధెల్ల! పాపాత్మదుర్యాత్మమూఢ
నుభయపక్షమువారి కుగ్రవైరంబు
త్రిభువనంబెఱుఁగంగఁ జెల్లమి యగును.”
.............................

## విదురుఁడు ధర్మజుఁదోడ్తెచ్చుట

అని పెక్కుమాటలు నతిఁ బ్రార్థించి
చెప్పిన, వినకున్నఁ జేసి యావిదురుఁ
డప్పుడు ధృతరాష్ట్రునిమతంబునను
బోయె నింద్రప్రస్థపురవరంబునకు.
నాయెడ ధర్మజు [1]హరిని భీముని
విజయునిఁ గవలను వేడుకఁ జూచి,
నిజమతిఁ జింతించి నెఱిధర్మజునకు
భయభక్తియుక్తితోఁ బలుకనిట్లనియె:
“జయమొసఁగును సర్వేశ్వర, నిక్కలియును
పుణ్యాత్ముఁడవు గుణాంబుధివి లోకమున
గణ్యయశుండవు కారుణ్యనిధివి

1. ద్యూతాహ్వానమునకై విదురుఁడుపోయినపుడు, పాండవులయొద్ద కృష్ణుఁడున్నట్లు వ్రాయుట, వ్యాస నన్నయ భారతవిరుద్ధము.

నీకును నేనుంబు నెఱయ నెయ్యెడను
ఆకల్పముగ." నన్న నాధర్మజుండు
విదురునిఁ బూజించి వేడ్కనిట్లనియె :
"పదవినున్నారము పరఁగ నందఱము ;
నీవు వచ్చినపని యెఱిఁగింపు నాకు
నీ వేళ." యన నతండిట్లనిపలికె :
"తనసభఁ జూడ జూదంబాడ నీవు
చనుదేరఁ బుత్తెంచెఁ జయ్యన నన్ను."
అనుటయు ధర్మజుండటు విచారించి
పనివడి ధృతరాష్ట్రుపంపు మాఱిప్పుడు
చేయక పోఁగాదు చనసియుంకనుచు
నాయతవిధియుక్తుఁడై క్షణంబునను
అనుజులుఁ దానును ఆద్రౌపదియును
ఘనుఁడు ధౌమ్యుండాదిగా బుధశ్రేణి
యుఁ దేర నిభపురికేఁగె నెయ్యమున.
నాతఱి భీష్మ ద్రోణాచార్య శల్యుఁ
కృపుని నశ్వత్థామఁ గీర్తి భానుజునిఁ
దపనతేజుని సుయోధను భక్తిఁ జూచి,
యాసభాస్థలియందు నాధృతరాష్ట్రు
భాసురయశుసిఁ [1] బ్రతాపవర్తనుని
గనుఁగొనఁ దారకాగణములలోన
నొనరిన రోహిణీయుత సుధాకిరణుఁ
డుండినకైవడి నొప్పు గాంధారి
పుండరీకాక్షి సంపూర్ణేందువదన
తోడుగ సుఖలీలదొరయుంగనున్న
ప్రోడను రాజన్యపుంగవుఁ జూచి

1. ఘాత. (మూ)

దండప్రమాణంబు తగనాచరించి
నిండినభక్తితో నెఱినుండుతఱిని
........................ ...
..........................
ఇందీవరాక్షిని నిభగాజగమనఁ
గుందేందురుచిని సద్గుణగణశీల
నలినీలవేణిని నబ్జసంభవుఁడు
చెలువుగా జగములఁ జిత్రంబుగాను
శృంగారలక్ష్మిగాఁ జేసె నేరుపున ;
నాంగికమైన యాయంగనఁబోల
సతులులేరని చాలసన్నుతిసేయు
చతురతనొప్పు నాసమయంబునందు.
అంతఁ బాండవులును నాదినంబునను
సంతోషచిత్తులై సంభ్రమంబునను
ఆసీనులై యున్న యాసమయమున
నాసుయోధనుఁడు దా నప్పుడిట్లనియె :
"ధర్మనందన, నీకు దాక్షిణ్యనిధికి
ధర్మవర్తన వినోదంబు జూదంబు ;
ఆడుద" మనవుడు నతఁడునిట్లనియె :
"నోడక జూదమిట్లొగి నాడవలదు ;
జూదంబు వాదంబు సుజనఖేదంబు ;
..........................
ఇదిదోషమూడంగ నేపారవినుము
పదహీనులగుదురు బహుళదుఃఖములఁ
బొందుచుండుదురు భూభువనంబునందు.
నందందు ధరణి మాయాద్యూతమునను
అడరంగఁ బాతకంబంద్రు మానవులు ;
ఎడర ధర్మద్యూత మిరవొందఁజేయు

గురు భీష్మ కృప శల్య కుంభజపుత్త్ర
సరసిజహితసూను సౌబలాదులును
ధృతరాష్ట్రవిదురులు తేజంబునందు
ధృతిఁజూచుచుండిరి తెరలకయుచట.
బద్ధమత్సరుఁడై ప్రభావంబునందు
సిద్ధంబుగా యుధిష్ఠిరుఁడు నయ్యెడను
గనకనిష్కంబులు, ఘనపురంబులును,
అనుపమ దివ్యవస్త్రానీకములును,
మరకత హారినీలమణి పద్మరాగ
వరవజ్ర మౌక్తిక వైడూర్య పుష్య-
రాగ గోమేధిక రత్న ప్రవాళ
నాగేంద్రమణులు, భాండాగారములును,
గలిత పంచద్రోణ కాంచనసహిత
1 నలినమందిరపూర్ణ నవనిధానములు,
మాణిక్య కింకిణీమాలికానేక
బాణ తనుత్రాణ బహురూపములును,
ధన్వవరూథయూథములు, సువర్ణ
మాన్యఘంటాధ్వాన మదసింధురములు,
నమిత వినూత్న రత్నాభరణములుఁ,
గమనీయ నిజసభాగ్ర సమగ్రపాత్ర
పాణులై యొప్పెడు పరిచారకులును,
క్షోణీధరారాతి సుతునకు చిత్ర
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
అజ మేష గో మహిషానీకములును,
రజతపాత్రంబులు, రత్నాంబరములు,

---

1. పద్మాదినవనిధానములని కాఁబోలు కవియూహ.

నానాఁటఁ గక్కఱయుద్ధుఁ నోడిసఁ, జూచి
తక్కక విదురుండు ధర్మసూనునకు
వగచి యాధృతరాష్ట్రవసుధేశునకనియె:
“ జగతియందును గురుక్ష్మాతలేశ్వరుఁడు
దోషంబులకుఁబుట్టు దుర్నిమిత్తములు
ఘోషతోఁబుట్టెను గోచరంబుగను.
దశదిశలను సుకృతమునొందినట్టి
శశివంశజుండైన శంతనుచక్ర-
వర్తికులంబున వసుమతియందుఁ
గీర్తిపొందని కురుక్షితిపతిపుట్టి
సకలపాపంబులు సంభవంబొందెఁ;
బ్రకటితముగ మీఁద ప్రళయంబుతోఁచుఁ;
గులమునకును నెగ్గు గొనకొనపుట్టు
సిలలోన నిప్పాడే యాతనికతన.
కులనాశకుఁడగు దుర్గుణుని దుర్మదుని
వలదనివారించి వంశరక్షణము
చేయుఁగాసగు నంచుఁ జెప్పెశుక్రుండు.
పాయక యటుగాన, పాలించుకులము;
యదు వృష్ణివీరులు వారి నియోగించి
ముదమునఁ దమకులంబునకును మిగుల
దూషకుండగు కంసుఁ దునిమించి శౌర్య
భూషణులైరి భూభువనమెఱుంగ.
వాసవసుతు ధర్మవర్తనుఁ బనిచి
రాశి జూదము నివారణముగావింపు;
జనవిగ్రహము మాన్పి సత్ప్రధానులకు
ననుకూలమొనరించు మద్భుతంబుగను;
మనుజాధముని దుష్టమానసు శకుని .
ఘనబహిష్కృతుఁ జావకలితు దుర్మార్గు

నీతిదూరుని లోకనిందితుఁ గుజను
జాతరోషుని దురాచారుఁ గ్రూరాత్ము
దుర్యోధనుని దుర్మదుని నివారించి
యోగ్యసమ్మతమున నన్నియుం బెల్ల
రక్షించు ; నగఁ బాండురాజనందనుల
లక్షణాజ్ఞుల సముల్లాసచిత్తులను
ధీరుల మన్నించి ధృతరాష్ట్ర, నీవు
ధారుణిఁ బాలించు ధర్మమార్గమున.
వినుము శృంగారంబు పెనఁగొనియున్న
ఘనసభోత్తుంగ ప్రగల్భద్యూతమున
సంగరమునకై నయంబునఁ గొల్చు
వెంగలియై వడి వీఁగ కింతయును
సమకట్టె లోభవశంబునఁ జాల
ఈ మతి నీతనయుండు కురుకులేశ్వరుఁడు
పాండునందనులను బరఁగఁ గల్మషము
నొందొంద....................
అసమసాహసులతో నాజి సేయంగ
మసలుచున్నాఁడు మదమునఁ గదిసి.
తరమెఱుంగక ప్రల్లదంబున వీఁడు
మొఱయుచున్నాఁడు మొక్కలంబునను.
కురుకులక్షయకారి గుణవిహీనుండు
దురితాత్ముఁ డీతనిఁ దొలుత వారించి
సృష్టీశ, యిఁక నుపేక్షింపక నీవు
దృష్టంబుగా చూన్ను తెలివి జూదంబు
బుద్ధిగా." దనవుడుఁ బుత్రమోహమున
సిద్ధంబుగా నొండు సేయంగలేక
యూరక ధృతరాష్ట్రుఁ డుండెఁ జిత్తమున ;
నారయ విదురుండు నానుబోధనుని-

## విదురుఁడు దుర్యోధనుని దూషించుట

తోడనే పలికె నుద్ధురరౌద్రమునను :
“ ఓడక యుష్మ్కరిక్రొంటిగట్టినట్టి
పాతకుండవు ; గుణప్రకటశూన్యుండవు ;
నీతిదూరుండవు నిందితాత్ముండవు ;
అన్యాయమున జూదమాడెద వేల !
మాన్యులు బుధశిరోమణులు దూషింప.
ప్రకటసౌబలుని మామ మాద్యూతమునను
సకలభూపాలైకచక్రేశులైన
పాండుకుమారుల బహుళసంపదలు
దుండగంబున నీవు తోలుగ్గొనిన
నవ్వరా నిన్ను నానాజనంబులును !
నవ్వనిగా.” నన్న మతి సుయోధనుఁడు
విదురునకలిగి యావేళ నిట్లనియె :
“ ఎదిరితలంపు నీ వెఱుఁగవేనియును ;
పరులగుణంబులు పలుమారు నీవు
వరుసఁ గీర్తింతువు వాచానురక్తిఁ ;
పరఁగ పాండవపక్షపాతివి ; కపట
నిరతుండవై మహానిష్ఠురత్వమునఁ
గుడిచినయింటికే కీడుచదంచి
యెడపక ద్రోహంబు లెప్పుడుఁ జేసెదవు ;
[1] క్రూరోరగముభంగిఁ గొసరక నీవు
ఆరయఁగా విఘ్నమాచరించెదవు ;
పరులసంపద సుఖోపాయంబునందు
వైరమారఁ గొనుట భూవిభులకున్నల్ల

1. ఉత్సంగతలమునం దుగ్రవిషోరగంబున్నట్లు నీవు మారొద్దనునికి. అని నన్నయ.

నైజంబుగాదె నానా ప్రకారమున !
భూజనసుత, నాకు బుద్ధి తోఁచియును
జెప్పకుండుము మతిచేసెద నిన్ను ;
నెప్పుడు ధర్మజుహితము కోరెదవు. ”
అనుచు దుర్యోధనుఁ డనఁగ విదురుండు
కనలి యిట్లని పలికెఁ గడు నొవ్వఁ బలికి :
“ చెడుబుద్ధి నీకును జెప్పినవారి
చెడుమాటలే వినవే యెఱుఁగక,
మాయపట్టినవారలమాటలు వినక
నీయట్టివారలు నేర్తురే కొలఁది !
కొంకక నీయట్టి కుటిలమానసులు
బింకపుమాటలే ప్రియములై యుండు ;
నీకుఁ బ్రియంబుగా నెరవైనమాట
నాకునాడఁగ రాదు న్యాయంబుమాని.
పగగొని శౌర్యతోడ బలములఁ గూర్చి
తెగి తేజమునఁ బోరి ధీరులసరులు
రాజులు జయమున రప్పింతురేని
దేజంబుఁ గీర్తియు ధృతియును మించఁ.
నాతలనవ్వరు నగకుండ రాజ,
నీతిచెప్పితి నిది నీకింపుగాదు ;
పథ్యంబుగాఁ గొనరు పాపమానసులు
తథ్యంబుగా సభ్యతతులు పల్కినను.
ప్రియభాషణములను ప్రియము సేయుదురు
నయవివర్జితులు [1] వినాశకాయువులు.
కాన సజ్జనులు దుష్కార్యవంతులకు
నేనాఁటఁ జెప్పరు హితబుద్ధులెల్ల.

1. క్షీణాయుష్కులనునర్థములో నపశబ్దముఁ బ్రయోగించియుండును.

మొనల నప్రియములై మునునీతోఁచి
తుదిఁ [1] ప్రియంబులగు హితభాషణములు.
తగువు లెక్కింగను దాసులు వారలుఁ;
వెరలక నదులీఁదఁ జెప్పలు గారు;
సమరులకైన సహాయంబు వలయు
రమణ నొండొరులకు [2] రాజమంత్రముల.
ఎంతబుద్ధులు నీకు నేనిఁ జెప్పినను
సంతయు నీకును నప్రియంబయ్యె.
చిత్రయశుండు నా విచిత్రవీర్యునకుఁ
బుత్త్రుండవు నీతివిస్ఫూర్తిశీలుఁడవు;
నన్నునాదరము మిన్నకఁ జేసి కినిసి
యెన్ని దుర్భాషల లెగసి యాడితివి!
తరమెఱుఁగక పాండుతనయులతోడ
దొరయని జగడంబు తుదిఁ జేసికొంటి.
బ్రదుకుదుగాకేమి ప్రాణంబుతోడఁ;
గాదలేదు నీబుద్ధి కుంభినియందు."
అని విదురుఁడు వికలాంగుఁడగుచు
జననాయకుని సభాస్థలిని నుంచుకొని,
శకుని ధర్మజునితో సరసినట్లనియె:
"సకలసంపదలును నరపి నోడితివి;
రాజశేఖర, ధర్మరాజ, రాజాధి
రాజ, రాజశశాంక, రాజానురేశ,
యింక నేమిటినొడ్డి యిప్పుడు జూదంబు
శంకింపకాడుదు సంభ్రమంబునను?"
అనిన ధర్మతనూజుఁ డపనీతిలంబు
ఘనరంగనొడ్డి యాతనితోడ ననియె:

1. ప్రియంబులై యుండు దూషభాషణలు. 2. రాజతతులు. (పూ)

## ధర్మజుఁడు సర్వస్వము నోడుట

" దేవతాసీమలు దీపించు విప్ర
భూవలయంబును బుధపురంబులును
గుడ్డవృత్తులుఁదక్కఁ గుంభినియెల్ల
దొడ్డగాఁగైకొను దొరంబుగాను
ఈజూదమాడి నేనిప్పుడోడినను
రాజితంబుగ. " నన్న రయమున శకుని
ధర్మజుతోడ జూదంబాడి గెలిచి
పేర్మితోఁ గైకొనెఁ బృథివీతలంబు.
వెండియు నొడ్డిన, విపులార్థములను
మండలాధిపుల సామంతభృత్యులను
దమ్ముల నత్యంతధర్మవర్తనుల
సమ్మదచిత్తుల సాహసాధికుల
నభిమానపురుషుల నర్కతేజులను
బ్రభుశేఖరుల జగత్ప్రఖ్యాతయశుల
సత్యవాక్యుల నాదిజగదీశనిభుల
సత్యోత్తముల సుగుణాంబురాసులను
బవమాననందనుఁ బర్జన్యసుతునిఁ
గవలను నోడెఁ దక్కక ధర్మసుతుఁడు.
వివరింపఁ దన్నును వేగంబ యోడెఁ
దవిలి యుండంద ద్యూతవ్యసనమున.
ఆవేళ శకునియు యమనందనునకు
భావించి పలికెను బటుశఠత్వమున :
" ఓ రాజశేఖర, యో ధర్మతనయ,
వారక యోడితి వలయునర్థములు ;
కమలాక్షి పాంచాలకన్యక రూప
రమణీయ సంపూర్ణరాజబింబాస్య

నలువొప్ప నీదు ధనంబు గావునను
దలఁకక యొడ్డి జూదంబాడు." మనిన
'నవుఁగాక' యని జూదమాడి ధర్మజుఁడు
ధవళలోచన సాధ్వి ద్రౌపదినోడె.
వెసనోడి మిక్కిలి [1]వికలాత్ముఁడగుచు
ననసహాయుఁడై దుఃఖమునధికుఁడై యొదవ
వాఁడి యాననసాంభోరుహంబువంగా నిలిపి
తెరంగు సర్వంబుఁ దృణముగాఁ దలంచి
పాండవాగ్రజుఁడంతఁ బరతత్త్వబుద్ధి
నుండంగఁ, గృపుఁడును ద్రోణుఁ గుంభజుండు
గాంగేయుఁడును గుణాకరు ధర్మసుతుని
నాంగిరసుఁ గనుఁగొని యధిక శోకమునఁ
దద్దయుఁ బొగులుచు దగిలుండి రంత
నెద్దియు ననలేక హీనస్వరములఁ.
విదురుండు మిక్కిలి విముఖుఁడై కలఁగి
మదిలోన శోకాగ్నిమగ్నుఁడై యుండె.
ఆసభవారు బాష్పాంబుపూరములు
వే సముద్రముభంగి వెల్లియై నిగుడఁ
గుపితదుఃఖముల నెక్కొని యుండిరపుడు.
అపుడు భూతాక్రోశమయ్యె నయ్యెడను;
అగుటయుఁ గర్ణుండు నాశకునియును
అగణితదుర్గుణుండా సైంధవుండు
దురితశరీరుండు దుశ్శాసనుండుఁ
బరమానురాగులై బలసి యొండొరుల
మొగములు చూచుచు ముచ్చటలాడి
నగుచుండి రచట నానాప్రకారముల.

1. వికలచిత్తుండగుచు. (మూ)

ధృతరాష్ట్రుఁడును సభఁ జిక్కిన యవము
నతిభంగి విదురుని నడిగె గ్రక్కునను :
"ఎవ్వరేమివిధంబు లిటయాడి రనప
నెవ్వరోడిరి ? నాకు నెఱిఁగింపు." మనిన
నన్నరపతితోడ నతఁడిట్టులనియె :
"అన్న, యీశకుని మాయాద్యూతమునను
సకలార్థములునోడె శమననందనుఁడు.
[1] వికలులై పాండుభూవిభునందనులు
దీనతనున్నారు తెలిసి లేకిపుడు
మానుగా." ననుచుఁ గ్రమ్మఱఁ జెప్పుచుండ
నావేళఁ గురుపతి హర్షంబుతోడఁ
బావనమతులైన పాండు [2] నినుతుల
దాసులగాఁ గెల్చి తారతమ్యంబు
వాసి దలంచక విదురునిట్లనియె :
"పరవుల్లఁగలిసి నివాసంబు దుడువఁ
దగ శాత్రిఁ దన్వంగి ద్రౌపదినిపుడు
వేగంబె తోడ్తెమ్ము విదుర, నీ." వనిన
నాగుణాంభోరాశి సుతునికిట్లనియె :
"నీనిష్ఠురతకును నీపాపమునకుఁ
గానంగఁజాలుదు కష్టవర్తనము ;
దుర్జనుండవు మహాదురితదేహుఁడవు
వర్జించు నిన్ను నైశ్వర్యంబు ; మీఁదఁ
జెడుదువు నీవును సిద్ధంబుగాను.
పుడమియేలెడు పాండుపుత్త్రుల సాధ్వి
యగుద్రౌపదిని నేలయవమానమిపుడు
తెగువఁ జేసెదవు ధాత్రీశులుదిట్ట !

---

1. వికలవ్యులై. 2. భూపతుల. (మూ)

పాండవేయుల మాత్స్మి పగఁగిఁ గ్రొవ్వొంది
యుండఁగంబున నృపస్తోమంబు నగఁగ.
ప్రకటంబుగా నీతిపాపస్వభావు
శకుని మాటలు వినఁజనునె నీకెంతు!
ఈజూదమున నీకు నెగ్గుఁ బుట్టు
నిజగంబున." నన్న నేది యంతటను
దుర్యోధనుఁడు సహోదరు గర్వాంధుండు
నార్యజ్ఞుఁ గని ప్రాతికామికిట్లనియె:

## ద్రౌపదినిఁ దోడ్తేర దుర్యోధనుఁడు ప్రాతికామినంపుట

"విదురుఁ డెప్పుడు పాండవేయుల మెచ్చి
మొదలనుండియుఁ బక్షమునఁ జరియించు;
వెఱచు; నీవేఁగి యా వెలఁది ద్రౌపదినిఁ
దఱిఁగొనిడఁ దోతెమ్ము తడయక." యనినఁ
ప్రాతికామేఁగి ద్రౌపదికినిట్లనియె:
"నాతి, నీపతి ధర్మనందనుఁ డిపుడు
ధార్తరాష్ట్రునకు జూదంబాడి మిగుల
మూర్తి శోషిల్లఁ దమ్ములఁ దన్ను నిన్ను
సర్వార్థముల నోడె జగమెల్ల నెఱుఁగ.
దుర్వివేకమున నా దుర్యోధనుండు
నిన్ను దోడ్తెమ్మని నిష్ఠురత్వమున
నన్ను బుత్తెంచెను [1] నడుఁగకి రమ్ము."
అనుటయుఁ బాంచాలి యతనికిట్లనియె:
"మును కొన్ని యేయుగంబులయందునైన
భార్యనోడినయట్టిభర్త గాఁగలఁడె!
యార్యోక్తిగాని యీ యాలాపమిపుడు

1. నడుగక. (మూ)

విననపూర్వంబగు నట్టి విశ్వధారుణిని ;
జెనసి ధర్మజుఁడిట్లు సేయుఁగాఁదోకో !
ఇయ్యను గనునోడి ధర్మప్రవృత్తి కోడ (?)
పనసోఁబసబుట మొన్నఁగ సిరిసజమొ !
కట్టరయో !” అనుచును కడుసంశయమున
నెల్లగాసికి నాతియుట్లనఁబలికె : (?)
“ధర్మనందనుని మాటంబునకుఁ బడిగి
పెద్దఁ దత్సభకును కెంపుఁదీపింపఁ
దోడ్కొని పో.” మ్మన్న ప్రతి వాఁడునరిగి
ప్రాకటంబైన ద్రౌపదిపల్కులెల్ల
ధర్మనందను కెంతయు నెఱిఁగింప,
ధర్మదేవతను జిత్తమునందు దలిపి
యధికచింతాక్రాంతుఁడై యుండుటయును,
అధముండు దుర్మార్గుఁడగు సుయోధనుఁడు
ప్రాతికామికి నతిత్వరత నిట్లనియె :
“నీశక్తి సభవారలిందఱు నెఱుఁగ
ద్రౌపదిఁదోడ్కొని కడయుక రమ్ము
నైపుణ్యమున.” నన్న నలి వాఁడునరిగి
పాంచాలితోడఁ దప్పక యిట్టులనియెఁ :
“జంచలలోచన, ధర్మనందనుని
నడిగితి ; సభవారు నటువిచారించి
వడి నిన్నుఁదోడ్కొని వరుస రమ్మనుచు
నన్నుఁబుత్తెంచిరి నలినాక్షి !” యనిన
నున్న యాద్రౌపదియును దలపోసి
దుర్మార్గుఁడైనట్టి దుర్యోధనుండు
ధర్మంబుదప్పినతలఁపునకపుడు
ధర్మనందను సమ్మతమునకు వెఱచి,
ధర్మస్వరూప యాద్రౌపది కడఁగి

ఏకవస్త్రముఁగట్టి యొంటియుఁ జాల
శోకాకులత నొంది సుఱుసుఱుమనుచుఁ
గబరీభరము జాఱఁ గన్నీరు గాఱ
సొబగు దేహము గందఁ జూన్యత పొంద
వాతెఱ యెండ భావము డూలియుండ
భీతిమిక్కిలి పట్టఁ బెనుదగ దొట్టఁ
జెమట మేనునఁ బుట్టఁ జింత దాఁ బుట్ట
భ్రమ చుట్టుముట్ట నాపద్మాఁకు తాత్మ
యరిగి యాకురువృద్ధు నాస్థానమునను
దరలత్వమున నుండెఁ ద్రౌపది; యంతఁ
బాండునందనులు ద్రౌపదిఁ జూడలేక
నిండిన లజ్జతో నిబిడదుఃఖముల
మోముదమ్ములు వాంచి ముఖముద్రలు పడ
నేమియు ననలేక యిట్లున్నయెడను,
బాండవేయుల దైన్యభావంబు చూచి
నిండినమదిఁ గురునృపకులోత్తముఁడు
సహజన్ముఁడైన దుశ్శాసనుఁ బిలిచి
బహుమానమొనరించి భక్తి నిట్లనియె:
"ఎఱుక యించుకలేక యీప్రాతికామి
వెఱచు భీమునకును; వేడ్క నీవేఁగి
ద్రౌపదిఁ దోతెమ్ము తత్క్షణంబునను

## దుశ్శాసనుఁడు ద్రౌపదినిఁ దలపట్టి యీడ్చుకొనివచ్చుట

. ఏపార." ననవుడు నంతయు నతఁడు
చనియెను ముదమున సంభ్రమంబునను.
మునుకొని యంతట మొగిద్రౌపదియును
దురితాత్ముఁడై పట్టి దుశ్శాసనుండు
విరసుఁడై కొనిపోవ వే వచ్చుటెఱిఁగి

గాంధారికడకేఁగఁ గడుభయంబునను,
బంధుర సద్గుణాభరణమైనట్టి
యాకృష్ణపిలుఁడున నరిగియిట్లనియె :
" నేకచిత్తమున నీవచటికేఁగెదవు !
కొంకక చనుదెమ్ము కురురాజసభకు
శంకింప ; కున్నతి శకునిజూదమున
ధర్మనందనుఁడును దను నిన్నుఁ దనదు
కూర్మిసోదరులను గొనకొని యోడె ;
నలివేణి, కురుపతియర్థంబవైతి ;
వలయుని యేతెమ్ము హర్షంబుతోడ."
ననుచు డాయఁగవచ్చుటంతయుఁ జూచి
వనజాక్షి ద్రౌపది వానితోననియె :
" నేనురజస్వల ; నేకవస్త్రంబు
పూని కట్టినదానఁ ; బుణ్యచరిత్ర ;
ననుముట్టఁగా నీకు న్యాయంబుగాదు ;
గొనకొని యొక్కింతగుణము గ్రహించు ;
మానాభిమానంబు మదిలోన విడిచి
మానిత కురువృద్ధమండలేశ్వరుల
ఘనసభాస్థలికెట్లు కడఁగిరానేర్తు ?"
ననిన ద్రౌపదితోడ నతఁడిట్టులనియె :
" ఏకవస్త్రంబు నీ వికఁగట్టితేమి !
యేకవస్త్రముఁ గట్ట కికనుండితేమి !
యేకాత్మతోడ నీవేఁగుదెమ్మిపుడు ;
రాకున్న నిన్ను సంరంభంబుతోడ
బలవంతమునఁ దత్సభాస్థలంబునకు
నెలమిఁ గొంచునుబోదు నిదినిశ్చయంబు."
అనవుడు ద్రౌపది యతనితోఁబలికె :
" విను, ధర్మమార్గంబు వివరింపు ; నన్ను

మును [1] బలాత్కారమున గొనిపోవ
జనునె నీచుఁడు రాజసభలోఁ బలికిన ! ”
అంచును బలికిన, నాగ్రహంబునను
వంచనలేని దుర్వారసత్త్వాన
దురితశరీరుండు దుశ్శాసనుండు
తరుణి నుత్తమసాధ్వి ద్రౌపది దేవి
సతిరాజసూయమహాధ్వరాంతమునఁ
జతురావభృథమున జగతీశుతోఁ గ్ర
వేదమంత్ర పవిత్ర పుణ్యోదకములఁ
బ్రోదిఁ బానసములై పొలుపారునట్టి
యసమానఘనశిరోరుహంబులఁ దాసిఁ
దలపట్టి యీడ్చి యుద్దండతఁ దెచ్చి
నోడక సభకు నార్యులు చింతనొందఁ
జూడంగ నధికనిష్ఠురవృత్తి మీఱి
గాలిఁదూలినయట్టి కలితపతాక
పోలె దుశ్శాసనుభూరిహస్తమునఁ
బట్టంగఁబడి కృష్ణ [2] పటుకీరవాణి
నెట్టన భీతితో నెఱిఁ గర్ణశకుని
సైంధవ కురురాజ సభకు నేతెంచి
బంధురకోప నిర్భరలజ్జలందు
నాసభవారికి నప్పుడిట్లనియె :
“ రాశికెక్కిన ధర్మరాజు ధన్యుండు
దైవయోగమున జూదంబున [3] నోడ్డి
భావింప నటపోటుపడియుండుఁగాక ;
ధర్మంబు దప్పునే తనువుపోయినను !
ధర్మాత్ములార, సత్యవ్రతులార,

---

1. బలవత్కారమున. 2. పటికీర్ణవేణి. 3. నోడి. (మూ)

సాహసాధికులార, సభవారు వినుఁడు;
ద్రోహియైనట్టి యీదుశ్శాసనుండు
పాతకుండై రోషభాషణాలాపి
నీతిదప్పి త్రిలోకనిందితుండగుచుఁ
దలవట్టి యీడ్చుక తద్దయువచ్చెఁ ;
దలఁపంగ నిది యుచితంబు గాదని
యూరకయుండుట యుర్విధర్మంబె !
యారయు నో కరుణాంభోధులార ! ”
యని ‘ భరతాన్వయం బకట నిర్మూలమయ్యె,
ననుమాన మింతలే ; ’ దని కృష్ణుఁ దలఁచు,
భయమందె ద్రౌపది పర్వేందువదన.
నయమున నప్పుడు నీరజలోచనుండు
కరుణించి ద్రౌపదిఁ గడుసంభ్రమమున
నరసి రక్షింపంగ నాత్మలోఁ దలఁచె.
అపుడు త్రిలోకజయప్రతాపములఁ
నుపమవర్తింపుచునుండెడు పాండు-
రాజనందనుల పరాజయంబెల్ల
రాజతారుణనేత్ర రాజీవములను
వీక్షింపుచుండిన వెలఁదిఁ బద్మాక్షి
నీక్షించి దుఃఖించి యెంతయుఁ గనలి
పాండవాగ్రజునితోఁ బవనజుండనియె :
“ కొండలఁబోలిన కుంజరంబులను
జవహయంబుల రత్నసముదయంబులను
వివిధభూషణ వస్త్రవిసరంబు ధనము
సర్వసామ్రాజ్యంబు సకలార్థములను
బర్వేందువదనల బాణాయుధముల
నొగి మమ్ము నోడిన నోడితిగాక,
యగణితంబైన మాయాద్యూతమునను

దుశ్శాసనుఁడు, దురాత్ముఁడును సుయోధనుఁడు
దుశ్శాస[1]నస్థులై దుష్ట[2]వర్తనలఁ
బాండవేయులను ద్రౌపదిని నీభంగి
నొండొండయవమాన మొనరింపుచుండఁ
గెంపుతో మీర లుపేక్షింపఁదగునె!
సంపూర్ణచిత్తులు సభికు లుత్తములు
గాంగేయ ధృతరాష్ట్ర కలశజ కృపులు
నింగితజ్ఞులు లోకహితదయాపరులు
పలుకకయుండంగ [3]భావ్యమా మీకుఁ!
దలఁపఁ దక్కనసభాస్థలిలోనివారు
మహిత కామక్రోధ మదలోభములను
మహిలోనఁదక్క నిర్మలచిత్తులగుచు
సభిక ధర్మము పల్కఁ దఖిలంబు నెఱుఁగ ;
బుధనుతులార, సత్పుణ్యాత్ములార,
మీరూరకుండిన మెఱసి యేనొకటి
కోరి ధర్మంబుగైకొని యెఱింగింతు ;
‘పరికింప జూదంబుఁ పానంబు వేఁట
పరుషోక్తులును బహుభక్షణాసక్తి
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
ధారుణి ధర్మంబుదప్పి వర్తిల్లు
వారికృత్యంబులు వర్ణింపఁదగదు ;
మాయజూదంబున మఱియొడ్డినట్టి
యాయుధిష్ఠిరునకు ననిలజపార్థ
నకుల సహదేవ నరవరేణ్యులకుఁ
బ్రకటిత సత్కులభామయైనట్టి

1. నస్థులు. 2. వర్తనులు. 3. బాధ్య. (మూ)

లోకంబులో నొకలోలలోచనకు
నేకభర్తయె కాక, యీపాపభామినికి
నేవురుభర్తలు! ఇది దూషితంబు;
భావింప దీనిని బంధకి యండ్రు;
అట్టిదానిని విగతాంబరఁ జేసి
గట్టిగాఁ దెచ్చినఁ గలుషంబు లేదు."
అనుచుఁ గర్ణుండు దా నావికర్ణునకు
ననుపమప్రతిభాషలాడు నా వేళ
పెరిమ దుశ్శాసనుఁ బిలిచి [1] యిట్లనియె:
"పరవీరవిజయుల పాండునందనుల
వలువలు, ద్రౌపదీవస్త్రసంఘమును
ఒలువుఁడు భయమంద నుగ్రంబుకోడ."
ననిపంచినను వాఁడు నట్లకాకనుచుఁ
జనుదెంచినను, బాండుజననాథసుతులు
అలఘు మాయాద్యూతమందున నోడి
బలిమి రోమియు లేక పైవస్త్రతతులు
మును బెట్టి యాసభమ్రోల నుండుటయుఁ,
జెనసి యుద్ధతి దుస్ససేనుండు ద్రుపద-
రాజతనూభవ రాజితాంబరము
రాజసంబున నొల్వ రమణ డగ్గఱిన,

### ద్రౌపదీమానసంరక్షణము

నా వేళ ద్రౌపది యతిభీతి నొంది
భావజజనకునిఁ బద్మలోచనునిఁ
గరిరాజవరదునిఁ గారుణ్యనిధిని
బరమాత్ము నచ్యుతు భక్తవత్సలుని

1. దుర్యోధనుఁడు కర్తఅధ్యాహార్యము.

వేదాంతవేద్యుని విమలాబ్ధిశయను
నాదినారాయణు నాద్యంతరహితు
సర్వభూతాత్మకు సర్వలోకేశు
సర్వగీర్వాణాబ్జసంభవ వినుతు
శరణాగతత్రాణు సకలకల్యాణు
మురదైత్యహరణుఁ బ్రమోదవిస్ఫురణు
ద్వారకాపురివాసుఁ [1] దరళితోల్లాసు
ధీరుని రవికోటితేజిష్ణుఁ గృష్ణుఁ
జిత్తాంబుజంబునఁ జింతించిపలికె :
"సత్తుగా నిన్ను నే శరణువేఁడితిని
ఘన మనోవాక్కాయకర్మంబులందు ;
ననిశంబునిన్నకా కన్యమెఱుంగ ;
నీమహాదాపద కిటనీవెదిక్కు ;
స్వామి, సర్వేశ్వర, సత్కృపాంభోధి,
కావంగఁ బ్రోవంగఁ గర్తవునీవు ;
ఈవేళ నను బ్రియంబెసగ రక్షింపు ;
భద్రేభవరద, హా ప్రహ్లాదవరద,
యద్రీంద్రధర, రావణానుజవరద,
మానుగా నాయభిమానంబు గావు
మానితంబుగ ననుమానంబులేక."
అని సన్నుతించిన, హరియు సత్కృపను
వనజాక్షి ద్రుపదభూవరతనూజకును
అక్షయవస్త్రంబు లఖిలంబు నెఱుఁగఁ
దత్క్షణంబున నిచ్చెఁ దాత్పర్యమునను.
అట దుస్ససేనుండు నాగ్రహంబునను
దటుకునఁ గదిసి యాద్రౌపదిచేల

1, దరళి. (మూ)

పట్టిరియొల్లంగ, నా భామినీమణికిఁ
బట్టుచీరలు వెలిపట్టుచీరలును
దట్టపుఁబులిగోరుతగముచీరలును
జట్టుభవంతులుసారిదిచీరలును
చెల్లాకువన్నెలుజిలుగుచీరలును
నల్లగంటుకులు సన్నంపువస్త్రములు
కస్తూరిమల్లును గందుచీరలును
విస్తారమగు తమ్మివిరులచీరలును
రుద్రాక్షవన్నెలు రూఢిమైనొప్పు
భద్రాక్షవన్నెలుఁ బవడంపువన్నె
గలరాసులాదిగాఁగలిగినయట్టి
లలితవస్త్రంబులెల్లను జాలఁగలిగి
కొండలపొడవులై కుంభినిఁబడఁగ
నొండొండ వస్త్రంబులొలువంగ నలసి
యధికలజ్జాపరుండై మాని పోయె
శిథిలంబుతో దుస్ససేనుండు కణఁగి.
ఆవేళ ద్రుపదరాజాత్మనందనను
వావిరిఁ గురుమహీవరునిసోదరుఁడు
దుస్ససేనుఁడు మహాదురితవర్తనుఁడు
నిస్సంశయంబున నెఱి వల్వలొలువఁ,
గనుఁగొని భీముఁడాగ్రహమున నొదవి
వనధిపైఁగినిసిన వనజాప్తకులుని
చెలువునఁ బురములు చెనకిననాఁటి
జలజాక్షుబాణంబుచందంబునందు
నతిభయంకరలీల నరుణాక్షుఁడగుచుఁ
బ్రతిభట భయదదండపాణియుఁ బోలె
దంతసందష్ట దారుణముఖుండగుచు (?)
నంతట సభవారలందఱు వినఁగఁ

బలికె మారుతి ప్రతాపమున నుప్పొంగి :
“కలబాంధవులు కురుక్ష్మాపతి చూడ
సమరరంగమున దుశ్శాసనుఁ బట్టి
క్రమముతో వానివక్షస్స్థలి చించి
రాజిత రుధిరధారలు క్రోలి క్రోలి
తేజంబుతో వాని దేహాంతరంబు
ప్రేవులుఁ జీరెద భీషణంబుగాను
దేవకోటులు ప్రస్తుతింప రౌద్రమున ;
చెనసి వానిని నిట్లు సేయకుండెదనేను,
దనరంగఁ బితృప్రపితామహులకును
దప్పినయాదురితము నొందుదు నేఁడు ;
నిప్పుడు తత్త్వార్థ మీనాదు మాట
సందేహమును లేదు జగతీతలమునఁ
జెందుగా.” యని మహాద్భుతశౌర్యమునను
మిగులుటయును జూచి మించి యాసభను
మగఁటిమిగల కురుమండలేశ్వరుఁడు
నమితభయభ్రాంతుఁడై యుండె ; సంత
రమణతో నాధృతరాష్ట్రు నిందించి
పెరిమఁ బాంచాలి నుపేక్షించుచున్న
వరయోధులను జూచి వైళంబునందు
నెల్లవారును నెఱుంగ నెసగుహస్తములు
మొల్లముగావించి మును విదురుండు
పెద్దయెలుంగునఁ బేరసి యిట్లనియె :

## విదురుని ధర్మప్రసంగము

“పెద్దలకెల్లను బృథివిలోపలను
ధర్మంబు సత్తుగాఁ దగఁ జెప్పుకున్నఁ,
జేర్మి భావంబులు పెక్కులుపుట్టు ;

నీవికర్ణుఁడు నిర్జరేశ్వరగురుని
భావంబులనుబోలఁ బహుళనీతులను
బాలుఁడై యుండియుఁ బరమధర్మంబు
చాలంగబలికెఁ బాంచాలిపట్టునను ;
[1] అతులితంబైనట్టి న్యాయంబుగాన
నతనివాక్యంబు మీరటుసేయఁదగును ;
ధర్మజ్ఞులై సభాస్థలికిని వచ్చి
ధర్మసందేహ మత్తఱి నడ్గినపుడు,
నిజముచెప్పక యున్న నిఖిలభూస్థలిని
భజనతో నసృతసద్భయముల నెప్పుడు
పొందుచుండుదురు సత్పురుషులై మిగుల
సందియేమియు లేక నెయ్యంబునందు ;
ధనలోభమునను సంతతమును సభను
నసృతవాక్యములాడినట్టి సభ్యులకు
సిద్ధించుఁ బాపంబు శీఘ్రంబుగాను ;
ఇద్దర నీయర్థ మితిహాసములను
వినఁబడెఁ ; బ్రహ్లాదవిబుధారిసుతుఁడు
జననుతుండగు విరోచనుఁడును, ధన్యుఁ
డగుసుధన్వుఁడు, నొక్కయువిదెకై యలుకఁ
దగఁ బ్రతిగ్రహము మోదంబునఁ జేయ
నేమెపెద్దలమని యిద్దరుఁగూడి
మోమోటమాని యిమ్ములఁబోరుచుండి
ప్రహ్లాదుకడ కేఁగి పస సుధన్వుండు
నాహ్లాదచిత్తుఁడై యప్పుడిట్లనియె :
“ ధర్మవిదుండవు తలఁపంగనీవు
అర్థిలిమాపాదమటుదీర్పవలయు ;

1. అతు......ధర్మంబు ? (మూ)

దెఱఁగొప్ప ధప్పున్న దేశాధిపతులు
వరుసతోఁ గములుగా వచ్చియున్నపుడు,
పెనఁగొని విల్లెక్కుపెట్టి బాణంబు
గొనకొనితొడుగంగ గుఱియేయఁబూన
ననమర్థులై తేజమఱఁగి యందఱును
వెస మర్మిచూడంగ, వృత్రారిసుతుఁడు
నలవోక నావిల్లు సవలీలనెత్తి
యెలమితోఁ గుఱి గుణమెక్కించి మించి
యలఘుఁడై బాణంబులైదు సంధించి
తలకొని మత్స్యయంత్రము పడనేసి
నన్ను గైకొనిపోవ, నరనాథులెల్లఁ
బన్నుగాఁ బైకొని పర్జన్యసుతుని
బాణజాలములను భరియింపలేక
యోణులగతిఁ బాఱి రేపెల్లఁ బొలిసి.
నాఁటిరోషంబు మనంబుననుంచి
పాటించకిపుడు నెపంబుసంధించి
సకల తేజంబులుఁ జదురొప్పు నన్ను
నకలంకగతి నీదురాత్ముఁడై నట్టి
దుస్ససేనుండతిదోషవర్తనుఁడు
దుస్సంగి [1] చండాలమూర్ఖుఁ డిట్టు
లవమానమొనరించె నాగ్రహంబునను.
ప్రవిమలయశులైన పాండునందనుల
చెలువనై గోవిందుచెల్లెలనంగ
వెలసియుండిననన్ను విరసంబునందు
నింతసేయుదురయ్య యీసభ చూడ !
నెంతయు.” నని దుఃఖమీఁదుచుండఁగను

1. చాండాలి. (మూ)

పరమపతివ్రతఁ బాంచాలి నిట్లు
సరవి యెఱుంగక సభికులుదిట్టఁ
'దొడలమీఁదికిరమ్ము తొయ్యలి!' యనుచుఁ
గడుపాతకములైన కష్టభాషణాలు
పలికియుండితి ; గానఁ బరమార్థముగను
గలనను నీయూరుకాండద్వయంబు
బలిమి నాగదచేత భగ్నంబుచేతుఁ ;
దెలియంగ నిది నాప్రతిజ్ఞ లోకమున ;
నిక్షత్త్రమొనరింతు నిన్ను నీవారిఁ
దత్క్షణంబునఁ." యని దర్పితప్రౌఢి
విలయకాలమునాఁటి వికలకృతాంతు
వడువున రుద్రుఁడై పటుగదా ఖడ్గ
కాండాసనములున్నకడ చూచుటయును,
దండపాణి చలించె; ధాత భీతిల్లె;
జగములు భయమందె; జలధులు కలఁగె;
నగములు వణఁకె; పన్నగములు మునిఁగె.
అపుడుశంకింపుచు నాసభవారు
నిపుణోక్తులరుదు వర్ణించిరిభీము ;
తమయన్నయైనట్టి ధర్మజువదన
కమలంబుఁజూచి యాఘనునాజ్ఞవేచి
యుండుచో భీముఁగుంభోద్భవ విదురు
లొండొండ భయభక్తియుక్తి నిట్లనిరి :
'శౌర్యంబుచూపెడిసమయంబుగాదు
కార్యంబుగావించు గతి యిదిగాని.'
యనుచు శాంతునిఁజేసి యట్లున్నయెడను,
దినకరతేజుని ధృతరాష్ట్రవిభుని
యనలహోత్రములాడె నద్భుతంబుగను ;
గనుఁగొనఁ గౌరవాంగనలచిత్తముల

కురువీరులెల్ల [1] సంకోచంబులేక ;
పరమార్థమిదియుఁ దప్పదు చిత్తగింపు."
మనవిని ధృతరాష్ట్రుఁ డంతరంగమున
ననిచినభీతితో నిట్టూర్పువుచ్చి
తతితోడ నట సుయోధనుని రప్పించి
చతురోక్తినిట్లను సభయెల్లవినఁగ :
"సతతంబుఁ బాండురాజాత్మనందనుల
మతివిచారింపక మఱచితి తప్పు ;
పరమపతివ్రతఁ బాండవసతిని
వరతపస్విని సత్యవతిఁ బుణ్యసాధ్వి
నిజగుణాకర నయోనిజఁ గంబుకంఠి
రజనీకరానన రాజీవనయన
మానవభామగా మదిలోనఁదలఁచి
మానవ, నీవవమాన మీసభను
జేసితి ; దోషంబుఁజేసితివీవు ;
చేసితి దప్పంగఁ ; జేసితికీడు ;
పాపాత్ములనుగూడి బాల్యంబునాఁటి
[2] చాపల్యమును మానఁజాలవు నీవు.
నీవుపుట్టఁగఁ బాండునృపతనూభవులు
ఏవెంట దుఃఖితులెంతయునయిరి ;
వారితోఁ బగగొనవల." దనిబుద్ధి
నేరుపుతోఁజెప్పి నెఱి సుయోధనుని
శాంతునిఁగావించి సకలాప్తనీతి
వంతులమాటలు వదలకవినుచు

---

1. సంకోశంబుతోడ. 2. చాపలత్వము. (మా)

## ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికి వరములొసగుట

ద్రౌపదిరావించి తనరనిట్లనెను :
"ఓపుణ్యవతి, సాధ్వి, యోగసత్యసరత,
కౌరవరాయుచున్న మాకోడండ్రలోన
నమిత [1]పతివ్రత వతిభాగ్యవతివి ;
వరమిచ్చెదను నీకు వనజాక్షి, నేఁడు
వరఁగంగ." ననిన ద్రౌపదియును నిట్లనియెను :
"ఇలనాథ, వరము నాకిఁ జాలు దేని,
దలఁపంగ ధర్మజుదాస్యంబు దీర్పఁ
గృపసేయుము." మనిన నాక్షితిపతి యిచ్చి
యుపమ నెంచియుఁ బల్కె నుచితభంగులను :
'ఇంకొక్కవరము నీకిచ్చితి నడుగు
శంకింప.' కనినఁ బాంచాలి యిట్లనియె :
"ధర్మజునలువురుతమ్ములు నెల్లఁ
జేర్చి దాస్యముమానఁ బెద్దయు నిచ్చి
హయ రథ గజ వివిధాంబరావళులు
ప్రియమున నొసగుము ప్రేమ వారలకు."
ననుటయు ధృతరాష్ట్రుఁ డావరంబొసగి :
'వనజాక్షి, యింకొక్కవరము నీవడుగు
పరమార్థముగ.' నన్నఁ బాంచాలిపలికె :
"వరవైశ్యసతికిని వరము దా నొకటి,
క్షత్త్రియసతికిని జర్చింప రెండు,
ధాత్రి శూద్రస్త్రీకిఁ దలఁపంగ మూఁడు,
పరమపవిత్ర సద్బ్రాహ్మణస్త్రీకి
వరములు నూఱైన వడి వేఁడనగును ;
కాన నాకిఁక వేఁడఁగారాదు వరము ;
భూనాథ, యీవరంబులు రెండు చాలు."

1. పాతివ్రత్యమతి. (మా)

అనవిని ధృతరాష్ట్రుఁ డతివ పాంచాలి
ఘనగుణంబులకును గడుసంతసిల్లి
పాండవాగ్రణిఁజూచి భక్తినుల్లసిలెను :
" దండితో నీవు నీతమ్ములుం గూడి
లాలిత సామ్రాజ్యలక్ష్ముల నెంతఁ
జాలభోగింపుఁడు సంతోషమునను ;
మునుపటియట్ల భూపుల నాఁగొలువఁ
దనరంగ నేలుఁ డింద్రప్రస్థపురము.
ఎఱుఁగుదు ధర్మంబులెల్లను నీవు ;
కఱటినాతనయుండు కలుషచిత్తుండు
నీకుఁజేసిన యొగ్గు నెఱయుంగ మఱవు ;
లోకంబులో గుణశ్లోకులు ఘనులు
కైకొన రధములకష్టభాషణలు ;
చేకొని మన్నింపు చెనఁటినాసుతుని.
ఏను బుద్ధులుదప్పి యిట్టిజూదంబు
పూనికావించితిఁ బుణ్యహీనుఁడను ;
గావున, నను వింతగాఁజూడవలదు ;
పావనాచార, సౌభాగ్యసంభరిత,
మీతల్లి గాంధారిమిక్కిలిఁదలఁపె
1 మాతలంపులెఱింగి మన్ననల్ చేసి,
దుర్యోధనాదుల దుర్గుణావళులఁ
గార్యముల్ గావని కైకొనవలదు.
విదురుఁడు మంత్రిగా వెలసిధర్మములఁ
బాదలినయట్టిసత్పుణ్యాధికుఁడవు.
కురుకులనిజరక్షకుండవుగాఁగ
పరవి మేలుగను రాజ్యము సేయఁదగుదు. "

1. మాతలంపెఱింగి మన్ననలసేవించి. (మూ)

అని ధర్మజునినంప, హర్షంబుతోడఁ
గనకలతాతన్వి కాంత ద్రౌపదియుఁ
బురుషసింహముల నప్పాండుజనపతుల
నరుదుగాఁ గాంతుల నంపఁగఁ జేసె.
ఆవేళ భీముండు నన్నకిట్లనియె :
" వావిరి ద్రుపదభూపాలతనూభవను
అవమానమొనరించినట్టి శాత్రవుల
బవరంబులోపల భంజించి నిన్ను
నేలింతు ధర [1]యుద్ధిమొల్లఁగా." అనుచు
ఫాలాక్షశౌర్యసంపద మించియుండె.
మృగమధ్యమున నున్న మృగరాజుభంగిఁ
దగసహోదరుల మధ్యంబున నున్న
యనిలతనూభవు నవ్వుచు వారించి
ఘనుఁడు ధర్మజుఁడు వేడ్కనునిట్టులనియె :
" ఎంతతప్పొనర్చిన నీవేళ నోర్చి
యెంతయు మీఁదట నేచి శాత్రవులఁ
దునుముద." మనుచు బుద్ధులు చాలఁ జెప్పె.
కనకరథము లెక్కి కౌంతేయుఁ దారుఁ
బోయి యింద్రప్రస్థపురవరంబునను
బాయక సకలసంపదల నుండుటయు,
నాతఁటఁ గురురాజు నాదుస్ససేను-
చేత వృత్తాంతంబు చెనసి తా వినుచుఁ
దపనజ శకునిసైంధవులతోఁ దుతను
నిపుణతఁ దలపోసి నిశ్చయంబుగను
ధృతరాష్ట్రుకడ కేఁగి తెలివి నిట్లనియె :
" [2]ప్రతిభటావళి నెన్ని భంగులనైన

1. రొల్ల. 2. ధృతి. (మా)

నణఁచుటయే నీతియని దేవమంత్రి
ప్రణుతికెక్కఁగఁజెప్పెఁ బర్జన్యసఖుఁడు ;
సంతసంబునఁ బాండుజననాథసుతుల
కెంత మేలొనరింప హితులమా మనము !
పాములనలిగించి పటుకంఠమునను
సోమించి విడిచినచొప్పున మనము
నాసమయంబున నటువోవవిడిచి
మోసపోయితిమి భూమిఁ వారలెఱుఁగ.
వాసవి విల్లు తీవ్రముగఁబట్టినను,
భీముఁడు గదగొన్న, బిరుదులై కవలు
భీమాయుధంబులఁ బెరిమఁబట్టినను
హరిహరబ్రహ్మాదులైనను వారి
నరుదుగా సాధింప నసిమొనలేరు ;
కావున వారి వేగమునరప్పించి
ప్రావీణ్యమునను [1] బావద్యూతమునను
గెలిచి పాండవులను క్షితివెడలఁగ
నలుకతోఁ ద్రోవంగ నారూఢివలయు."
ననుటయు ధృతరాష్ట్రుఁ డటుసమ్మతించి
మొనసి పునర్ద్యూతమును నాడఁదలఁచి

## పునర్ద్యూతము ; అరణ్యగమనము

ప్రాతికామినిబంచెఁ బాండునందనుల
ఏ తేర సభకును హితవాక్యములను (?)
వాఁడుఁ బాండవులను వరుసతోఁ బిలువఁ,
బోఁడిమి ధృతరాష్ట్రుభూవరునాజ్ఞ
నరుగుదెంచిరి లీల హస్తినాపురికి ;
సరవిఁ ద్రొల్లిటియట్ల సభ పెద్దలెఱుఁగ

---

1. అనుద్యూతమని. నన్నయ. పునర్దీవ్యాయభద్రం తే. అని. వ్యాస. భా.

శకుని ధర్మజునితోఁ బలికెఁ బరిహాసోక్తిఁ బల్కె :
" సకలసామ్రాజ్యంబు సంపదశ్రేష్ఠములు
ధృతరాష్ట్రభూపతి ధృతిఁ బూని యొసఁగె
నతులితభంగినా నది పొందఁజాలదు ;
క్రొత్త సురాపానము దిక్కులయందువిసఁగ ;
సత్తుగా జూదంబు సరవి నాడంగ
నోడినవారలు నొసఁగి శక్తిఁ-
గూడి సఖ్యమును సంపాదితమార్గమున
ద్వాదశాబ్దములు కాననాన మధ్యమున
మోదంబుతోఁ గందమూలఫలములు
భక్షించుచును మహాబ్రహ్మచర్యమున
దక్షతఁ జరియించి, తత్తిరోజ నొక-
వర్షంబు నజ్ఞాతవాసంబు సేసి,
హార్దజ్ఞలగులోకులటయెఱిఁగినను
వనమునఁ బండ్రెండువత్సరంబులును
మసఁజరింపుచుఁ బదుమూఁడవయేఁట
నజ్ఞాతవాసంబు నటుసల్పువారు ;
తద్జ్ఞతనొడ్డి జూదంబునీవాఁడ
నోపితివేనియు యుక్తితోనాడు
దీపించి." యనిన విధిప్రేరణమున
ధర్మనందనుఁడు జూదంబాడి యోడి
ధార్మికులును సభాస్థలివారు నెఱుఁగ.
పటుశుభాశుభకర్మఫలము లెవ్వరికి
నటనుభవింపక యరుగంగరాదు ;
కావునఁ బాండవాగ్రజుఁడు జూదంబు
దైవికంబుగనోడి తమ్ములుఁ దాను
నడవికేఁగఁదలంచి యఖిలరాజ్యమును
విడిచి సుహృద్బంధువిప్రులతోడఁ

బొదివి భీష్మద్రోణభూరికృపాది
విదురాంబికేయుల వీడ్కొనిపోవ,
నెదుట ధర్మజుఁజూచి యెంతయుఁబొగిలి
విదురుండు పలికె వివేకంబుతోడ :
" కాంతారములకు నేఁగఁగలేదు కుంతి
సంతతవ్రతశీల సాధ్వి కల్యాణి ;
అగసి పూజించెద నతిభక్తియుక్తి
పరసత మద్గృహస్థలియందు నిలుపు ;
ధర్మవర్తనుఁడవు తర్కింపనీవు ;
దుర్మదారాతి సింధురమృగేంద్రుండు
భీముండు సంగ్రామభీషణుండు ఘనుఁడు ;
భీమానుజుండు రిపుపృథివీతలేశ
నికరవిదారుండు నీతిసాహసుఁడు ;
నకులుఁడు శత్రుభూనాథభంజనుఁడు
కారుణ్యనిధి బంధుకల్ప [1] భూరుహము ;
ధీరుండు మఱి సహదేవుఁడుత్తముఁడు
పరమవిజ్ఞానసంపన్నుండు ఘనుఁడు ;
తరుణిద్రౌపది దయాధర్మంబులందు
వెలసినసతి ; గాన విశ్వభూస్థలిని
బలియురు మీరలు భాగ్యవర్తనులు ;
ఇతరులు మిము గెల్వనెవ్వరు లేరు ;
వ్రతయుక్తులనఘులు వ్యాసశిక్షితులు
విక్రమక్రములు గోవిందరక్షితులు ;
శక్రునిగురువుతో సరియైనవాఁడు
ధౌమ్యుండు మీకు నుత్తమపురోహితుఁడు ;
సౌమ్యులు మీరు రాజశ్రేణిలోన

1. భూజనుండు. (మా)

దైవమానుషములఁ దర్పింప నధికు
లీవసుంధరలోన నెన్నిభంగులను;
చంద్రసూర్యులు గాఁపు శమనుండు వహ్ని
యింద్రాదిదివిజులు నీశుండు హరియు

..............................

మిమ్ము నెవ్వరును శక్తిని గెల్వలేరు
ఇమ్మహిఁ గలరాజులెల్లఁ; గ్రమ్మఱను
వైళమే తెంచి భూవలయ మేలుండు
వాలాయముగ." నన్న నరున ధర్మజుఁడు
విదురుని సద్భక్తి వినుతించి పలికె:
"విదితకీర్తివి శాస్త్రవిశారదుఁడవు నీవు;
నీకృపగలుగంగ నేము లక్ష్ములను
బ్రాకటవిజయసంపదల నుందుము.
నీకడనుండును నెఱయంగఁ గుంతి
[1] శ్రీకర, యేమువచ్చెడియంతదాఁక."
అని విదురునియింట నటు కుంతినునిచి
యనఘులు కురువృద్ధులాజ్ఞ గైకొనుచుఁ
బోవంగఁదలఁచి యప్పుడు భక్తిఁ గుంతి-
దేవిపాదములకు దృఢభక్తి మ్రొక్క,
నా [2] కొంతిదేవియు నాత్మనందనుల
వేగంబె గనుఁగొని వేదనఁ బొంది
పలికెను: "వల్కలాంబరములు గట్టి,
నలువొప్పఁ గృష్ణాజినములు ధరించి,
మునివేషధారులై మునుకొని మీరు
చనియెదరా! వనస్థలమున." కనుచుఁ
గన్నుల బాష్పాంబుకణములు దొరఁగ
విన్నఁదనంబున వెచ్చనూర్చుచును

---

1. శ్రీకళ. 2. కుంతి. (మూ)

అతులశోకాక్రాంతయగుచు నిట్లనియె :
"సుతులార, భానుతేజోమూర్తులార,
కదిసి మీ తేజంబు గాంచకముందె
సద[1] యాత్ముఁడైన మీ జనకుఁడుత్తముఁడు
పాండుభూవిభుఁడేఁగెఁ స్వర్గపురికి ;
నుండితి నేటికి నుర్విలోపలను !
భర్తతోడనె కూడి పరలోకమునకు
స్ఫూర్తి నేఁగఁగనైతిఁ బుత్త్రులకొఱకు ;
మీ మనోవ్యథలు పేర్కొని జూడవలసె
నేమి సేయుదు !" అని యేడ్చె నంతఁ !!
యెల్లవారు నెఱుంగ నిట్లనిపలికె :
"బల్లిదులై ప్రతాపమున శోభిల్లు
పాండవేయులకునే బహుళదైన్యమున
నొండొండ వర్తింపుచుండంగవలసె ;
ఓపుండరీకాక్ష, యోరమాధీశ,
యోపుణ్యమూర్తి, నీలోత్పలవర్ణ,
కరుణించు వీరలగౌరవంబునను ;
నిరతంబు నీపాదనీరజాతములు
గొలుచుచున్నారు గైకొని ప్రోవఁదగును
విలసితంబుగ." నని వేఁడియు మఱియు
"గాంగేయకుంభజ గౌతమ విదురు
లాంగికులుండంగ నక్కట ! యిపుడు
పాండుసూనులకు నాపదపొందవలసె
మండలంబునను సన్మానంబు లేక ;
యురుదోషములకెల్ల నొడిగట్టినాఁడు
కురురాజు ; సభవారు గొంకిరిమిగుల."

---

1. యాంగు. (మూ)

ననుచు దుఃఖింపుచు నాకుంతిదేవి
ఘనుని సహదేవుఁ గనుఁగొని పలికె:
"అన్నలతో నీవు సరిగెదవయ్య!
యున్నత శైలమువలెఁ గ్రాలుచుండు.
ఒక్కఁడ వీవైన నుండితి నేను,
తక్కక తనయులందఱు నుండినట్లు
నాకు నెమ్మదిని మానసముండు." ననుచు
శోకించి ద్రౌపదిఁ జూచి నేత్రముల
వారిధారలు గ్రమ్మ వగచుచు నిట్లనియె:
"సారసనేత్ర, పాంచాలవంశమును
బాండుకులంబును బ్రబలెను నీకతన
దండిఁబుట్టుటను మోదమునఁ జొచ్చుటను.
పురుషగో రాజులు భూనుతపుణ్య
పురుషులు ఘనులు నీపురుషులు; వీరి
చిత్తముల్ రాగిల్ల సేవలుచేయు
సత్తుగా భయభక్తిశక్తియుక్తులను."
అని కుంతిదేవియు నావేళయుండుఁ
దనకు మ్రొక్కినయట్టి ద్రౌపది సాధ్వి
నాలింగనముచేసి యులర దీవించి,
చాలను బుత్త్రుల సరవి దీవించి,
సదయాత్మయైయుండె సాధ్వీలలామ
విదురుమందిరమున వెసవారు వినఁగ.

## పాండవుల ప్రతిజ్ఞలు

అమితపరాక్రమాభ్యధికుఁడై యున్న
యమసూతితో భీముఁడపుడిట్లు పలికె:
"సాహసంబున రణస్థలమున నాదు
బాహాగదాహతిఁ బగఱఁజంపుదును

దుర్యోధనాదుల దుర్మదాంధులను
క్రౌర్యచిత్తులఁ బాపకర్ముల శఠుల
నతుల కృతద్రోహులైన దుర్జనుల
మతిహీనులను మహామర్త్యనిందితుల."
అనుచు భీముఁడు వల్క, నా వేళనుండుఁ
గనలి యర్జునుఁడును గడు వడిఁ బలికె:
"అంగజారికిని బాణాసనంబైన
బంగారుకొండ నిర్భరరుచిమించును
కమనీయ మత్కరకాండాసనమున
సమరరంగంబునఁ జంపుదు నేను
కర్ణాది దుర్జనాగ్రణుల నందఱను
నిర్ణయంబుగ దేవసహాయంబు వొసఁగ."
అనుటయు నకులుండు నధికరోషమున
గొనకొని పలికె: "నాకుంతలంబు మొనను
సకలకౌరవసేనఁ జంపుదు నేను
నకలంకవృత్తి నుగ్రాహవంబునను."
అనిన సహదేవుఁ డలిగి యిట్లనియె:
"మును కపటద్యూతమున మమ్ము నోర్చు
పాపాత్ము శకుని నా బాణజాలమున
నేపారఁ దునుముదు నిందఱు నెఱుఁగ."
అనుచు నతిప్రతిజ్ఞారూఢులగుచు
ఘన కరిపురము వేగంబున వెడలి
పాండవేయులు పోవఁ, బటుధృతరాష్ట్ర
మండలాధీశ్వరుమందిరంబునను
నుదురుచు గోమాయువులు పట్టపగలు (?)
బెదరుచు నఱచెను భీషణంబుగను;
అప్రదక్షిణముగా నగ్నులు వెలిగె;
నప్రియంబుగఁ బల్కె నాకాశవాణి;

## పాండవులరణ్యమునకేఁగిన విధమును
## విదురుఁడు ధృతరాష్ట్రున కెఱిఁగించుట

"వదనసరోజంబు వస్త్రా[1]ంతమునను
బొదువుగాఁ గప్పుక పోయె ధర్మజుఁడు;
బాహులయుగ్మముచాచి పవననందనుఁడు
సాహసంబున నేఁగె జగమెల్ల నెఱుఁగ;
నిసుముచల్లుచు నమరేంద్రసుతుండు
కొసరక చనియె సంకుచితమార్గమున;
భూరేణుపుంజంబు పొదిగిన మేన
నారయ నకులుండు నరిగె శీఘ్రమునఁ;
దోడరినలజ్జ నధోవక్త్రుఁడగుచు
నడరి సహదేవుఁ డవలీలఁబోయె;
వెన్నుపైఁ గ్రుమ్మిడి వెడలంగ నేఁగు
మిన్నక ద్రుపదభూమీనాథతనయ;
కోమలకీర్తియై గురురౌద్రయామ్య
సామగానము రూఢిఁ జదువుచు నేఁగె
ధౌమ్యుండు జనులద్భుతంబందిచూడ
సౌమ్యవర్తనమున సత్యవాక్యముల."
అనవుడు ధృతరాష్ట్రుఁ డావిదురునకు
మనమున వెఱఁగంది మఱియు నిట్లనియె:
"ఈవిధంబున వారలేటికిఁ జనిరి?
భావజ్ఞ, నాకుఁ దప్పక యెఱిఁగించు."
అనవిని విదురుండు నాధృతరాష్ట్ర
జననాథుతోడను సరవినిట్లనియె:
"నీతనూభవులును నెఱయ దుఃఖముల
నీ తెఱఁగునఁ బోదు రెంతయు ననుచు.

---
1. ర్ధ. (మూ)

యమసుతుఁ డరిగెఁ జింతాక్రాంతుఁ డగుచు ;
పవనజ భీముఁడు 'సంగరస్థలమునను
జేతులు కసివోవఁ జెనకి శాత్రవుల
శాతాయుధంబులఁ జంపఁగఁగలను'
అనుచు బాహులు చాచి యరిగె వేగమున ;
'అని నింతకునుదఱచైన బాణముల
వెసనేసి రిపుల నావిరిఁద్రుంతు' ననుచు
ఇసుము చల్లుచుఁ బోయె నింద్రనందనుఁడు ;
'తనరూపు చూచి భూతలము వారెల్ల
నొసర దుఃఖంబుల నొందుదు' రనుచు
ధూళిగప్పిన మేన దోగయంగ నేఁగె
నోలి నానకులుఁ డత్యుగ్రపరాక్రముఁడు ;
'తనదీనవదనపద్మము విలోకించు-
జనులకు నగ్గులు చాలంగఁబుట్టు'
నని యాననము వంచి యాసహదేవు
చనియె గూఢాచారసన్మార్గమునను ;
తడిసిన యేకవస్త్రంబుతోడుతను
గడువడి విడిసకచభరంబునను
శోకంబుతో నేఁగె సొలసి ద్రౌపదియు
'నాకౌరవస్త్రీలు నధికదుఃఖములఁ
బొందుదు రిటమీఁదఁ బో' మ్మనునట్టి
చందంబునందును ; సమరంబునందుఁ
బాండవేయులచేతఁ బడు కౌరవులకుఁ
బాండిత్యమహిమను బరలోకగతులు
చేయింప సూచించు చందంబు దోప
నామేష నతిరౌద్ర [1] యామ్యాగమోక్తి

1. యాయాగ. (మూ)

దగఁ బతింపుచు నేఁగె ధౌమ్యుండు వడిని
దెగువతో." ననవుడు ధృతరాష్ట్రవిభుఁడు
శోకించి విదురునిఁజూచి యిట్లనియె:
"భీకరశౌర్యులు పృథివీశసుతులు
పాండవేయులు జగత్ప్రఖ్యాతయుతులు
చండాంశుతేజులు సజ్జనోత్తములు;
వారలతోడ దుర్వారవైరంబు
కౌరవేశ్వరునకుఁ గడుసముకూరె;
ఎంత చెప్పిననైన నెఱుఁగఁడు; బుద్ధి
మంతుఁడుగాఁడు దుర్మదుఁడు నాకొడుకు;
కడఁగి మీఁదను బ్రజాక్షయముగాఁగలదు
పుడమిపై." నని భయంబునుబొంది మిగుల
వెచ్చనూర్చుచు మనోవికలుఁడై యుండ,
నచ్చట సంజయుఁ డారాజుకనియె:
'పాండవేయులు ధర్మపరులనియెఱిఁగి-
యుండియుఁ దోలించితుర్వి[1]ఁ గానలకు;
చేకొంటివీవ యీసృష్టితలంబు;
నీకును వగవంగ నిరతంబు నేల!
కలశజ విదుర గంగాతనూభవుల
పలుకులు వినవైతి పరమార్థముగను;
కర్ణ గాంధారులకఱపులు వినుచు
దుర్ణీతివంతుఁడై దుర్యోధనుండు
పగయయ్యెఁ గలశజ[2] ప్రముఖ సాధులకు;
మగఁటిమిఁ బాండుకుమారులతోడఁ
దొడరుఁగా కేమి పొందుగ నీసుతుండు,
తగవక యింక నీతనయుండు దక్క-

1. వారలను. 2. ప్రకర. (మూ)

గురుభీష్మవిదురులఁ గూడి నీవరిగి
కరమర్థిఁ దోతెమ్ము కడఁగి పాండవుల.
వెరవొప్ప నీవింక విచ్చేయకున్న,
నెఱుఁగుదురే యొరు లీకార్యమునకు
నతిమతి." ననవుడు నావిదురుండు
తతితోడ సభకడ దగ్గఱవచ్చి
ధృతరాష్ట్రుతోడను దెలియనిట్లనియె :
"క్షితినాథ, యింక, విచింతింపనేల !
పటుకృప నీయెడఁ బాండునందనులఁ
దటుకున రప్పించి ధారుణీతలము
పంచిమ్ము సగఁబాలు ప్రఖ్యాతముగను ;
వంచించి వారికి వసుధయీకున్న,
మెత్తురే ! నిన్నును మేదినిలోన
నుత్తములెల్ల నత్యుచితోక్తి." ననిన
జనపతి విదురుభాషణములు వినియు
వినకుండి, విపినప్రవేశులైనట్టి
పాండవేయుల ధర్మపరుల రావింప
కుండె నుపేక్షించి కొంగిఁగిల్బిషమున.
ద్రోణుండు పాండుపుత్త్రులకు నందఱకుఁ
బ్రాణపదంబయ్యుఁ బస వారివెంట
నరుగఁడ ; ద్రుపదరాజాత్మసంభవుని
దురమున మీఁదట దునిమెడికొఱకుఁ
గలశజుఁడుండెను ఘనతరప్రీతి
వెలయంగ ధృతరాష్ట్రవిభుసన్నిధిని.
తదనంతరంబ యింద్రప్రస్థపురము
ముదమున నిరువదిమూఁడేండ్లునిండఁ
జెలఁగి రాజ్యమ్ము సుజేసి, జూదమున
నలమితోనోడి, యయ్యెడ పాండుసుతులు

అడవికేఁజనిరి బ్రాహ్మణసహస్రములు
కడువడి నేతేర గౌరవంబునను.
అనుచు సభాపర్వమందలికథలు
జనమేజయునకు వైశంపాయనుండు
వినిపించె శాస్త్రోక్తివిఖ్యాతముగను
మునిసహస్రంబు లిమ్ములఁ బ్రస్తుతింప.
పంచఘంటానాద, పాండవాహ్లాద,
పంచాస్త్రసమశౌర్య, భర్మాద్రిధైర్య,
శ్రీరంగయామాత్యశేఖరపుత్ర,
కారుణ్యనిధి, దానకర్ణావతార,
శ్రీయనంతామాత్యశేఖరోత్తంస,
కాయజసమమూర్తి, కమనీయకీర్తి,
ధర్మసమగ్రంబు తలకొన్నయదియుఁ
బేర్మిఁ బుణ్యంబులఁ బెనుపొందునదియు
నసమసాహిత్యవిద్యాచతుర్ముఖుఁడు
రసికుండు బాలసరస్వతీశ్వరుఁడు
పసనొనర్చిన సభాపర్వంబునందు
నసదృశంబుగ ద్వితీయాశ్వాసమయ్యె.

ఇది సభాపర్వము.

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయఁడు గారిచే
రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రింపఁబడినది—1942.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 21 | ద్రౌణిఁయపాండవ | ద్రౌణియపాండవ |
| 11 | 18 | వర్ధిలు | వర్ధిలు |
| 11 | 20 | కరమర్ధి | కరమర్ధి |
| 13 | 16 | మొగిఁగనన్ శల్యాఖ్యమును | మొగిఁగర్ణ శల్యాఖ్యములు |
| 16 | 21 | తపోన్నతిప్రాభవ | తపోన్నతిఁబ్రాభవ |
| 17 | 19 | దనయులఁబెలయ | దనయులబెలయ |
| 17 | 23 | యిద్ధతికోర్కి | యిద్ధఅకోర్కి |
| 18 | 12 | చిట్టముల్ | చిట్టుముల్ |
| 20 | 9 | బుద్ధి | బుద్ధి |
| 22 | 25 | యనుచుఁగొనకొని | యనుచుగొనకొని |
| 23 | 18 | పరచి | పఱచి |
| 24 | 3 | దూర్వాసుఁడు | దుర్వాసుఁడు (ఇట్లే తక్కిన చోట్లను) |
| 24 | 21 | నిడితివి; యే | నిడితివి; నే |
| 25 | 28 | పరిచ్ఛేద | పరిచ్ఛద |
| 30 | 23 | అర్ధపతి | అర్థపతి |
| 31 | 14 | మొఱమొఱ | మెరమెర |
| 31 | 17 | మానవుఁడు | మానసుఁడు |
| 32 | 19 | ప్రాణంబులుఁండ | ప్రాణంబులుఁగడ |
| 36 | 20 | అనిరుద్ధ | అనిరుద్ధ |
| 37 | 19 | వెన్నవచి | వెన్నవఁచి |
| 40 | 20 | అందఱితోడ | అందఱతోడ (ఇట్లే తక్కిన చోట్లను) |
| 54 | 12 | నేఁపుదూలించి | నేపుదూలించి |
| 58 | 14 | మాటలునుగా వోడఁబాటు | మాటలనుగా దోడఁబాటు |
| 58 | 28 | వాఁడి | వాడి |
| 60 | 11 | నేప్రొద్దు | నేపొందు |
| 61 | 8 | జొప్పడుగాన | జొప్పడుఁగాన |
| 61 | 25 | నల్లనైయుండెఁగా! నవుఁగా | నల్లనైయుండెఁ గానవుగా |
| 62 | 2 | కంటిఁజెలివి | కంటి తెలివి |
| 62 | 22 | చూడ-జామరో | చూడఁ-జామరో |
| 64 | 7 | బాయకపుత్త్రులకును | బాయక కుమారులకు |
| 64 | 15 | యనుపఁ గొనకొని | యనుప గొనకొని |
| 70 | 22 | వారిథి | వారిధి |
| 70 | 26 | తె వెస | తేవెస |
| 72 | 28 | భగ్గించి | బగ్గించి |
| 77 | 8 | గరుఁడండు | గరుడండు |
| 77 | 18 | బెనచి | బెనఁచి |
| 80 | 23 | గరుఁడని | గరుడని |
| 84 | 4 | ధారమై | ధామమై |
| 85 | 3 | వక్షస్థలము | వక్షస్స్థలము |
| 87 | 13 | చిన్నబుచ్చు | చిన్నఁబుచ్చు |
| 91 | 23 | తలచి | తలఁచి |
| 105 | 11 | వార్థి | వార్ధి |
| 127 | 10 | మెఱ్ఱచేసె | మెఱ్ఱఁజేసె |
| 128 | 19 | బందులఁగ్రుచ్చి | బందులగ్రుచ్చి |
| 131 | 1 | కాఁగాఁదు | కాఁగాదు |
| 151 | 25 | పూనుదునే | పూనుతు నే |
| 152 | 4 | రాజానకుఁదక్కి | రాజానకుదక్కి |
| 158 | 24 | శత్రుః | శత్రు (ఇట్లే తక్కిన చోట్లను) |
| 173 | 8 | నింకచెప్పక | నింకఁజెప్పక |
| 173 | 27 | హేలప్రయాణమై | హేలఁ బ్రయాణమై |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 176 | 1 | సౌంజ్ఞ | సంజ్ఞ |
| 177 | 13 | నొక్కాంత | నొక్కింతి |
| 183 | 14 | పతిపోవఁగా | పతివోవఁగా |
| 198 | 17 | నేకాతపత్త్ర్యము | నేకాతపత్త్రము |
| 199 | 10 | లంపచిప్ప | లంపచిప్పల |
| 200 | 18 | శేషునఁకు | శేషునకు |
| 201 | 7 | మడుఃగు | మడుఁగు |
| 212 | 16 | నాకికగొట్లు | నాకికనెట్లు |
| 212 | 17 | క్షేత్త్రజ | క్షేత్రజ |
| 215 | 25 | తోడరిఁ | తోడగ |
| 219 | 1 | తనుబాసె | తనుఁబాసె |
| 227 | 13 | దుర్గి | దుర్గ |
| 228 | 7 | సనయములచేతఁ | సనయములచేత |
| 230 | 5 | విల్లుఁ | విల్లు |
| 234 | 7 | యమాలు | యములు |
| 235 | 7 | రైవార | రైవాలు |
| 237 | 7 | శిఖల | శిఖలు |
| 240 | 23 | లన్నియుఁ | లన్నియు |
| 251 | 10 | బలియులు | బలియురు |
| 252 | 20 | బల్లి | బల్లు |
| 256 | 18 | చిత్రపుఁదోనలు | చిత్రపుదోనలు |
| 259 | 9 | వివరంబుఁ | వివరంబు |
| 263 | 6 | కృత్యమేలింక | కృత్యమేమింక |
| 269 | 1 | దారిద్ర్యనకును | దారిద్రునకును |
| 272 | 7 | గర్వంపుఁజాలు | గర్వంబుచాల |
| 272 | 8 | నెతిదీర్ప | నెతఁదీర్ప |
| 272 | 11 | నమ్మక | నవ్వక |
| 273 | 22 | భూపాలఁబుత్త్రుల | భూపాలపుత్త్రుల |
| 282 | 13 | చందములఁ | చందముల |
| 288 | 22 | ననుచుఁదోనల | ననుచుదోనల |
| 289 | 6 | బ్రాతి | బ్రాఁతి |
| 289 | 21 | పింజఁపింజ | పింజపింజ |
| 310 | 27 | జతుశ్శాల | చతుశ్శాల |
| 311 | 1 | దర్పింపఁజేజేయ | దర్పింపఁజేయ |
| 314 | 7 | జతుశాల (?) | జతుశాల |
| 317 | 1 | [illegible]ఖలన జే | శాఖలన్చే |
| 320 | 27 | ఇంద్రాదిసురు[illegible] | ఇంద్రాదిసురుల |
| 340 | 1 | మధుకైరినిఁనే | మధుకైరినేత్ర |
| 340 | F. N. 1 | నేత్ర | omit |
| 354 | 5 | చిత్తురువు | చిత్తరువు |
| 355 | 21 | వేదిఁనలువగా | వేదిఁజలువగా |
| 369 | 5 | ధాత్రి | ధాత్రీ |
| 371 | 9 | [illegible] | జ్వాలనంబు |
| 371 | F. N. 2 | జ్వాలనంబు | omit |
| 375 | 15 | పీఁట | పీట |
| 390 | 20 | యోగిఁగునువఁలె | యోగియుఁబోలె |
| 413 | 1 | దాక్షాయణీప్రాబోణి | దాక్షాయణిఁ బ్రాఁబోణి |
| 414 | 6 | ధ్రువగీర్తి | ధ్రువకీర్తి |
| 414 | 10 | బనులుఁ | బనులు |
| 415 | 2 | ముగ్గి | ముగ్ధ |
| 423 | 23 | వేసరి | వేసరి |
| 428 | 6 | వసుధేశ | వసుధేశ |
| 442 | 12 | గ్రస్తవోలు | గ్రస్తఁబోలు |
| 450 | 11 | జెరవ ? | జెరవ |
| 465 | 13 | దేవతుల | దేవతల |
| 472 | F. N. 2 | విస్పష్టము | విస్పష్టము |
| 474 | 20 | మిడుఁగురుఁగాడ్పు | మిడుఁగురుగాడ్పు |
| 476 | 3 | ననిచినఁ | ననిచిన |
| 493 | 11 | ధర్మరాజాని పరిపాలనా | ధర్మరాజాను పరిపాలనా |
| 499 | F. N. 2 | మూర్తివంతములు | మూర్తిమంతములు |
| 518 | 3 | నిముషంబు | నిముసంబు |
| 539 | 20 | ధరాధర | ధారాధర |
| 541 | 8 | మచ్చిక | మచ్చిక |
| 551 | 9 | బ్రహ్మాదిసురలు | బ్రహ్మాదిసురులు |
| 560 | 8 | రాజకోటలు | రాజకోటులు |
| 562 | 7 | నిమషమాత్రము | నిమిషమాత్రము |
| 606 | 9 | చెప్పజాలిన | చెప్పఁజాలిన |
| 625 | 5 | యతులు | యశులు |

## Foot Notes

| పుట | సంఖ్య | ఉన్నవి | ఉండవలసినవి |
|---|---|---|---|
| 66 | 2 | నిఘ్ను | మఘ్ను |
| 83 | 1 | ప్రసవ | ప్రసతి |
| 120 | 1 | ప్రచితంపు | ప్రచిరంపు |
| 190 | 2 | ఉచితానుభాగ | ఉచితాసుభాగ |
| 197 | 4 | యుల్లంబురానుండి | యుల్లసంబు రానుండి |
| 243 | 1 | మనమ్ముంబోదనుచు | మనమ్ముంబందనుచు |
| 250 | 1 | సంభ్రమమున | నింభ్రమమున |
| 294 | 2 | దొరసిన | దొరసైన |
| 300 | 1 | సార | సాను |
| 301 | 1 | విజిగినతగు | విజిగినటతగు |
| 336 | 1 | జఱచి | బారచి |
| 623 | 1 | ర్ధ | వస్త్రాంధ |

ఇంకేవేని పొరపాటులుండవచ్చును. పాఠకులు మన్నింతురుగాక.